ఆంధ్ర భారతము.

# విషయసూచిక

## భీష్మపర్వము — ప్రథమాశ్వాసము



## భీష్మపర్వము, ద్వితీయాశ్వాసము

## భీష్మపర్వము—తృతీయాశ్వాసము.



## ద్రోణపర్వము – ప్రథమాశ్వాసము.

## ద్రోణపర్వము – ద్వితీయాశ్వాసము



## ద్రోణపర్వము – తృతీయాశ్వాసము

## ద్రోణపర్వము – చతుర్థాశ్వాసము



## ద్రోణపర్వము – పంచమాశ్వాసము



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము





సంపాదిపదాంబుజ
నాసాగ్రనివాసరసిక ≀ నాదామృతధా
రాసారరూప వేద
వ్యాసస్యంజితవిహార ≀ హరిహరనాథా. 1

— ధృతరాష్ట్రునికడకు వేదవ్యాసుండు వచ్చుట. —

క. దేవా జనమేజయవసు,ధావల్లభుఁ డధికవినయ≀తత్పరుఁ డై సం
భావించి కుతూహలమునఁ, దా వైశంపాయనునకుఁ ≀ దగ ని ట్లనియెన్. 2

క. ఒండొరుల గెలుచుతలఁపునఁ, బాండవులును గౌరవులును ≀ బాహాగర్వో
ద్దండత నెట్లు దొడంగిరి, భండన మెప్పాటఁ జెల్లెఁ ≀ బరమమునీంద్రా. 3

క. అనుటయు వైశంపాయనుఁ, డనుమోదరసార్ద్రహృదయుఁ≀డై యి ట్లనియెఁ
జనమేజయుమనమున సం,జనితం బగుకౌతుకంబు ≀ సఫలతఁ బొందన్. 4

వ. పుణ్యక్షేత్రోత్తమం బయినయాకురుక్షేత్రంబున నారెండుదెఱంగులవారికటకం
బులును విడిసి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వనట్టిసమయంబున ధృతరాష్ట్రుండు
గొడుకులదుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది సంజయద్వితీయుం డై చింతిం
చుచున్న యెడకుం ద్రికాలవేది యగు వేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి
సేయునర్చనంబులం గైకొని యతని కి ట్లనియె. 5

క. కాలం బగుటయు నృపులకు, నాలము సమకూరె దీని ≀ కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన, [1]నే లోనికి దివ్యదృష్టి ≀ నిచ్చెదఁ బుత్త్రా 6

చ. అనుడు నతండు ఘోరముగ ≀ నన్నలుఁ దమ్ములుఁ [2]బోరఁ గ్రూరతం
గనుఁగొనఁ జాల నేను వినఁ ≀ గా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్స యన్న ముని ≀ చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరిపాటిమెయిన్ సకలంబుఁ జెప్పఁగన్. 7

1. నీలోనికి దివ్యదృష్టి ♦ నించెద. 2. బోర క్రూరతం.

వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యాసూతనందనునకు నారెంటఁ దెఱంగులవాఁడి వారాత్ర ప్రవర్తనంబులుం గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగునట్లునుం గా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబునం గాంగి భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండునట్టి ప్రభావంబుఁ బ్రసాదించి దివ్యులయాలాపంబులు రూపంబులుం దలంపులుం దెలియునట్టిమహనీయబోధంబును గలుగ ననుగ్రహించి యావైచిత్రవీర్యు నాలోకించి యిది ప్రాప్తకాలంబై వచ్చిన భూప్రజాక్షయంబు దీనికి వగవం బని లేదు ధర్మాత్మజుఁ డనుమ నిశ్చింతంబున నుండు మేనును గురుపాండవులకీర్తిఁ బ్రకటింపం గలవాఁడ నని యతని నాశ్వాసించి సాత్యవతేయుండు వెండియు. 8

క. మొగిళులు నెత్తురు సోనలు, గగనక్షోభంబు సేసెఁ గరిమాయతతిఁ బె
ల్లుగ నస్త్రములం జొచ్చెను, మృగములు పక్షులను బసులుఁ గ్రవ్యాదుల నీనెన్.

క. నలువురు నేవురు బిడ్డలు, గలిగెడి రో [illegible] వనితాగర్భంబున వా
రలు పుట్టినపుడ యాడుచుఁ, గలకల నవ్వుచుఁ, జెలంగఁ గని యొద పొందున్. 10

తే. అర్కునుదయాస్తమయములయందుఁ గృష్ణ
కాంతి ఘోరకబంధంబు గప్పఁ జొచ్చె
నిందులాంఛనస్థితి యలక్షితంబు గాఁగఁ
దోఁచు చున్నది ప్రజ యెల్లఁ ద్రుంగు టెన్న. 11

వ. విశేషించియుం గౌరవనికేతనంబులఁ గేతనంబులఁ బొగ లెగయుటయు నాయుధంబులు మండుటయు నివి మొదలుగా ననేకదుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి కులక్షయంబును నానానరేంద్రనాశంబును నగు నుపేక్షింపందగదు దుష్పథవర్తు లగుదుర్యోధనాదికుమారుల వారించి నీతమ్మునిపాలితనికొడుకుల కొసంగి శాంతి సేయుట మేలు మముబోంట్లమనంబులకుం బ్రియంబు గాని యీరాజ్యంబు నీ కేటి కనిన విని యమ్మనుజేంద్రుం డమ్మునీంద్రున కిట్లనియె. 12

చ. హితమును ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్ను నా
సుతుల నయంబుమైఁ దఱిమి చూచితి [1] వారలఁ బంపు సేయ నేఁ
జతురుఁడఁ గాను బ్రాభవము సాలదు నాదెసఁ దప్పు లేమి మీ
మతిఁ దలపోసి యీపలుకు మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్. 13

వ. అనిన విని పరాశరసూనుం డది యట్లుండని యింక నే మేనియుం జెప్పవలయు నది గలదే యని పలికిన నాంబికేయుండు గయ్యంబున [2] గెలుపుదెలుపునిమిత్తంబు లడిగిన నమ్మునివరేణ్యుండు వహ్నులు హోమకాలంబునం బుణ్యగంధంబులతోఁ బ్రదక్షిణార్చు లగుటయు భేరీప్రముఖంబులు గంభీరఘోషంబు లగుటయు

1. వారలు పంపు సేయ రేఁ, 2. గెలుపునిమిత్తంబు.

వాయువు లనుకూలమృదుమనోహరప్రచారంబు లగుటయు నివి మొదలుగాఁ
గొన్ని శుభసూచకంబులు నిర్దేశించి కొంచెము పెద్ద యున లేదు సమరంబున
జయంబు దైవాధీనంబు గావునం బెద్దలు పెనఁకువ లొప్ప వని చెప్పుదు నేను
బోయి వచ్చెద నని చెప్పి సముచితప్రకారంబున నంతర్ధానంబు సేసెఁ దద
నంతరంబ యక్కౌరవేంద్రుండు గొండొకసేపు చింతించి నిట్టూర్పు నిగిడించి
సంజయున కిట్లనియె. 14

ఉ. భూమికి గాఁగఁ బ్రాణములు పోక దలంపక రౌద్రఘోరసం
గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంతదీపాకో
భూమి మునీంద్రసంగతి సుబుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధనిరూఢముగా సమస్తమున్. 15

వ. అనిన విని సంజయుం డతని కిట్లను నావొఱిగినంత మేర నెఱింగించెద భూతత్త్వ
ప్రకారం బవధరింపుము.

— సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట. —

తే. అధిప నానాప్రకారచరాచరంబు, లింద వేర్వేఱ జనియించు నింద పెరుఁగుఁ
బిదప నింద యడంగు నీపృథ్వి దాన, సకలమునకుఁ బరాయణస్థాన మరయ.

వ. అదియునుం గాక విను మాకాశంబునకు గుణంబు శబ్దంబు వాయువునకు శబ్ద
స్పర్శంబులును దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును నప్పులకు శబ్దస్పర్శరూప
రసంబులును గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధాత్మకం బైన గుణసము
దయంబంతయుం గలదు గావున నిమ్మహాభూతంబు లేనింటిలోనం బృథివి
యెక్కుడు దీనియున్నవిధంబు వివరించెద నాకర్ణింపుము. 18

సీ. ధాత్రీశ మేరువుదక్షిణంబున సుదర్శన మనునభిధానమునఁ బ్రఖ్యాత
విస్తార మై రెండువేలు నేనూఱుయోజనముల పొడవు నై సరసమధుర
విపులశాశ్వతఫలవితతిసమేత మై, యొక్కజంబూతరు వొప్పి యుండు
దాని పండులు మహీస్థలి మహారవముగ ననిశంబుఁ బడి రాలి యవిసియుండు
ఆ. వానిరసము పొంగి వాహినీమూర్తి న,న్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ
నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము,లందుఁ జొచ్చి పాఱు నంబుధికిని.

వ. జంబూనది యనం బరఁగినయాతరంగిణినీరు సోఁకిన వోల్లలను సువర్ణం బగుటం
జేసి కనకంబునకు జాంబూనదం బను నామంబును గలిగెఁ దదీయజలపానంబు
సేసినమానవులకు ముదిమియుం దెవులును దప్పియు లే వని చెప్పుదు రయ్యేటి
పడమటం జెఱఁగి పటువు గలిగి శరనిధిచందంబున జంబూషండంబు గాలుకొను
చుండు నింతటికిం గారణం బగు నయ్యాజంబూవృక్షంబు పేర నీద్వీపంబు జంబూ
ద్వీపంబును సుదర్శనద్వీపంబు నన నెగడి లవణసముద్రవేష్టితం బయి పొల్చుచు
నద్ధివియుండు. 02

సీ. నిషధంబునం దూర్పును బడమరనై రెండు గడలు నంభోనిధిఁ గదిసి యుండు
రత్నమయంబులు రమణీయములు సాధ్య,సిద్ధచారణగణసేవితములు
నై హిమాచలమును నావల హేమకూ,టంబును నట నిషధంబు నొప్పు
లలితంబులైన నీలశ్వేతశృంగవం,తంబులు క్రమమునఁ దనరి పొలుచు
ఆ.[1]విపులమూఁటి కవల నవులయమ్మూఁటికి, నివలఁ దేజరిల్లు దివిజనగము
గమలకర్ణికానుకారియై కాంచన,మణిమయత్వమహిమ మహిత మగుచు. 21
తే. అతిదృఢం బగునాఁతు పదాఱువేల,యోజనము లంద్రు దానికి రాజముఖ్య
వింద మెనుబదినాలుగువేలయోజ,నంబు లని హేమధాత్రీధరంబు పొడవు. 22
వ. ఇవ్విధంబున భూమధ్యంబున నున్నయమ్మేరుమహీధరంబున దేవతలును దేవ
మునులును గంధర్వకింపురుషాదిదేవయోనులును దేవేంద్రప్రముఖదిక్పతులును
బరమేష్ఠియుం దత్తత్ప్రదేశంబులఁ బుణ్యావర్తనంబులం బరమసుఖంబు లనుభ
వింతు రుత్తరతటంబునం గర్ణికారవనంబున గౌరీసమేతుం డై సిద్ధగణంబులు
పరివేష్టింప విశ్వేశ్వరుండు విహరించు చుండు. 23
క. తొమ్మిదిఖండములై వర్షమ్ము లనం జాల నొప్పెసఁగుజంబూద్వీ
పమ్మునజనపదము లివి విను, మమ్మహి[2]తాంశములు దెలియ ననువర్ణింతున్. 24
వ. ఉత్తరసముద్రంబు శృంగవంతంబుమధ్యమం బైరావతవర్షం బన నొప్పు శ్వేత
పర్వతశృంగవంతంబులనడుమ హైరణ్మయవర్షం బనం బొలుచు నీలశైలోత్తర
దక్షిణదేశంబులు క్రమంబున రమణకవర్షంబును నిలావృతవర్షంబును ననం
జెలువమగు మేరువునకుం బ్రాచ్యప్రతీచ్యంబు లగుభాగంబులు వరుసన భద్రా
శ్వవర్షంబును గేతుమాలావర్షంబు ననం బొగ డొందు హేమకూటోత్తర
భూమి హరివర్షం బన నెగడు హిమవంతంబునక్కడయు నిక్కడయు నొలిన
కింపురుషవర్షంబును భారతవర్షంబును ననం బెంపారు నిట్లున్నదీనియందు. 25
క. భారతవర్షముఁ దొడఁగి మ,హీరమణ యుదీచ్యములన యెక్కుడు బలస
త్త్వారోగ్యాయుస్సుఖపు,ణ్యారంభగుణంబు లంతకంతకు నరయన్. 26
వ. అనిన విని వైచిత్రవీర్యుండు సమస్తద్వీపంబులు సకలజలనిధులు నున్నపరిపాటి
యుం బ్రమాణంబులుం బ్రకాశంబుగ నెఱింగింపుమనుటయు సూతసూనుండు
జంబూద్వీపవిష్కంభంబు కొలఁది యెనుబదివేలునూఱుయోజనంబులు దీని
రెం డంతలు దొడంగి లవణేక్షురససురాఘృతదధిక్షీరశుద్ధజలమయంబు లయిన
మహార్ణవంబులవిష్కంభంబులు క్రమంబున నొకటి కొకటి రెట్టి యై యుండుఁ
బ్లక్షద్వీపశాల్మలద్వీప క్రౌంచద్వీప కుశద్వీపశాకద్వీప పుష్కరద్వీపంబుల విష్కం
భంబులును జంబూద్వీపవిష్కంభద్విగుణప్రమాణంబు మొదలుగా నొలి నొకటి
కొకటి యినుమడియైయుండు నయ్యాఱుదీవులును జంబూద్వీపంబుకంటె నెల్లదా

1. విపులమూఁటి కవల నవులమూఁటి కివలఁ దేజరిల్లుచున్న దివిజ, 2. తాంతరము తెలియ,

నను బొగడ్తవడి యనేకపర్వతంబులనునానానదులనుబహుజనపదంబులనునొప్పి వరుస నొండొంటికి గుణవిశేషంబుల నధికంబులై యందు నింతకుం గర్తయు భర్తయు హర్తయునై దుగ్ధాంబుధియుత్తరంబునం గనకమయంబైయష్టచక్రంబును బ్రభూతభూతయుక్తంబును మనోజవంబును నగుమహానీయశకటంబున వినోదపరాయణుం డై నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుం డై విహరించు చుండు నని చెప్పుటయు నతండు. 27

క. భారతవర్షమునకుఁగాఁ, గౌరవ్యులును బాండవులును గాంక్షం గడుఁ బె
ల్లౌరాసి యొండొరులతోఁ, బోరం దెగి రిట్టిలుబ్ధబుద్ధులు గలరే. 28

వ. అనిన విని యమ్మనుజపతికి సంజయుం డిట్లనియె. 29

ఆ. అధిప పాండుసుతుల కరయంగ నతికాంక్ష, లేదు లుబ్ధబుద్ధి నీదుసుతుఁడు
శకునిపలుకు విని యసన్మార్గవృత్తికిఁ, జొచ్చి యిట్టిరొదకు దెచ్చికొనియె. 30

సంజయుండు ధృతరాష్ట్రునకు భారతవర్షంబునం గలవిశేషంబులు సెప్పుట.

క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచుకొఱకుయిక్కోలున భూ
రమణులుఁ గొందఱు వచ్చిరి, సమగ్రసఖ్యమునఁగూడుకచందమునఁ దగన్. 31

తే. వారి నన నేల తొల్లియు వసుధకై య
నేకనృపతులు [1]పోరాడి రిట్లు నేల
[2]వ్రాలి కాదె భగీరథరఘుయయాతి
నహుషముఖ్యులు విశ్రుతోన్నతులు గనిరి. 32

వ. భారతవర్షంబునయుదారవిభూతివిలాసంబున కాసపడి యీసునం బెనంగ కుండుదురె దీనివిస్తారంబు వినుము వివరించెద. 33

ఆ. మలయ మనఁగ శుక్తిమంతంబు నా వింధ్య
మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర
మనఁగ ఋక్షవంత మన సహ్య మన నిందుఁ
గులనగంబు లేడు వొలుచు నధిప. 34

వ. వీనియందు వివిధమణిగణంబులు సముపార్జింప వచ్చు నవిన ఖనివిశేషంబులు సెప్పనేల మఱియు నుపమహీధరంబు లనేకంబులు కలిగి యుండు వానియందు. 35

క. ఇనుమును రాగియుఁ దగరం,బును వెండియుఁబసిఁడియుం బ్రభూతములై పే
ర్చినసిరిఁ జేయఁగ నొప్పెడు,ఖను లెడనెడఁ బెక్కుగలవు కౌరవనాథా. 36

క. వెండియు ధనార్జనంబులు, గొండలవలనన ఘటించికోన నగు నేర్పుం
దండితనంబును బాడియు, నొండొంటికి మిగులఁ గలిగి యున్నట్లుఁ జనన్. 37

వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు వేదవతియుఁ గృష్ణవేణియుఁ బెన్నయు యమునయుఁ దమనయు శరావతియుఁ గావేరియు గోదావరియు నర్మదయు

1. పోరాడ • రెట్లు. 2. వ్రాలఁ గాదె

బాహుదయును సరయువును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు ననుమహానదులు మఱియు ననేకనదీవిశేషంబులునుం గలిగి వీనివలన నానా ముఖంబుల ధనధాన్యాదిసంపదాగమంబులు సొంపు మిగిలి యుండు. 38

క. ఎడనెడఁ బొడపై యొప్పెడి, యడవు లనేకములు వానియం దగ్ధము సే
సెడు నెరవులు పెక్కులు సొం, పడి యుండు నయంబుతోడి బలిమి గలిగినన్. 39

వ. పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మాళవ కళింగ కులింగ కుకుర కొంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాల్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయాశ్మంతక కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంతలావంతి కాననాదిజనపదంబులు సప్తసప్తసంఖ్యాసంపాదనంబు లయినగుణ విశేషంబుల వెలసి పురుషార్థంబు లగుధర్మార్థకామంబులకుం గారణంబులై కమనీయంబు లగుచుండు. 40

క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడఁ బాడి నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగడొం, దిన రాజున కుర్వి గామధేనువు గాదే. 41

ఆ. వెరవు లావుఁ గలుగు నరనాథు లింత దే, శంబు గలదు తమకుఁ జాలు ననరు
దండ్రి బిడ్డ యన్నదమ్ముఁడు నా కాత్తి, పోయి పోటు లాడి పుడమిఁ గొండ్రు

క. కావునఁ గౌరవపాండవు, లీవసుధకునై యనేకు లెగ్గే దైవం
బేవంక నాతె వారిక, [1]పోవ్వం గా [illegible] ద్ర పాలకు మిగెన్. 43

వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో నీ విం కసంగరంబుఁ జూడం బొమ్మని సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారతరణప్రకారం బనుసంధించి యతండు కతిపయదినంబులకుం జనుదెంచి దగిన తెఱంగునం గాంచి, 44

క. కౌరుకులజన నెవ్వగఁ జేడ్పడి వందితి యున్నయాస్పృహాలు నడుగుచుం
బడి భీష్మపాటు సెప్పుచు, నడలి కరుణనాద మెసఁగ నాక్రందించెన్. 45

వ. అయ్యేడ్పుతో సిట్లని విలాపంబు సేయు. 46

సీ. ఆత్మయోధుల కెల్ల నాధార మగునట్టి, తనకు నస్త్రంబు లాధార మయ్యెఁ
బరశురామునకు మేల్సరి యైనతనయందుఁ, గలిగె భంగంబు శిఖండిచేత
జనపతి దను నచ్చెరమును జూడ మొనరించెఁ, దాను గయ్యంపుజూదమున నోడె
దనరారు వెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ, నొఱలుచు నేలకు నొఱగె నేఁడు

ఆ. తీవ్రబాణజాలదీప్తులు వరఁగించి, పాండుతనయసైన్యబహుళతమము
లీలఁ బదిదినంబు లోలి వినోదించి, యధిప భీష్మభానుఁ డస్తమించె.

---

1. భూవర విను జయము గల్గఁ [illegible] అని అచ్చుప్రతి

క. పదివేవురు రాజుల దన, కెదిరి పొలిసి రా శిఖండి § యేమిటివాఁ డై
తుదిఁ బోయి తన్ను నాజిం, గడియుచుఁ బొలియించె నిటుతిఁ § గడవఁగవశమే.

తే. చాపవక్త్రుండు భల్లదంష్ట్రావితాన, ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ
జిహ్వికాభీషణుండు నరసింహమూర్తి, గాక కేవలనరుఁడె గంగాసుతుండు. 49

—ధృతరాష్ట్రుఁడు భీష్మమరణంబు విని పలవించుట.—

వ. అని సంజయుండు పలవించుపలుకులకుఁ జిత్తంబు జల్లని యుల్లంబోయి మూర్ఛిల్లి
కొండొకసేపునకు శిశిరవిధానంబుల సేద దేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరంగ
గద్గదకంఠుండై . 50

క. దేవాసురవరు లొక్కటి, యై వచ్చినఁ జిక్కువఱుపు § నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండికి, రావలిపా లయ్యె నేమి § యనఁగల దింకన్. 51

ఉ. అంచితతాలకేతుకిరణాళి మెఱుంగులు గాఁగ మార్వి మ్రో
యించుట గర్జచందముగ § నేచి విరోధిదవానలంబు మా
యించుశితాస్త్రవర్షమున § నిట్టిది భీష్మమహాభ్ర మెట్లడం
గించెనొకో శిఖండి పవనప్రతిమానము డాఁకి దైవమా. 52

తే. పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు, సెలువ సీమ్మగుదీవి గా నిన్నుఁ దలఁచి
యుండు నత్యంతతుచ్ఛశిఖండిపల్వ, లాక్రమంబున మునిఁగితే § యకట తండ్రి.

ఉ. వీరరసాంబుపూరము § విస్రుతబాహుమహోగ్రసత్త్వము
జారుగదాధ్వజాచలవిశాలము సంబరజాలవీచికా
స్ఫారము నైనభీష్మఁ డనుసాగరముం గడవంగ నీఁదఁగా
నేరమి యెట్లొకో కలుగ § నేర్చె శిఖండికి నేమి సేయుదున్. 54

తే. అంబకై పూనివచ్చు బహ్లాధిపుండు, జామదగ్న్యుండు సాధింపఁ § జాలకున్న
వాని భీష్ముఁ బాండవులకై § పూని వచ్చి, కడిమి సాధించి తౌర శిఖండి పోర.

క. ఆశౌర్యం బాసత్త్వం, బాశీలం బాపరాక్రమాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు న, నాశము లని భీష్ముఁ బెద్ద § సమ్మతిమి గదే. 56

వ. అని బహుప్రకారంబులం బలవించి యాసూతనందనుచే సేతం గీలించి.

సీ. అతఁడు నొచ్చినతెఱి § నడ్డంబు సొచ్చెద, మని వచ్చువారు లేరై రెరె యచట
నడరి పోరాడక § యన్నియక్షౌహిణు, లొప్పరికించెనే § యొకనిఁ గలన
నతని నోర్వఁగఁ జాల § వని సిచ్చిలించితి, మంతకు నోపెనే § యరిబలములు
ద్రోణుండుఁ గృపుఁడును § ద్రోణసుతుండును, శల్యుండుఁ గ్రేంచివిచనిరె యపుడు

తే. పాండుసుతులు శిఖండియుఁ § జండశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ § వెఱచి తాత
విడిచి నాపుత్త్రులందఱు § విఱిగియడవిఁ, గలసిరొకొ యాతనికిఁ బరవలసెనకట.

వ. దేవవ్రతుండు దెగినయప్పుడ తక్కినయంతవట్టునుం దెగియెన కాఁ దలంచెద
నని మఱియు నిట్లనియె. 59

సీ. కులగురు వృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ, జంపి రాజ్యము సేయు సమ్మతించి
తొడరినపాండుపుత్త్రులకును దైవంబుఁ, దోడయ్యె ధర్మంబు గీడుపఱిచి
పరఁగి యధర్మంబు వెరఁగిన ట్లున్నది, వార లాతనిఁ గూల్చి వసుధఁ గొనఁగ
నిశ్చయించుట గడు నిష్ఠురత్వము దాని,కంటెను బాపంబు గాదె మనకు
తే. సంగరంబున నాతండు సచ్చు టోర్చి, సంపదకుఁగాఁ బెనంగినఁ జంద మరయఁ
గులములం దెల్ల నీరాచకులము సాల, బెట్టిదం బిక్కులంబునఁ బుట్టె నగునె.
వ. అని పలుమాట లాడి వెండియు. 61
ఆ. మగఁడు లేనిమగువ మూఢిక్క గా కున్నె నా,సేన భీష్ము లేమిఁ జేసి నేఁడు
కురుకుమారు లెంత గుందిరో యెవ్వ రే, మైరొ యింక నెట్టులగుదురొకొ.
క. రాజులు మంత్రులు నని యెవ్వ,నా జూదరు లాత్మ నేమి యని తలఁచిరొ యే
యోజం బలికిరొకో తమ, రాజికి నిట మీఁద నెవ్వ రాధారంబో. 63
వ. అని పలికి సంజయుకరంబు విడిచి కయ్యం బెయ్యెడం బొడిచిరి పదిదినంబుల
నుభయబలంబులవారలు నెవ్విధంబున మోహరించి రెవ్వ రెవ్వ రెప్పు డెప్పు
డేమి చేసి రిన్నాళ్ళు గాంగేయుఁ డెబ్భంగుల సంగరంబు సేసెఁదుది నెత్తెఱంగునం
దెగియె నంతయు వివరించి పరిపాటిం దేటపడం జెప్పుము. 64
ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్నవా
కట్టెఁడివీను లేమి వినుకాటియ కోర్వవు దుర్వినీతికిం
బుట్టినయిల్ల నై వినక పోవఁగ వచ్చునె యింక నాకు నే
డిట్టెఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా విన నేర్తు సంజయా. 65
వ. అనిన విని సంజయుం డతని కి ట్లనియె. 66
ఆ. అధిప నీవు సెప్పినట్టిప నీతువి,నీతిఁ జేసి ధర్మనిరతు లైన
పాండుసుతుల కన్నిపాటులు వాటిల్లె, నింత దెచ్చికొంటి వంతసేసి. 67
క. కీ డొనరించినవారికిఁ, గీ డగు టరుదయ్యె మేలు గీ డేమియు నీ
వాడక విను ననుఁ గయ్యముఁ, జూడఁగఁ బుచ్చుట వినంగఁ జూచియ కాదే 68
క. వేదవ్యాసమునీశ్వరు,పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తిరసైకా
స్వాదనసుకరానందో,త్పాదనదివ్యమతి నగుదుఁ దగ నెఱిఁగింతున్. 69
వ. అనిన నాంబికేయుండు నట్ల కాక యెఱింగింపు మనుటయు సంజయుండు. 70

—సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధంబు సెప్పఁ బూనుట.—

ఉ. ప్రాంశుఁ బయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజవవార్ధత త్త్వవి
న్నంశయ కారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్ 71

వ. అని పలికి పారాశర్యుం జిత్తంబుననిలిపి నమస్కరించి ధృతరాష్ట్రున కిట్లు

క. వినినదియును నెయ్యెడ నేఁ, గనినదియును మునికృపం బ్రకాశం బై తోఁ
చినయదియును విశదంబుగ, వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్.

వ. ఆరాత్రి నిన్ను వీడుకొని మనదండునకుం జని నీకొడుకునగరు సముచితప్ర
బునం బ్రవేశించునప్పు డతండు గాంగేయాదికౌరవులును దగు రాజులును
వేష్టింపం బరిమితస్థానంబుననుండ నేనునుం బొడసూపి యుతనియాదరణంబు
కొలిచియుండితిం బదంపడి సమరవిషయంబు లైనసంభాషణంబులసమయ
నమ్మేదినీశ్వరుండు దుశ్శాసనుం గనుంగొని యి ట్లనియె.

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకుఁ
గయ్య మయ్యెఁ బెద్దకాలమేని
నెదురు సూచుచుండ నొదవె నివ్విధ మిందుఁ
బూని చేయ వలయుపని వినుము.

క. కన్నాకు మనకు భీష్ముం, డెన్నఁగవరుఁ గావ వలయు నెమ్మెయి నైనం
దన్నుం గాచిన నితఁడు జ,గన్నుతముగ రణమునం బగఱ నడఁగించున్.

ఆ. ఎల్లవారిఁ గాచు నితఁ డని యొప్పడుఁ, దలఁతు మితనిఁ గావ వలయు
[1]యని తలంచె దేని వినుమిందఱకు నిది, వినఁగ వలయునట్టిపని కుమా

వ. సత్యవ్రతుం డగునిమ్మహానుభావుండు.

క. వినుఁ డన్య లెవ్వరును నా,మునుమునఁ బడి బ్రదుక రాలమున నేను శిఖ
డిని నోర్వఁ జాలఁ జుండీ, యుని మనయుద్యోగవేళయప్పుడ చెప్పెన్.

ఉ. ఏమటి రక్ష సాలనిమృగేంద్రుని నక్కయుఁ గొలువుచ్చు సం
గ్రామములోనఁ గ న్గలిగి కావక దక్కిన నాశిఖండిచే
నీమను జేంద్రుఁ గొల్పకమె యిట్టిది గొల్పులి నిద్రపోవ ను
ద్దామబలంబుమై గొఱియ దాఁకి వధించినయట్లు లుండ దే.

క. కావున నీయుద్భటరథి, కావలి నివ్విభునిఁ గాచునట్టుగఁ బనుపం
గా వలయు మీర లందఱు, నేవలఁ జూచిన శిఖండి కెదుపుం దెవ్రునన్.

వ. అని నియమించి కొలువు విరిసి చని యుచితవిధంబున నుండె నంతఁ బ్రభ
బగుటయు నమ్మహీపతి పడవాళ్లం బనిచి బలుమానుసులను బలంబు
బవరంబునకు వెడల నియోగించిన శంఖదుందుభిప్రముఖమంగళతూర్యనిన
బులను నన్యోన్యసాధనంబులు సమకట్ట సముచితపరివారంబునకుం జెప్పెడుద
పలుకులగంభీరనాదంబులను [2]గట్టుబట్లుకడలఁ దిగిచినం జెలంగుకరితురంగ
బృంహితహేషితఘోషంబులను బూన్పం దగుచురథంబులనేమిస్వనంబు
బెలుచ నొండొరులం బిలుచుపదాతులయెలుంగులవిపులధ్వనులనుం జే

1. యనియెదెనిఁ దెలియు వినుు. 2. గట్టుబట్లుఁ గదలం.

మహారథకంబున శిబిరంబు చంద్రోదయఘూర్ణమానమహార్ణవంబును గ్రేణిసేయు
చుండె సూర్యోదయం బైన సైన్యంబులు సెలంగుచు వెడలునప్పుడు. 82

తే. కనకభూషణజాలంబు § తన గజము, [1]లెరవళులఁ బ్రోవుకొండల § సెనసి యొప్పె
వల్గనంబుల హేషల § వలన నబ్ధి, ఘనతరంగంబు లనఁ దురంగములు వొలిచె

క. అరదములు నపరణలతోఁ, బర పై యొక్కొక్క యూరి § పరవున నరిగెం
బడసనిసలుకల నాకృతి, పరుషత నసు రాలివోలె § భటతతి మెఱసెన్. 84

వ. అట్టియెడ. 85

మ. పరిధానంబును దేహ నశ్వములుఁ జాపంబుం బటిస్ఫీతవ
జ్రరుచివ్యాప్తసువర్ణతాళమయచంచత్కేతువుం వర్మముం
గర మొప్పం దెలు పారు [2]వెల్గొమగుతో § గంగాసుతుం డాసుధా
కరుఁ డంబోలె వెలింగె దర్ప మెసఁగం § గౌరవ్యసైన్యాబ్ధికిన్. 86

సీ. కాంచనమణిమయ § శకటకనత్కేతనో, జ్జ్వలవిభ్రమం బొప్పఁ § గలశజుండు
కనకగోవృషసాంద్ర § కాంతికాంతిధ్వజ, విభవవిలాసంబు § వెలయఁ గృపుఁడు
మణిసింహలాంగూల § మహిత కేతుప్రభా, స్ఫురణంబు మెఱయంగ § గురుసుతుండు
రత్నశిలారశ్మి § రాజితకదలికా, మహిమ శోభిల్లంగ § మద్రవిభుఁడు

తే. వెడలి తమతమచతురంగ § వితతు లెల్ల
నుచితగతి నాల్గు నంగఁ జేయుచుఁ గడంగి
సంగరోత్సవసంభృతో § త్సాహు లగుచు
నగుచుఁ దగుమాట లాడుచు § నడచి రెలమి. 87

క. సమరక్రీడాసన్నా, హామ లొప్పఁగఁ దక్కఁ గలుగు § నట్టివారలు ద
ర్పము పల్లవింప వెడలిరి, దమతమ కేతువులు గ్రాల § ధరణీనాథా. 88

వ. వా రెవ్వ రంటేని వినుము. 89

క. కల్పితదృఢచతురంగా, నల్పం బై, గండు మిగిలి § యాదవబల మా
కల్పోజ్జ్వలతఁ గొలువ నవి, కల్పుఁడు కృతవర్మ సనియె § [3]గాఢస్ఫూర్తిన్. 90

క. రథములు దఱిఁ జై చెలువగు, పృథుసైన్యము తోడ బంధు § బృందముఁ దానుం
బ్రథనోత్సుకవృత్తి మహా, రథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ § బ్రస్ఫురితగతిన్.

మ. చలదుర్వీధరలీలఁ గ్రాలుమదవ § త్సామోద్భవస్తోమ మ
గ్గల మై యేచినసేన లొప్పఁగ దిశల్ § గంపింప విందానువిం
దులుఁ గాళింగమహీవిభుండు భగద § త్తుండున్ భవత్సేనయో
ధులకుం గన్నులపండు వై నడచి రు § త్తుంగాంగసంరంభు లై. 92

క. శౌడుకులుఁ దమ్ములు గుఱ్ఱపు, దడములుఁ బెక్కైన బలవి § తానముఁ దగు వై
నడపించుచు మొలవున సం, గడములతో నరుగు శకుని § గడు నొప్పారెన్. 93

1. 'లెరవగులు వోవు' అని పెక్కుప్రతులు. 2. 'మేల్గొడుగు' అని యొక్కప్రతి. 3. కాంతిస్ఫూర్తిన్.

మ. తనతోఁ గాల్వురు సాలఁ గల్గుబలసంతానంబుతోఁ బ్రీతిఁ బు
త్త్రుని వీరోత్తము సోమదత్తు విలసద్దోర్దర్పదుర్దాంతుఁ బౌ
త్త్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణి సేయంగనే
చినపెం పొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్. 94

వ. కాంభోజరాజగు సుదక్షిణుం డక్షీణవిభవంబున వెసలె మఱియుం గోసలపతి యగు బృహద్బలుండును మాహిష్మతీపురనాథుం డగు నీలుండును త్రిగర్తేశ్వరుం డగు సుశర్మయు నసురేంద్రు లగు నలంబసహాలాయుధులును సాల్వసౌవీరశూరసేనాభీర యవన వసుధాధిపులును లోనుగా ననేక దేశాధీశులు నక్షయచతురంగబల సమన్వితులును నిజధ్వజవిరాజమానులు నానాభరణోజ్జ్వలాంగులును నయి సంగరకౌతుకంబు మొగంబులం దొంగలింప సరిగి రివ్విధంబునం బదియక్షౌహిణులు నడవం బదునొకండవ యక్షౌహిణితోఁ గురుక్షోణీవల్లభుండు విస్ఫురిత భూషణభూషితంబైన గంధసింధురంబు నెక్కి వెలిగొడుగులు మెఱయం దొడవులం దఱ చైనవజ్రంబుల యుద్దామంబు లగు దీధితిస్తోమంబులును జామరంబులుం గలయం బొలయ బహురత్నప్రభావిభాసితం బయిన భుజంగకేతనంబు గ్రాలఁ గెలంకుల దుశ్శాసన దుర్మర్షణ వివింశతి వికర్ణాదు లగు సోదరులు వాహన[1]వల్గనంబులు మెఱసి మెఱుఁగారు తమతమ సిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చనుదేరం జనిమె నిట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండ గదా దండ కుంత క్షురికా ముసల ముద్గర తోమర పరశు భిండివాల శూలప్రముఖనిఖిలహేతివ్రాతంబులను భర్మవరి కర్మనిర్మాణశోభితవర్మంబులను వివిధవర్ణవిచిత్రతనుత్రాణంబులను మణిగణోజ్జ్వల జ్వాలాజటిలకేతనంబులం బరమభీలసుందరసమ్మర్దం బయ్యె నట్లున్నయప్పుడు.

తే. అమరుతొడవులవజ్రాంశుకలంచపింఛ, శరణిహరినీలములఁ బేర్పుకాంతి యళుల
పగిది మాణిక్యరుచిపద్మకభంగి మెఱయఁ, గురుబలంబు గెందామరకొలనిఁబోలె.

వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభుల నెల్లం గూడం బిలిపించి వారలతో నిట్లనియె.

—❀ భీష్ముఁడు నిజయోధుల కెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట. ❀—

క. ఆరయ వివృతస్వర్గద్వారము రాజులకు నాహవం బందు మహో
దారులు దొల్లియు నరిగిరి, మీ రీమార్గమున నడవ × మెయికొను టొప్పున్.

క. ఇంటం దెవులునఁ జచ్చుటఁ కంటెను బాపంబు లొండు × గలవె నృపులకున్
[2]బంటకలను పొలిగల నిది, గంట నిధానంబు గంట × గాదె మనకున్ 99

తే. అనిన విని వార లందఱు × నగ్గలికలు
నెఱయుమాటలఁ దనతనకు తెఱఁగు మెఱయ
బహువిధంబుల నతనికి × బాస యిచ్చి
యేచి నిజసైన్యములలోని × కేఁగి రధిప. 100

1. [illegible] 2. [illegible] బంటయు పొలిగలన దివిని,

వ. అయ్యవసరంబున గాంగేయుండు గాంధారేయు నాలోకించి మదీయసంగరసమయంబునఁ గర్ణుండు పుత్త్రమిత్త్రామాత్యబంధుసహితంబుగాఁ గయ్యంబునకు రాకుండం గలవాఁ డని తేటపడం బలికిన. 101

క. చలముకొని పోరుల నడువుట, బలియుం డై తెంపు సేసి బవరమునకుఁ దాఁ
[1]జెలియుటగాదే యని కురుకులముఖ్యుఁడు వొంగి యతనిఁ గొనియాడెఁ దగన్.

వ. ఇట్లు పితామహునిచిత్తంబు వికసిల్ల ననుజసహితంబుగా నతనిం బరివేష్టించి యున్నరపతి నిబిడచారుసన్నాహంబుగా నుచితవ్యూహం బమర్పుమని యతనికిం జెప్పిన నతండును బడమరమొగం బయి తానును ద్రోణుండును దాలధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలుచుండ ముందర నిలిచి వలపటఁ గృపాశ్వత్థామలును దాపటం గృతవర్మమద్రేశ్వరులు వెనుక బాహ్లికసోమదత్త భూరిశ్రవసులును నడుమం గురుకుమారసమేతంబుగా నమ్మహీనాథుండును నతని యగ్రభాగంబున నర్జునుఁ జంపుదుము చత్తు మింతియ కాని యొండు లే దని [2]శపథంబులు వలికి సంశప్తకు లనం బ్రఖ్యాతు లయినసుశర్మ మొదలుగాఁ గలపది వేవురు రథికముఖ్యులును గలయనెడ నెడం దక్కిన యోధవీరులును నిలుచునట్లుగా నియమించి తగ నయ్యైసైన్యంబుల కేనుంగులు నేనుంగుల కరదంబులు నరదంబులకుం దురంగంబులుఁ దురంగంబులకు విండ్లవారు విండ్లవారికి [3]నద్దాయుధులు నడ్డం బగుతెఱంగున నిలువ నియోగించి మానుషవ్యూహంబు సమకట్టిన నెన్నండును నిట్టిదృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగ మని యెల్లవారు నచ్చెరువునం బొరయుచుఁ బ్రియం బందుచుండిరి బృందారకప్రముఖదేవయోనులును దివంబున నున్నపురాతనధరారమణులును భారతరణంబు గనుఁగొను కుతూహలంబున వివిధవిమానారూఢు లై యేతెంచి రంతకు మున్న యక్కడ.

— పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట. —

సీ. ఏనికమదమున కలయు తేఁటుల మొత్తములు వెలిగొడుగుల చెలువు [4]గొలుపఁ
దురగఖురోద్ధూతధూళి యుప్పరసల, [5]చిన్నిపువ్వులతోడఁ జెలిమి సేయఁ
గేతనంబులమణివ్రాతంబురోచులు, రవికిరణంబుల నవలఁ ద్రోవ
జైత్రభేరులమహాస్వనములు సకలపర్వతములఁ బ్రతివిరావముల నీన
తే. నంబరము రథఘోషభీమాభిరామ, కింకిణీగణఝుణఝుణత్కృతిమయముగఁ
బటుపదాతిహేతిప్రభాపటలి యెల్లదిశలు వెలిఁగింప వెడలె యుధిష్ఠిరుండు.

మ. ప్రమదం బాననకాంతిఁ గ్రొత్తవఱుపం బాదాతిభూయిష్ఠసై
న్యముతో భీముఁడు భీషణద్యుతినికాయంబుగాఁ గదాద్యాయుధో
గ్రమరీచిప్రకరంబునుం గలిసి చిత్రస్ఫూర్తి శోభిల్లఁ గా

1. వెలయుట. 2. సంశాపంబులు. 3. నడ్డనాయుధులును. 4. గెలుప. 5. యులకలతోడుత; యులకపువ్వులతోడ; యులకలచిన్నిపువ్వు.

సమరక్రీడకు వచ్చె జృంభితభూజాస్తంభోజ్జ్వలాకారుఁడై. 105

సీ. దివ్యరథస్ఫారదీప్తిజాలంబులు, పద్మరాగోజ్జ్వలప్రభలు గాఁగ
మహనీయరథ్యవిగ్రహములజిగిసొంపు, ఘనవజ్రవసుసముత్కరము గాఁగ
నొగలపై సన్నకృష్ణుని మేనినునుఁజాయ, హరినీలకాంతివిస్ఫురణ గాఁగఁ
బ్రస్ఫీతకేతనాగ్రస్థితకపిదేహ,రోచులు గరుడాశ్మరుచులు గాఁగ
ఆ. నంవపాదుల నిగుడ నంశువితానంబు, దీప్రమరకతములదీధితులుగఁ
దాళిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయురోహణాద్రివెడలివెలిఁగె.
క. అతులితరథప్రతానోద్ధతసైన్యము గొలువ దేవదత్తం బంగీ
కృతసకలతూర్యనాదోద్ధతి యగుచుఁ జెలంగఁ గ్రీడి గడు నొప్పారెన్. 107
తే. గాండివం బింద్రచాపంబుకరణి నొప్ప, మెఱసి దివ్యకిరీటంబుమెఱుఁగు లడర
జ్యానినాదంబు గర్జగా మేనుకృష్ణ,కాంతిఁబొలిచెఁ గవ్వడి యనుకారుమొగులు.
మ. వివిధోద్దామమహాయుధావళిబహుళమై విక్రాంతికేళీసము
త్సవకౌతూహలసుందరం బగుమహాసైన్యంబుతో మేదినీ
ధవసందోహము బ్రీతిఁ బొంద మహిమోదాత్తప్రయాణంబులం
గవ లేతెంచిరి వేడ్క నొండొరులకుం గయ్యంబుమైఁ జెప్పుచున్. 109
మ. రభసక్షోభితమేదినీతలముపై రథ్యప్రచారంబు లొ
ప్ప భుజాగర్వము నెమ్మొగంబుల దలిర్పం గన్నకయ్యంబు న
ర్థి భవత్పుత్త్రులమీఁదికోపము సముద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్రేయద్వయం బంతియు న్నాకృతిన్. 110
వ. ఇవ్విధంబునం బ్రతివింధ్యుండును శ్రుతసోముండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతసేనుండును సౌభద్రుండును దమకుం గన్నాకుఁగాఁ జెన్ను మిగిలి చనుదేరం గనుంగొని కౌంతేయబలంబులు సంతసంబునం బొదలె నప్పుడు. 111
సీ. కరులసందడి నొప్పుఘనసేన దుర్ధర్షలీలఁ దోడ్పడఁ బాంచాలవిభుఁడుఁ
దనుజులు ననుజులు దర్పదుర్జయసైన్య,మహిమఁ దోడ్తేర మత్స్యపతియు
యాదవానీకంబు లవని గ్రక్కదలఁ దోఁ, జనుదేర [1]బాలుపారి సాత్యకియును
యోధవీరులు ప్రతాపోగ్రవాక్యములతోఁ, దనుఁ జుట్టి రాఁ జేకితానవిభుఁడు
తే. [2]బాసపై వీరరథికులు బలసి యొలమి, నొండొరుల గఱువంబు గనుల్లసంబు
లాడుచును జేర నడతేర నత్యుదార,గతి శిఖండియు నడచిరి కౌరవేంద్ర.
చ. బధిరితదిఙ్ముఖం బగుచు బంధురతూర్యనికాయనాద మం
బుధియును బోలె సేనకు విభూతి యొనర్పఁగ నేఁగుదెంచె మా
గధసహదేవుఁ డప్డు రణకౌతుకసల్లపనంబు నుజ్జ్వలా
యుధవిభవంబుఁ జెన్నొనఁగ నొప్పెఁ దమ్ముని బ్రీతిఁ జూచుచున్. 113

1. బలుపారి. 2. బాసపడి; బాస లిడి.

ఉ. చండభుజాబలంబునఁ బటుప్రశౌర్యసముల్లసనంబుఁ దోఁప ను
ద్దండత నాత్మసైనికకలప్రదర్పము లుర్వఁగ నెమ్మిఁ బల్కుచుం
బాండవకోటిమూఁకలకుఁ బ్రబంతువ్రగాఁ జనుదెంచె ధృష్టకే
తుండు సహోదరుండు దనతోఁ నడతేరఁ బరాక్రమోద్ధతిన్. 114

మ. విచలద్గండధరోపమాశ్రయవపుర్విస్ఫార మై దానవ
ప్రచయం బుద్ధతలీలఁ గొల్వఁగఁ దమోరాశి ప్రతీకాశఘో
రచలద్రూపము భంగిఁ దగినదంష్ట్రాయుగ్మ మొప్పంగ ఘటో
త్కచుఁ డేతెంచెఁ గరస్థశూలరుచు లాకాశంబునం బర్వఁగన్. 115

వ. పాండ్యపతియును గేకయపంచకంబునుఁ జైద్యుండును నృపతియుం గాక కరూశాది
బహుదేశాధీశులును దమతమబలంబులదళంబులనవరణలయొప్పను గయ్యంపుఁ
గడంకయు నెఱయుం గేతనంబులు మెఱయుం దోఁతెంచి చిత్రతరంగనం గూడి స
ప్తాక్షౌహిణీబంధురంబుగాఁ బేర్చినపాండవసేనమొగంబునకుం దిలకం బై. 116

శా. హృష్టోదంచితసారవీరరసనంపూర్ణాంగముల్ సంగరా
వష్టంభోజ్జ్వలవీరరేఖయును భాస్వద్వ్యాహనంవల్గనో
త్కృష్టస్యందనముం గనద్దనువు నుద్యద్ధ్వజాబుం దగన్
ధృష్టద్యుమ్నుఁడు [1]వొల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్. 117

వ. ఇట్లొప్పి సేనాపతి యగునాద్రుపదసుతుండు మొంగలి యై నడపించుచుండ. 118

సీ. ఇల ధూళి[2]యెగసినఁ బ్రబలుచ గాఁ కుండఁగ, రాసితో దవులప్రరజము దొరఁగు
సమరవికాసంబు ప్రకటమట నొప్పఱ కుండ, హేతిదీధితులు రేయెండ నొడుచు
భేరీధ్వనుల సింగి ప్రబీటలు వో కుండఁ, గరికరశీకరోత్కరము దడువు
దర్పంబు గనఁజాటు ప్రవాఁక కుండఁగ గొరగులపెల్లుభుచరద్ర్రుకోటి నాఁగు
తే. ననిన నిజమైనయట్లుండె ప్రమనుజనాథ, ధరణి వడవడ వడఁకె దిక్తటములద్రువ
భూరిచతురంగచండవిస్ఫూర్తిఁ బాండునందనులసేన గలనికి ప్రనడచునపుడు.

వ. ఇట్లు నడచి కురుక్షేత్రంబులోన నుత్తమప్రదేశం బగుశమంతపంచకసమీపస్థలం
బు సేరుసమయంబున ధర్మనందనునకుం దోఁచుదక్షిణానిస్పందనాదిశుభసూచ
కంబులకు మెఱుంగు వెట్టినచందంబున. 120

క. ఏనుఁగులమదముతావియు, సైనికనికరాను లేపనసౌరభ్యములుం
దా నుపలాలించుచుఁ బవమానుం డనుకూలమృదుగమనమునఁ [3]బొలసెన్.

వ. దాని కయ్యుధిష్ఠిరుండు ప్రముదితచిత్తుం డగుచుఁ బ్రీతచేతస్కు లగుతమ్ములుం
బాంచాలమాత్స్యాదిపతులును సకలజనంబులును బరివేష్టింపం దూర్పుమొగం
బై కౌరవు లున్నచక్కటికిం గట్టెదురుగానిలిచి యెల్లవారిసైన్యంబులుం గ్రమం
బునఁ గొలంది వెట్టుకొనుచు నందఱకు నంజ్ఞలు నశియాలంబులుం గల్పించి

---

1. వొల్చి నిల్చె విలస. 2. నెగసినఁ. 3. బొలిచెన్.

దొరలఁ జెనం గనుంగొని మన మీరణంబునందు ధరణీరాజ్యంబు వడసెద మొండెఁ
బూజ్యం బగునాకలోకనివాసంబు గనియెద మొండె నని నిశ్చయించి నాకెలంకుల
నిలువుం డనిపలికిన విని వారలు ధీరోదాత్తంబు లగువివిధవాక్యంబులం బ్రతిజ్ఞలు
సేసి నిజశంఖంబులు పూరించి తమతమబలంబులలోనికిం జని రజ్జనపతియును
దన కమర్చినకజ్జంబులును బుష్పఫలకర్పూరకస్తూరికాదులును వారలకుం బుచ్చు
చుండె. 122

క. అనిన విని యాంబికేయుఁడు, మన మొనఁ గడుఁ బెద్ద దీని మార్కొనఁ గుంతీ
తనయులు గొంకం బయ్యును, ననుమానింపక కడంగు టది యెట్లొకొ. 123

వ. అనుటయు సంజయుం డధిపునకుం జెప్పెద వినుము మని యతని కిట్లనియెఁ గొంతే
యాగ్రజుండు గురుబలంబు గనుంగొని కొండొక విన్ననై వివ్వచ్చు నాలోకించి

చ. ఘన మయి తోఁచుచున్నయది కౌరవసైన్యము చూడ్కి కందు శాం
తనవుని తాలకేతన మ్ముదగ్రత ముందటఁ బొల్చెఁ జూచితే
యనవుడుఁ జిన్నవొవ్వ నగి యన్నకుఁ దన్నమొగంబుఁ జూచి నె
ట్టన బలుమాట లాడఁగఁ గడంగఁగ నొల్లక యత్యుదాత్తతన్.

— ధర్మజునకు నర్జునుఁ డుత్సాహంబు కలిగించుట. —

వ. అతనితో ని ట్లనియె. 126

చ. మునివరుఁడై సనాతనుఁడు ము న్నొకయప్పుడు సెప్పె ధర్మనా
శను లగువారలం బ్రబలసైన్యము గల్గినయేనిఁ గొంచమై
నను రిపుసేన గెల్చు నని నాకు గురుండును దేవతానదీ
తనయుఁడు నేర్పడఁగా వినఁగఁ దాను బరాశరసూనుఁడుం గృపన్. 127

వ. అది యట్లుండె నమానుషశక్తిసముద్దాముం బగుభీముగదావిహారంబు వైరిదు
స్సహంబు ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలవర్గం బనర్గళవిక్రమంబు విరాట
శంఖముఖ్యమాత్స్యనికరం బరిభయంకరంబు సాత్యకిచేకితానాదియాదవనివ
హంబుభవజ్జయావహం బభిమన్యుహైడింబప్రభృతికుమారలోకం బలోకసామా
న్యబలశౌర్యధుర్యంబు నీకటాక్షంబును గృష్ణుసంరక్షణంబును గలిగి గాండీవం
బనుపామునకు ఱెక్కలువచ్చినట్లున్నయవి యట్లుంగాక యేనుఁగుంబోలె నీలావు
నీ వెఱుంగవు దివిజులకు నజయ్యుండవు నీ వలిగిన నెవ్వ రెట్లయ్యెదరో యటు
సూడు మనినం దెలి వొంది సంక్రందననందనునకు ధర్మనందనుం డిట్లనియె.

తే. కౌరవవ్యూహమునకుఁ దగఁగ నొక్క
బంధురవ్యూహ మొనరింపఁ బంపు మనిన
నతఁడు ద్రుపదాత్మజుని నచలాఖ్య మైన
ఘనతరవ్యూహ మొనరింపఁ బనుచుటయును. 129

వ. ఆధృష్టద్యుమ్నుండును గలయ మొనంగి మోహరంబు దీర్చె నయ్యచలవ్యూహంబు

నందుఁ దా నగ్రభాగంబున నభిమన్యుప్రభృతికుమారనకులసహదేవసహితంబుగా
భీమసేనపరిపాలితుండై నిలిచెఁ దమతోడిబంధులకును బలంబులకును బలువుతోడి
[1]చెలువుగలుగఁ జేకితానసాత్యకిసమేతంబుగాఁ బాంచాలమాత్స్యాదిపతులుదక్షి
ణోత్తరభాగంబుల నిలిచిరి నడుమ నడగొండగమియుం బోనిగజరాజితో రాజు
రథారూఢుండై ధవళచ్ఛత్త్రచామరంబులు మెఱయ విప్రవర్గంబునకు నంబర
జాంబూనదంబు లొసంగుచు విజయాశీర్వాదంబు లాదరించుచుండె ముందటఁ
బురందరనందనసంరక్షితుండై శిఖండి గాంగేయునకుఁ గట్టెదురుగా నిలిచి గండు
మిగిలియుప్పి నపరభాగస్థులై మాగధసహదేవధృష్టకేతు లవష్టంభవిజృంభ
ణంబునం బొలిచి రివ్విధంబునం జారుభీషణం బై. 130

క. అరదములు దీవు లున్నతకరులు గిరులు హరులు వీచికలు సుభటసము
త్కరము మకరసత్త్వములుగా, శరనిధిఁ బోలెం బాండుపుత్త్రసైన్యం బొప్పెన్. 131

క. ఉభయబలదీప్తకేతుప్రభలం గప్పఱచి కురుధరావల్లభసై
న్యభయంకరమై శక్రప్రభవుకపిధ్వజము వెలిఁగెఁ బ్రకటస్ఫురణన్. 132

తే. అరుణములును సితంబులును నసితములును
నైన జోడులతోఁ దోరఁపులంపు నిండు
నాలలోని యూఁబోతులఁ బోలి పొలిచి
రెసఁగు బెడిదంపుమావు లారకసము మట్టు. 133

తే. కొన్నిభూములబలములు గురునృపాలుఁ, బాండవులఁ గొన్నిభూములబలములీను
గలిగి పాయలై కొన్నిభూములబలములు, రెండుదిక్కులయందుఁ జేరిన వియధిప.

వ. కావున. 135

క. బాలురు వృద్ధులుఁ దక్కఁగ వ్రాలెడు యిలం గలుగుపురుషవర్గంబు జయ
శ్రీలోలత నేతెంచుట, నేల యువిసి మ్రాఁగినట్లు నెఱసె బలంబుల్. 136

వ. అనిన విని ధృతరాష్ట్రుం డప్పుడప్పాండవ కౌరవసైన్యంబులలో నెయ్యదియుబ్బు
గలిగి యుండె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె. 137

క. రెండుబలంబులవారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కు మిగిలి యొం
డొండ కడంగుచు నుజ్జ్వల చండస్థితి నొప్పి రవుడు జగతీనాథా. 138

వ. అని వెండియు. 139

క. ఆ రెండుబలములందును, దోఁచం బై యున్నయట్లు దోఁచెం బాండు
క్ష్మారమణసుతుబలము నర,నారాయణు లునికిఁ జేసి నాకుం జూడన్. 140

క. [2]ఎలసి పయి వారి[3]దంతిఘటలమదముల రాహు వెట్టుకటుముఁ గౌరవసే
నల యేనుంగులమదధారలు డొంకెం బోలయు మధుకరము లుబ్బడఁగన్. 141

1. సెలవు. 2. ఎలమి మెయి వారి; ఎలసి పయిఁ బాఱి. 3. 'దంతిఘటలు మదమున రాపువెట్టు' అని యచ్చుప్రతి. 4. రాహువట్టు

తే. అధిప నీతనయుండు గయ్యంబు వొడుచు, తెంపువదలక విభవంబు పెంపుమెఱసె
సారసానకు వచ్చినచందమునను, నెలమిఁబొందిరి పాండవేయులును హరియు.

వ. అట్టియెడఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన 143

క. అనినదము విని పాండవ,సేన లలరె ధార్తరాష్ట్రసేనాగతయో
ధానీకము లికె నెత్తురు, వాన గురిసె నంతఁ గౌరవవ్యూహమునన్. 144

వ. మఱియు ననేకదుర్నిమిత్తంబులు పుట్టెఁబుట్టి కెలతక్క దేవవ్రతుండును గురుం
డును గురునందనుండును గృపుండును నిచ్చలుఁ గయ్యంబునకు వెడలునప్పుడు
పాండవులకు జయం బవశ్యంబు నయ్యెడు మనుచు వెడలుదు రది యట్లుండె
నయ్యశుభసూచకంబులకు ధార్తరాష్ట్రులు దలంకక తూర్యంబులు మొరయింప
నియోగించిన. 145

ఉ. అప్పుడు రెండుసైన్యములు నాహవకేళికి నుత్సహించి పె
ల్లొప్పెఁ జెలంగి యుబ్బినసముద్ధతిఁ బొల్పగుతొంటిచందముల్
దప్పి యుగాంతకాలచలితత్వము నొంది పరస్పరాకృతుల్
గప్ప నెదుర్చునంబుధియుగంబుమహోగ్రతఁ గ్రేణి సేయుచున్. 146

వ. తదవసరంబున నుభయబలంబులవారును. 147

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
నవినయవృత్తినై వలవ దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడినం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాదు వధింపఁగ నెట్టిశత్రునిన్. 148

వ. అని సమయంబు సేసి రాసమయంబున. 149

క. పలుచాయల నొప్పినయా,బలము లొకటి కొకటి కెదురఁ బల్లవపుష్పా
వలి గలవనములక్రియ ని,శ్చలత నిలిచి పొలిచె సశమససముధైర్యములన్. 150

క. అత్తఱి సురఖచరాదుల,చిత్తము లనిఁ జూచువేడ్కఁ జిడిముడి పడఁగా
నొత్తొరవున నిరుదెఱఁగుల,యుత్తమవీరులును దాఁక సంకింపంగన్. 151

—•• ధర్మరాజు పాదచారి యై భీష్మునియొద్దకుఁ బోవుట. ••—

తే. సమరకౌతుకి యైనయజాతశత్రుఁ
డొప్పు మిగిలెడుమైమఱపు పూడ్చి యాయు
ధములతోఁ గూడఁ దనయరదమునఁ బెట్టి
యిలకు డిగి మౌని యై కరంబులు మొగిడ్చి. 152

వ. భీష్ముదెసకుం జను చున్నం గనుంగొని యమ్మహీవల్లభుతమ్ములును శౌరిసాత్యకు
లును బరమాప్తు లగుధరణీశులు నతనిచేతోవృత్తం బెఱుంగమి నుత్తలపడు
చిత్తంబులతో వాహనంబులు డిగ్గి యతనిం గూడం జని యప్పుడు. 153

సీ. ఏ మొల్ల నుండఁ డే నీ ƒ వి ప్లాంతి గాల్పడ, నేఁగుచున్కి కిఁ గత ƒ మెద్దియొకొ
పన్నినపగఱపై ƒ సన్నాహ మంతయు, నెకలించి నడచుట ƒ యెట్టులొకొ
రిపులు దేకున పెడఁ ƒ గృపణత దుర్బలు,చాపువఁ జను టేమిƒచంద మొకొ
యడరి పోరాటకు ƒ నడనైనచో నొప్పు, పొలినోవఁ బోవుట ƒ పోలునొకొ
తే. యని క్రమంబున నామరుƒత్తనయవిజయ
నకులసహదేవు లడుగ భూƒనాథుఁ డొక్క
పలుకుఁ బలుకక యరుగంగఁ ƒ బద్మనాభుఁ
డక్కుమారులతో నిట్టు ƒ లనియె నగుచు. 154

వ. ఇతని తలంపు నే నెఱింగితి నితండు భీష్మద్రోణకృపశల్యులకు నమస్కరించి వారల చేత ననుజ్ఞాతుండై భండనంబు సేయువాఁడుగాఁ దలంచి చనియెడుఁ బెద్దల యనుజ్ఞ గొని కర్యంబు సేసిన జయం బగుట నిశ్చయం బని యార్యులు సెప్పుదురు గావున నానుకర్మం బాచరించుట మేల కాక యనిన విని యజాతశత్రు వెనుక నప్పు డరిగినవారలు వలుకు లుడిగి నిలిచి వెఱఁగుపడి చిత్రరూపంబుల చందం బై చూచుచుండిరి కృష్ణార్జునులును భీముండును గవలును దోన చనం గాంతేయాగ్రజుండు గాంగేయు తేరు సేరం బోవం గౌరవసైన్యంబుజనంబు లేపు మిగిలి మెడ లెత్తి కనుంగొని రయ్యవసరంబున నందలియోధవీరు లితం డింత వెఱచునే యనువారును వెఱవ నిప్పు డితని కేమి వచ్చె ననువారును వృకోదరుండు వివ్వచ్చుండు గవలు సౌభద్రుండు సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టద్యుమ్నుండు శిఖండియు గలుగఁ దన కింత యేల యనువారును ధర్మతనయుండు భీతుండు గాఁ డేమితలంపున వచ్చెనో యనువారును మఱియు ననేకప్రకారంబులం బలుకువారును నై యుండిరి పాండవసైనికులు మానధనుం డగు నిమ్మానవనాథుండు నదీనందనుతో నేమను వాఁ డతం డితని నేమిభంగి సమ్మానించు మాధవధనంజయు లెట్లు వలుకువారు మారుతసుతుండును మాద్రీసూనులును నెత్తెఱంగున మాటలాడుదురు వీ రేమిటి కివ్విధంబునకుం దొడంగి రనుచు వగచి నెండియు వివిధవచనముఖరు లగుచుండ రయ్యుధిష్ఠిరుండు సముద్యతనానాయుధబహుళం బైనకురువ్యూహంబు దఱిసి పితామహుపాలికిం బోయి తత్పాదంబులకుఁ బ్రణామంబు సేసి సవినయంబుగా నతని కిట్లనియె. 155

ఆ. అనఘ నీ కెదిర్చి ƒ యని సేయువాఁడ నై, ము న్ననుజ్ఞ గొనఁగƒనిన్నుఁ గాన
నెమ్మి వచ్చినాఁడ ƒ నీచేత దీవన, వడసి చనిన నేను ƒ బగఱ గెలుతు. 156

సీ. అన విని గాంగేయుఁ ƒ డక్కట నీ విట్లు, సనుదేక తక్కిన ƒ శావ మిత్తు
వచ్చితి మే లయ్యె ƒ వైరుల నిర్జింపు, మిది గాకయును వర ƒ మెద్ది యైన
నడుగుము నీకుఁ గా ƒ నని సేయు టొక్కటి, దక్కంగ నావుడు ƒ ధర్మసుతుఁడు
ధారాజుపటుమైƒరణము సేయుము నాకు,హిత మగు కార్యంబు ƒ మతిఁ దలంపు

ఆ. మనుచు నట్లు గాక యట నీతలం పేమి, యనినభీష్ముతోడ నతఁడు నిన్నుఁ
బోరగెలుచువిధము బోధింపు మనుటయు, సస్మితాస్యుఁ డగుచు శాంతనవుఁడు.

క. నను మార్కొని గెలువఁగ న, య్యనిమిషులకు నరిది యనుచు నట్లగుటఁ గదా
నిను వేఁడెద నని కుంతీ, తనయుఁడు వలుకుటయుఁ జెప్పెఁ దాపసహితుఁడు కృపన్.

ఉ. చుట్టఱికంబునన్ మనసు సొచ్చి ననుం గరఁగించి వేఁడినన్
దిట్టతనంబు వో విడిచి తీవ్రరణంబు కడంక దక్కి నేఁ
బట్టినయాయుధంబు వెడఁ బాసినఁ గాని వధింపఁ బోల ది
ట్టిట్టన కేఁగు మిప్పుడున యింతక కాలము గాదు జాసికిన్. 159

—•• ధర్మరాజు గురుకృపశల్యులచేతయుద్ధమున కనుజ్ఞాతుం డగుట. ••—

తే. క్రమ్మఱంగ నేతెంచెదు గాక యనుడు, నతిముదంబునఁ బ్రణమిల్లి యతని పాద్య
మప్పుడు దలనిడుకొనినవాఁ డగుచు నప్పి, తామహుని నెమ్మి వీడ్కొని ధర్మసుతుఁడు.

వ. కృష్ణార్జునాదులుం దోడన చనుదేర గురుకృపశల్యులకడకుం గ్రమంబున నరిగి పాదప్రణామంబు లాచరించి వారలచేత రణంబునకు ననుజ్ఞ వడసి యమ్మనుజపతి దనకు జయం బాశాసింపు మని యభ్యర్థించిన నయ్యాచార్యుండు నీకుం గృష్ణుండు మంత్రి యై యుండ నొరులు జయం బాశాసింపు మన నేల ధర్మంబ వేవలనం గలుగు నవ్వలన కృష్ణుండు గైకొను నవ్వలనికి జయంబగు ననియె నిజవధోపాయంబు వేఁడిన నతండు నాచేత నాయుధం బున్నంతసేవు నన్నుం జంప నెట్టివారికి నశక్యం బేను బ్రాయోపవేశంబున సన్న్యస్తశస్త్రుండ నైనం జంపుటకు నోపునట్టివారికి నది దొరకొనుఁ బెద్దయు నమ్మఁ గలవాఁడు సెప్ప నత్యంతదుస్సహం బైనకీడుమాట వింటినేని నట్టివాఁడ నగుదు నప్పు డట్టిపగఱకు నప్పని దీర్పననువై యుండు మని చెప్పినఁ గృపాచార్యునిం బరిమార్పు తెఱంగు నడుగం దొడంగి యేర్పడం బలుక నేర కున్న నతం డెఱింగి తాను వధ్యుండు గామి యెఱింగించి గెలువు మని దీవించె మద్రపతితో నీవు రాధేయునకు సారథి వగుట సంభవింపనోపు నని చెప్పి కయ్యంబునప్పుడు కర్ణుతేజంబు దూలం బలికి తులకిసఁ జిక్కువఱుప వలయు నని వరంబు గోరిన నతం డవ్విధంబు నీయుద్యోగసమయంబున నియ్యకొనినయది గాదే యట్ల చేయుదు నని పలికె నిత్తెఱంగున నందఱవీడ్కొని యజాతశత్రుం డనుజవర్గానుగతుం డై మరలె నయ్యవసరంబున. 161

క. మొనల వినోదంబునకుం, గనుఁగొన నేతెంచి యున్న కర్ణునికడకుం
జని హరి యి ట్లను నొండొరుఁ, గని యప్పటియుచితభంగి గడ తేర్చి తగన్.

తే. అమరతటినీతనూజుపై నలుకఁ జేసి, యనికిఁ జొరవవె యట్లైన నతఁడు సచ్చు
నంతదాఁకఁ బాండవులకై కొంత సమర, కేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ.

వ. అనిన విని దేవకీనందనునకు రాధానందనుం డి ట్లనియె. 164

క. కినుక వొడమి గంగాపు, త్త్రునికయ్యమునప్పు డనికిఁ దొలఁగితి నేనిం

జనుఁ గాకేఁ గురుపతి కి, చ్చినప్రాణం బాండవులకుఁ[1] జేర్పం దగునే. 165

వ. అనవుడు నప్పలుకులకు సంతోషించినవాఁ డయి వాసుదేవుండు కౌంతేయులం గూడఁ జనుదెంచి నివ్విధంబున ధర్మనందనుండు కౌరవసైన్యంబు వెడలి నిలిచి యద్దిక్కు మొగంబు సేసి యెలుంగెత్తి యిట్లనియె. 166

తే. మమ్ము నెమ్మిమైఁ గలయఁ జిత్తమ్ము గలుగు, వారలెవ్వరు గలిగిన వచ్చి కలయుఁ డట్టివారిని నాతమ్ములంతవారిఁ, గాఁగఁ బాటింతు నెంతయు గౌరవమున. 167

వ. అనిన విని నీపుత్త్రుండు యుయుత్సుం డేను వచ్చెద నన్నుం గలపికొను మని పలికినదానికిం బాండవాగ్రజుండు ప్రియంబాదినపలుకులు వలుకుటయునతండు దుర్యోధనాదులదుశ్చేష్టితంబు లుగ్గడించుచుఁ గౌంతేయులగుణంబు లగ్గించుచు నిజసేనాసమేతంబుగా నిస్సాణాదిరావంబులు సెలంగం జని ధర్మనందనుబలంబులం గలసె నది యుట్టిదకాక నవతాలి ప్రజలు పొంద నేర్తురే యది యట్లుండె నిట్లు దన్నుం గలసిన సంతుష్టాంతరంగుం డగుచు నయ్యుధిష్ఠిరుండు యుయుత్సునకు నత్యుపచారసమాదరంబులం బ్రమోదం బొనరించి. 168

తే. రథముమీఁదికిఁ జనుదెంచి పృథులసైన్య
హర్ష భాషణధ్వనులుఁ దూర్యస్వనములు
నెగసి దివి ముట్ట మైమఱు విడి తలిర్చు
నెలమిఁ గోదండతూణీరకములు ధరించె. 169

వ. తదవసరంబున సతనితమ్ములుం దక్కటిదొరలును దమతమరథంబులెక్కి యెప్పటి నెలవుల నిలిచినం దదీయవ్యూహంబు పూర్వప్రకారసన్నాహంబై యొప్పె నట్టి యెడ రెండుబలంబులవారును బాండవులు దొల్లి పడినపాట్లు సెప్పికొనివగచుచు వారు సంధికై చేసినయత్నంబు వాక్రుచ్చి మెచ్చుచు నివ్వాడు గురుజనంబులయెడఁ బాటించినవినయంబు వర్ణించి యనురాగించుచుండి రని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 170

క. మానుగ ధర్మక్షేత్రం, బైనకురుక్షేత్రమున మహాహవమునకుం
బూని మనబలముఁ బాండవ, సేనయు నిటు వన్ని యేమి సేసెం జెపుమా. 171

వ. అనిన విని సంజయుం డతని కిట్లను దుర్యోధనుండు పాండవవ్యూహంబు గనుంగొని గురునికడకుం బోయి. 172

తే. చూడు మాచార్య నీశిష్యుండు ద్రుపద
సుతుఁ డమర్చినయది పాండుసుతులసేన
పెంపు బలువును గలిగి యొప్పినది యందు
భీము నర్జునుఁ బోలినబిరుదుమగలు. 173

వ. సాత్యకి విరాటుండు ద్రుపదుండును ధృష్టకేతుండు చేకితానుండు గాశిరాజు పురు

1. చేర్చుట తగ నే.

జిత్తు కుంతిభోజుండు శైబ్యుండు యుధామన్యుం డుత్తమౌజుండు నభిమన్యుండు ద్రౌపదేయులు వారలందఱుం జాలుమానుసుల యిట్లుగూడి భీమాభిరక్షితంబగు నబ్బలంబు సాల [1]సమర్థంబునుం బోలె మెఱసె[2]మనసేనానాయకులం జెప్పెద నిన్నను భీష్ముని నెన్ననేల కృపాచార్యుం డశ్వత్థామశల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు మఱియుం బెక్కండ్రురథికులుఁ గలరు నానాస్త్రకోవిదులు వివిధయుద్ధవిశారదులు వీర లిందఱు నాకై ప్రాణంబులు విడిచెద మని యున్నవా రిట్లు పెరసి భీష్మపరిపాలితం బయినయీసైన్యంబు పెద్దయుసమర్థంబై తోఁచుచున్నయది మీ రెల్లను వలయు నెడల నిలిచి భీష్మునకుఁ గావలి గావలయు ననిన ద్రోణుం డట్లు గాక యింత సెప్ప నేమిటి కనియె నప్పలుకులు విని యమ్మహీపతికిఁ బ్రియంబు పుట్ట శాంతనవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించిన. 174

క. తనతనశంఖంబును దక్కుఁగ గలదొర లెల్ల ననికిఁ గొనకొని పూరిం
చినవివిధతూర్యనాదంబును జెలఁగె నభంబు దిశలుఁ బూర్ణంబులుగాన్. 175

వ. అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులును భీమసేనుండు పౌండ్రంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బాంచాల విరాట సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖదండనాయకులు దమతమశంఖంబులుఁ బూరించిన. 176

క. అనయము నుగ్రం బగుతద్ధ్వని గాంధారేయహృదయవిదారణ మై పాం
డునరేంద్రపుత్త్రసైనిక, [3]మనోరమం బగుచుఁ జెలఁగె మనుజాధీశా. 177

వ. తదనంతరంబ శస్త్రసంపాతనంబునకు సమయం బగుటయుఁ గపిధ్వజుండు గాండీవంబు పుచ్చికొని గుణంబు సారించి బాణపాణి యై నీకొడుకులం జూచి కృష్ణుని తో ని ట్లనియె. 178

తే. కౌరవులలోన నెవ్వ రెవ్వారితోడ
ననికిఁ గడఁగుదురో చూచికొనఁగ వలయు
నరద మల్లన యుభయసైన్యములనడిమి
నేల కటు వోవఁగా నిచ్చి నిలుపు మచట. 179

అర్జునుఁడు స్వజనసంహారంబునకు శంకించి మోహావిష్టుం డగుట.

వ. అనినఁగుడాకేశుపలుకులకు హృషీకేశుండు భీష్మద్రోణప్రముఖయోధవీరులు గనుంగొనుచుండ నత్తెఱంగున రథోత్తమంబు నిలిపి యతనితో నీ వీకూడినకౌరవులం జూడు మనవుడు నప్పార్థుండు రెండుబలంబులయందు నున్నసోదరసుతమాతులాచార్యాదు లగుబంధుశిష్టజనంబుల నాలోకించి పరమకృపావేశంబున నత్యంతవిషాదంబు నొంది గోవిందు మొగంబు గనుంగొని దుర్మదాంధుం డయినను దుర్యోధనుదుర్వినయంబున నింత పుట్టెం జూచితే యని పలికి వెండియు. 180

1. సమర్థం బనం బోలి మెఱసె. 2. మనసేననాయకులం, 3. మనోహరం బగుచుఁ.

చ. సరసిజనాభ బంధుజన♦సంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా
విరవిరఁ బోయి మేను పులక♦లెంతయు నెట్టుచుఁ గంప మొందెఁ జే
నిరతము గాదు గాండివము♦ నిల్వఁగ నోర్వవు గాళ్లు నేను ని
ష్ఠురతకుఁ జాల నొల్ల నొకఁ♦డన్ మహి యేలుట యేటిసౌఖ్యముల్. 181

తే. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు♦ నెల్లసుఖము
గోరెదము వార లందఱు♦ వీరె వచ్చి
ప్రాణములు నర్థములు నొల్లఁ♦బాటు సేసి
కయ్యమునఁ జావ నఱుముట♦ గంటి గాదె. 182

ఉ. తాతల మామలన్ సుతులఁ♦ దండ్రులఁ దమ్ములఁ నన్నలన్ గురు
వ్రాతము శిష్టకోటి సఖ♦వర్గముఁ బుచ్ఛజనానురూపను
ర్నీతి వధించి యేఁ [1]బడయు♦ నెత్తుటఁ దోఁగినరాజ్యభోగముల్
ప్రీతి యొనర్చునే యశము♦ పెల్లొనఁగూర్చునె పెం పొనర్చునే. 183

క. అక్కడిబంధులఁ జంపుట, యిక్కడిబాంధవులు నచ్చ♦టియ్యకొనుచు నిం
దెక్కడిపెంపొందెదఁ జుడీ, దిక్కొనుఁ బాపంబు రణము♦తెఱు వే నొల్లన్.

ఆ. ఎల్లభువనములను♦ నేలుటకైనను, నిట్టిక్రూరకర్మ♦ మెట్లు సేయ
వచ్చుఁగడఁగి యొదిర్చ♦ వారేమి సేసిన, మాఱుసేయ నాకు♦ మనసురాదు. 185

చ. అకట నితాంతలోభమున♦ నాపలఁ బొటిలుకీను గానఁ జా
లక ధృతరాష్ట్రసూనులు కు♦లక్షయ మయ్యెడుదాని కోర్చి పో
రికిఁ దెగి వచ్చి రక్కలుద♦రెంపు గతిఁ గెఱుఁగనీవు నేను దీ
నికిఁ జొర నేల వీరి నిటు♦ నిర్దయుఁ జంపిన నేమి యయ్యెడున్. 186

క. కులనాశము సేసినఁ దత్కులధర్మము లడఁగు నష్ట♦కులధర్ములకుం
గలుగును దుస్సంకర మక్కులఘ్నులు లేఁగుదురు నరక♦కూపంబులకున్. 187

తే. ఇంతపాపంబు సేయంగ♦ నెత్తికొందు
మయ్య రాజ్యలోభంబున♦ నఖిలబంధు
జనుల వధియింపఁ దొడఁగితి♦ మని రథంబు
మీఁదఁ గూర్చుండఁబడియెఁ జే♦ యూఁదికొనుచు. 188

వ. ఇవ్విధంబున శోకసంవిగ్నమానసుండును విషాదవిహ్వలుండును బరమకరుణాభరితుండును నై శరశరాసనంబులు విడిచి కన్నీరు దొరఁగ నూర కున్న సవ్యసాచిం జూచి మధుసూదనుం డిట్లనియె. 189

క. దెప్పరపుఁజోట నీ కీ, యొప్పనివిధ మెచటనుండి♦ యొదవెను విను మీ
చొప్పవివేకులయది యిది, దప్పించును సద్గతియు♦ నుపాత్తయశంబున్. 190

వ. అని మఱియును. 191

---

1. 'బడయు ♦ నెత్తుటఁ' అని అచ్చుప్రతి.

తే. తగునె యర్జున [1]యీపెంకితనము నీకు, దండి వైతెమ్ము మనసు పేదఱిమి విడిచి
యనిన నట్లున్నభంగి ƒ నయ్యల్ల నిట్లు, లనియె నాతండు పుండరీ ƒ కాక్షుతోడ. 192

సీ. అక్కట పూజార్హు ƒ లగుద్రోణభీష్ముల, నమ్ముల నొప్పింప నగునె చెపుమ
మాన్యులఁ జంపుట ƒ [2]మగపాడి గాదు భి, క్షాశనంబైన నత్యంతసుఖము
కడఁగి యెవ్వరిఁ జంపఁ ƒ గాఁ బెద్దబ్రదుకయ్యె, నూహింపఁ బ్రదుకుగా ƒ కుండునాకు
విను మట్టిధృతరాష్ట్ర ƒ తనయులు గారె యీ, కొడ్డిన మొనలలో ƒ నున్నవార

ఆ. లింద్రియముల నెల్ల ƒ నివురంగఁ జేయుచు, నడఁచు శోకవహ్ని ƒ యూఱ నేర
దింద్రపదవి చేరి ƒ నేనియుఁ గావున, భండనంబు సేయ ƒ కుండువాఁడ. 193

వ. ఎల్లభంగుల గురుజనంబుల నొప్పించుటకుఁ జాల వారిని గెలిపించుటయును మనము వారల గెలిచినవారల మగుటయు ననునీరెంటియందును బెద్ద మేలెయ్యది యేను గార్పణ్యదోషోపహతస్వభావుండను ధర్మసమ్మూఢ చేతస్కుండను నై నిన్ను శరణు సొచ్చి యడిగెద నీశిష్యుండ నగు నన్ను శాసింపు మనిన విని కలకల నవ్వి నారాయణుండు నరున కిట్లనియె. 194

చ. వగవఁగ నేమియుం దగనివారికి నై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధిమాటలును ƒ వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్. 195

వ. అని పలికి పార్థునిం బరమజ్ఞానంబునకుఁ గారణంబు లగు వాక్యంబులు వినుటకుం జొనిపి యిద్దేహంబునందు బాల్యంబు యౌవనంబు వార్ధకంబు ననం గలుగు నవస్థలం బొందినట్లును జీర్ణంబులైన వస్త్రంబులు విడచి నూతనంబులైన వానిం గైకొనినచాడ్పునను గాని దేహాంతరగమనం బాత్మహానిం జేయ దనియుఁ బుట్టువుఁ జావు ననునివి లేమింజేసి శరీరంబువోలె శస్త్రచ్ఛేదనంబు మొదలైనవికృతికారణంబులకు నాత్ముండు లోను గాఁ డనియుఁ నప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింపంబడియెడువాఁడును గాఁ డనియుం జెప్పి మఱియు ననేకవాక్యంబుల నాత్మకు నభావంబును శరీరంబునకు భావంబును గలుగమి దెలిపి యాత్మతత్త్వంబు శాశ్వతం బగుట యెఱింగించి యి ట్లనియె. 196

— ✿ శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానోపదేశంబు సేయుట ✿ —

ఆ. ఇట్టు లగుటఁ జేసి ƒ యెవ్వరిదెసకు శోకంబుఁ బొందఁ గారణంబు లేదు
జీవుఁ డెల్లభంగిఁ ƒ జెడియెడువాఁడు గాఁ, డలఁచితేని నగవ ƒ పలదు మున్న. 197

క. పురుషుఁడు సెడు ననువాఁడును, బురుషుఁడు సెఱచు నని పలుకు ƒ పురుషుండును న
య్యిరువురు నవివేకుల యప్పురుషుఁడు సెఱుపండు సెడఁడు ƒ భుజవీర్యనిధీ. 198

క. పురుషుఁ డన నేఁటికొకండే, పురుషోత్తముఁ డైన యేన ƒ పురుషోత్తమతా

స్ఫురణకుఁబురుషత్వం బను, మెరమెర గలదదియుగాదెక్రమొయికొనుఁగ్రియకున్.

వ. అని యెండియు వివిధవాక్యంబుల నాత్మునకు బాధ్యబాధకత్వంబులు లేకునికి వివరించి విద్వద్భునకుం గృపాశోకంబులకు మూలంబు లగునహంకారమమకారంబులు వారించి యతనికి రణోత్సాహంబునకుం గారణం బైనస్వకర్మావలంబనంబు వదలందగమి దెలియుటకు వలయువాక్యంబులు పెక్కు లుపన్యసించి. 200

క. సమరంబు రాజులకు ను, త్తమకర్మం బది యపావృతస్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగఁ గయ్యము సేయుము దీని కేల యనుమానింపన్.

క. ఫలములయెడ బ్రహ్మార్పణ,కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము, దలకొనినం గర్మశేషము దా నై కలుగున్. 202

వ. అని మఱియు నీదృశంబు లగువాక్యంబు లనేకంబు లనుగ్రహించుచు వివిధ ప్రకారంబుల వికల్పించి విజయుం డడిగినవాని కెల్ల నదుత్తరంబు లిచ్చి సందేహంబు వాపుచు. 203

క. [1]వైరమున నులిచి త్రెంపక, తారాకులు డుల్లినట్లు కర్మము లెల్లం
దార పెడఁబాయవలయుట, సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతనికిన్. 204

వ. ఇవ్విధంబునం జెప్పిన విని కవ్వడి సముత్థితుం డై జగన్నాథున కిట్లనియె. 205

మ. అతిగుహ్యం బిది నీవు భూరికృప నీయధ్యాత్మముం గానఁ జే
సితి నా కిప్పుడు విన్కిఁ గొంత భ్రమ వాసెన్ యోగిహృద్ధ్యేయ మై
యతులైశ్వర్యవిభూతి నొప్పుభవదీయం బైనరూపంబు నూ
చుతలం పెత్తెడుఁ బోలునేని దయఁ జక్షుఃప్రీతి గావింపవే. 206

వ. అనిన విని యచ్యుతుం డతని కిట్లనియె. 207

క. నానాస్ఫుటవర్ణంబులు, నానాభంగులును గలుగునారూపములో
నానాశ్చర్యవిధంబులు, గానఁగ నగుఁ జూపెదం బ్రకాశస్ఫూర్తిన్. 208

క. విను మానుషచక్షుర్గతిఁ, గనుఁగొన శక్యంబు గాదు గావున నానిం
గనుటకయి దివ్యచక్షు,ర్జననం బొనరింతు నీకు శత్రువిదారీ. 209

వ. అనియతనికిదివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుం డైనయాలక్ష్మీశ్వరుండు దన దివ్యరూపంబు సూపె నావిశ్వరూపునిదివ్యతేజంబు సహస్రసూర్యప్రభానిభం బనుటయుం జాల కుండుం గావున వాక్రువ్వం గొలఁది గా దట్టిమహామూర్తిఁ గనుంగొని ధనంజయుండు విస్మయరోమహర్షణప్రహర్షోత్కర్షంబులతో దండప్రణామంబులు సేసి నిలిచి కేలు మొగిడ్చి యిట్లనియె. 210

— అర్జునుఁడు శ్రీకృష్ణునివిశ్వరూపంబు గనుంగొని స్తుతించుట. —

సీ. దేవ నీ దగుదివ్యదేహంబునందు సు,రాసురగంధర్వు లాది గాఁగ
గలదేవయోనులుఁ గమలాసనుండును, సచరాచరం బైనజగము నాకు

1. 'భారమున' అని యచ్చుప్రతి.

దోఁచె మొగంబులు । దోర్దండములును బాదములుఁ గన్నులు ననేకములు గంటి
మకుటాదిభూషణ । నికరంబుఁ జక్రగదాద్యాయుధములు మాల్యాంబరములుఁ

ఆ. బెక్కు గానవచ్చె । నక్కజం బైన యది, నడుము మొదలు తుది యు । నంగరాదు
తేజ మప్రమేయ । దేదీప్యమానని, ర్వికృతిమహిమ దు । ర్నిరీక్ష్య మయ్యె. 211

క. జగములకు నాదికారణ, మగుపరమజ్ఞేయము నీవ । యని కనియెను భూ
గగనదిగంతర మంతయు, నగణితమూర్తి భవన్మ । యం బై తోఁచెన్. 212

వ. చంద్రార్కులు లోచనంబులుగాఁ గలిగి దంష్ట్రాకరాళంబు లైన నీముఖంబులు ప్రజ్వరిల్లుచున్నయవి నిన్ను రుద్రాదిత్య మరుద్వసువులు ప్రవేశించెదరు సంఘంబులై వచ్చి మహామునులు ప్రస్తుతించెదరు సిద్ధసాధ్యవియచ్చరులు వెఱఁ గంది వీక్షించెద రిట్లు దీప్తాగ్రం బగుభవదీయదివ్యరూపంబు గనుంగొని నాకు విభ్రాంతి వొడమి ధృతి మాలి సుఖంబు వడయ నేరక చిక్కువడి యున్నవాఁడఁ బ్రసన్నుండ వగుము రక్షింపుము. 213

మ. అనలజ్వాలలు పర్వునీముఖములం । దార్తరాష్ట్రవ్రజం
బును భీష్మాదులు నిర్దెసం గలుగునీ । భూపాలలోకంబు గ్ర
క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు నా । కుం జెప్పవే యెవ్వరో
యని శంకించెద నిన్ను భూరికరుణా । యత్తైకచిత్తుండ వై. 214

వ. అనవుడు నప్పరమేశ్వరుం డేను లోకక్షయకర్త యగుకాలుండ నిచ్చో జనసమాజసమాహరణంబునకుఁ బ్రవృత్తుండ నైతి నీవు సంప వలయు నని లేదీ గురుభీష్మాదు లెట్లును లేకుండువార నాచేతం జచ్చినవీరి నెల్లను జయించినవాఁడ వగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము లెమ్ము రాజ్యమ్ము గైకొను మనిన వినివడవడ వడంకుచుం జేతులు మొగిడ్చి గద్గదకంఠంబుతో గాండీవి యిట్లనియె. 215

తే. అంబుపవమానసూర్యచం । ద్రానలాది, వివిధతత్త్వంబులును నీవ । విశ్వలోక
సంప్రవర్తనకరుఁడవు । శాశ్వతుండ, వచ్యుతుండవు పుండరీ । కాక్ష నీవు. 216

క. నిను నెఱుఁగ కుండి యాదవుఁ, డని సఖుఁ డని మేనబావ । యని [1]యేసభాభో
జనములు సల్లాపంబులు, నొనరించుచు మేల మాడు । చుండుదు నెపుడున్.

తే. మఱియుఁ బెక్కులు లోకసా । మాన్యభంగు, లాచరించితి నీదెస నంతవట్టు
దల్లిదండ్రులు ప్రజలకుఁ । [1]దప్పుదారు, లెల్ల సైరించునట్లు స । హింపవలయు.

వ. అని సంప్రార్థనంబు సేసి పార్థుండు వెండియు నిట్లను నదృష్టపూర్వం బైనభవదీయరూపంబు గనుగొనం బడయుటం బ్రమోదంబును బిట్టు సూచిన వెక్కసంబును హృదయవ్యథయునుం బుట్టి యున్నయది నీతొంటిసామాన్యాకారంబు గైకొని నిలిచి నాకు నాహ్లాదంబు సేయుము. 219

1. యేను సభా, జనములు_యేను సభో,జనములు. 2. దప్పుదాల్మి, సెల్ల.

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు నప్పరమేశ్వరుఁ డక్కిరీటి కి
ట్లనుఁ దప మాచరించి నిగమాధ్యయనం బొనరించి కానరా
దనఘ మదీయదివ్యపరమాకృతి పేర్చిన యేకభక్తిభా
వనమునఁ దోఁచు దీని జనవర్గము గానదు నీక చూపితిన్. 220

వ. నీవు హృదయవ్యథం బొంద నేల మూఢత్వంబు విడిచి విగతభయుండ వై సంప్రీత చేతస్కుండవు గమ్మని చెప్పి పూర్వప్రకారరూపంబు దాల్చి నిల్చినం గనుంగొని కౌంతేయుం డాసౌమ్యరూపంబు సూచి సచేతనత్వంబు నొందితిఁ బ్రకృతిస్థుండ నైతి నని పలుకుటయు వాసుదేవుండు మత్కర్మపరుండును మద్భక్తుండును నైన వానికి నన్నుఁ బడయ వచ్చు నని యతని నాశ్వాసించి. 221

తే. అతఁడు మఱియును బ్రహ్మనిర్వాణ్యయమునఁ
దనకు సందిగ్ధ మెట్టిదాని నెల్ల
నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంతకరుణఁ
దెలియఁ జెప్పెను హృదయసంచలత మాన్ప. 222

వ. ఇవ్విధంబునఁ ఫాల్గునకు నిమదర్థజాతం బవగతంబు సేసి మనసుకసటు వాపి వివేకంబునకుం జేవ గలిగించి కృష్ణుం డీగుహ్యాంతరజ్ఞానం బుపదేశించితి దీని నెఱింగికొని నీ కన్నుసూపం బోలె నన్ను బ్రవర్తింపు మనుపలుకు వలికి యింత కంటెం బరమరహస్యం బొక్కటి సెప్పెద విను మని యతని కిట్లనియె. 223

తే. క్రందుకొనుసర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నే నొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్రమోద మొంద. 224

వ. ఇప్పరమోపాయంబు. 225

క. నియతియుఁ దపమును నీదెస, భయభక్తులుఁ గలిగి నాకు భక్తుం డై ని
శ్చయనిపుణుఁ డయినవానికిఁ, బ్రియమున నెఱిఁగింపు వలదు పెఱవారలకున్.

వ. అని వెండియుఁ బుండరీకాక్షుండు నాచెప్పినయది లెస్సగా నాకర్ణించితే నీ యజ్ఞానసమ్మోహం బంతయుం బాసెనే యనవుడు నర్జునుండు. 227

ఉ. మోహతమంబు వాసెఁ దుది ముట్టె ననందు ప్రపత్తి వీతసం
దేహుఁడ నైతి గాఢపరితృప్తిమహాకృతిఁ గాంచి బోధస
న్నాహనిరామయస్థిరసుఖసన్స్థితిఁ బొందితి సర్వలోకని
ర్వాహవినోద నీవిమలవాక్యముచొప్పున నెల్లఁ జేసెదన్. 228

వ. అని పలికి యప్పరమపురుషునకు సభక్తికసాష్టాంగదండప్రణామంబు సేసి పార్థుండు గృతార్థుండై ధృతాయుధుం డయ్యె నని చెప్పి సంజయుండు వెండియు ని ట్లనుం గురుకులేశ్వరా యేను మునిగణేశ్వరుం డైనపారాశర్యుకారుణ్యంబునఁ

—•• సునాభుఁడు మొదలగుకురుకుమారులు భీమునిచేఁ జచ్చుట. ••—

ఆ. అట్లు దాఁకుటయు బకకాంతకుఁ డంత్యకా,లాంతకుండువోలె ǂ నలిగి బొమలు
ముడి వడంగ నొక్క ǂ వెడఁదయమ్మునఁ దల, నఱకివైచి పెలుచ ǂ నవ్వె నధిప.

వ. ఇట్లు సునాభుండు వడుట గనుంగొని కోపాటోపంబునఁ దత్సోదరు లగునాదిత్య
కేతుండును నపరాజితుండును బహ్వాశియుఁ బండితకుండును గుండధారుండును
విశాలాక్షుండును మహోదరుండును వృకోదరుపై నొక్క పెట్ట కవిసి పెక్కు
విధమ్ము లగునమ్ములం జెక్కింట నొప్పించిన నప్పాండవవీరుండు రోషాతిభీషణుం
డై యేరికిం దేఱి చూడ రాక పటుభల్లంబున నతనిశితక్షురప్రముఖంబున శితప్ర
దరంబున శాతక్షురికాముఖంబున దీప్తార్ధచంద్రాంబకంబున ఖరనారాచంబునఁ
గ్రూరబాణంబున నక్కుమారనప్తకంబు సమవర్తినమీపంబున కనిచినం దక్కటి
కుమారు లుక్కు దక్కి వెఱఁగుపడి యంతంత నొదిఁగిన. 73

తే. నాఁడు సభ నాడినంతయు ǂ నేఁడ చేయు
నట్టు లున్నాఁడు మొనతల ǂ ననిలసుతుఁడు
విదురుపలుకులు దలకూడె ǂ వేయు నేల
యనుచు వెఱఁ జూచు చుండిరి ǂ మనుజపతులు. 74

క. నీవుఁ దనూజులదుర్వినయావేశం బుడుపవైతి ǂ వది దుర్దశలం
గావింప నింకఁ జావక,పోవచ్చునె వారి కనిలపుత్త్రునిచేతన్. 75

వ. అది య ట్లుండె నప్పుడు సుయోధనుండు దనచుట్టునున్న యోధవీరులం గలయం
గనుంగొని భీమసేను మార్కొనం బంచి భీష్ముకడకుం జని శోకగద్గదకంఠుం
డగుచు నతనితో ని ట్లనియె. 76

ఉ. ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ ǂ డేవునఁ గోలుమసంగి పొంగి నా
తమ్ములఁ జంపఁగా నకట ǂ తప్పక చూచెదు గాని రోషశో
కమ్ములు లేవు తోడుపడఁ ǂ గా దని నిల్చితొ యున్నవారు నొ
క్కమ్మడిఁ జావఁ గోరి యిటు ǂ లూరక యుండితొ కౌరవోత్తమా. 77

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కి ట్లనియె. 78

క. ఇది మున్న యేను ద్రోణుఁడు, విదురుండును జెప్పినదియ ǂ విన వప్పుడు చె
ట్టిదు లగుపాండుతనూజుల, కెదురై నిర్జింప వశమె ǂ యీశున కైనన్. 79

తే. మనకుమారులలోన నశ్వత్థామ లతనయు, బారి కగపడువాని నెవ్వారి కైనఁ
గావఁ దలకొనశక్యంబు ǂ గాదు మనకు, నడలఁ బనిలేదు దీనికిఁ జనధిపతనయ. 80

క. వీరస్వర్గము ధనముగఁ, బోరుము నీ వింక నొండుబుద్ధు లుడుగు మేఁ
బోరెద నోపినమెయిఁ దెగి, పోరఁగ జయ మైన దానిఁ ǂ బోఁ ద్రోచెదమే. 81

వ. అనియె నని చెప్పిన విని వైచిత్రవీర్యుండు. 82

తే. గురుఁడు భీష్ముండుఁ గలుగంగఁ - గురుకుమారు
లిట్టు వోలిసెదరే మున్న - యింతవట్టు
దల్లియును నేనుఁ జెప్పినఁ - బొల్లసేసి
దానిఫల మిప్పు డాసుయో - ధనుఁడు గనియె. 83

వ. ఇంక నమ్మాట లాడుట గతజలసేతుబంధనంబు దానిం జాలింపు మట్లు కురుకుమారులచావు గనుంగొని గాంగేయకుంభసంభవులు పదంపడి యేమి సేసి రని యడుగుటయు సూతనందనుం డంబికానందనున కి ట్లను భీష్ముండు భయంకరాకారుండై మారుతిపయిం దేరు వఱపె నతనిం గని ధర్మనందనుండు సేయి వీచిన ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులు దలకడచి యతనితోఁ దలపడి రంతకు మున్న దుర్యోధనువనుపునఁ గవిసినరథికులమీఁదం జేకితానద్రౌపదేయసహితంబుగా సవ్యసాచి యడరె నభిమన్యుండును హైడింబుండును ధార్తరాష్ట్రనిదేసం దఱిమి రిత్తెఱంగున మూఁడుగట్టిమొత్తములు బెట్టిదంబు సేయ మనబలంబులుం గోక పెనంగు చుండె నట్టియెడ. 84

క. ద్రోణాచార్యుఁడు ద్రుపద,క్షోణీశ్వరుమోహరంబు - సుడివడ దివి గీ
ర్వాణులు గీర్తింపఁగఁ బటు,బాణపరంపర లనేక - భంగులఁ బఱపెన్. 85

క. కరిఘటలు మీఁద భీముఁడు, సరభసముగ నేయునార - సంబుల మ్రోఁడై
[1]ధరఁ బడి రూపఱినను దిన, కరుకరములఁ దమము విరియు - గతి దోఁచె నృపా.

క. అఱిముఱి గుఱ్ఱపుదడముల, కుఱికి కవలు రౌద్రరస - మహోగ్రాకృతులై
నఱికిన నచ్చట రథములు, వఱపఁగ రా దయ్యె నుభయ - బలయోధులకున్. 87

తే. నరుఁడు రథికజనంబుపై - సరభసముగ, నేయఁ గేయూరహార - తాటంకశకల
వితతి నిల రొప్పె రాలిన - వివిధపుష్ప,పుంజమునఁ బొల్చునుద్యాన - భూమివోలె.

వ. అప్పు డిరావంతుండు. 89

క. తురగనికరంబుతోడం, గురుసైన్యము దఱియఁ జొచ్చి - కోల్తల సూడం
గర మొప్పె ఘనవిహంగో,త్కరముపయిం గవియుడేగ - తండంబుగతిన్. 90

వ. ఇట్లుక్కు మిగిలి యెక్కుడయర్జుననందనుం గనుంగొని శకునితమ్ములు శుకుండును శర్మవంతుండును వృషకుండును నార్జవుండును గజుండును గవాక్షుండును గుఱ్ఱపుమొగ్గరంబులతో నగ్గలిక నతనిపై వాహనంబులం బఱపి పిఱుదివియక రాయి రాయి దాఁకినట్లు దాఁకి రయ్యిరువాఁగును విచిత్రంబుగా బోర నయ్యార్వురు గాంధారకుమారులు నయ్యిరావంతుం బొదివి సెలకట్టెలవాట్ల డొంకెన పోట్ల నొప్పించిన బరిగోలలపోటులు దాఁకినం గినిసినగంధగజంబుచందం బై. 91

ఆ. అతఁడు ధన్వి యగుట - నశ్వంబుఁదోలఁగ దాఁ,టించి తిరిగియాక - డిందిమగల
నారసములు పెక్కు - నాటించి నొప్పించి, వెగడువఱచెసురలు - వొగడుచుండ.

1. ధరణిం బడి రూపఱి దిన.

వ. అట్టియెడ. 93

క. మును పోటులఁ బడి నొచ్చుటఁ, దనగుఱ్ఱము వడినఁ బడక ధరణికి లంఘిం
చెను మఱవు లేక పేరు,క్కునఁ బటుఖడ్గంబు వెఱికికొనుచు రయమునన్. 94

వ. ఇట్లు భూచారి యయినభుజగరాజదౌహిత్రుం జూచి యేచి యాసుబలసూనులు
సుట్టు ముట్టి. 95

క. పొడవఁగ వ్రేయఁగ నతఁడుం, [1]గడు నుఱ వగునేర్పు కడిమికలిమిం దనపైఁ
బడ కుండఁ గృపాణమ్మునఁ, గడుఁజిత్రపుగతుల జడిసెఁ గైదువు లెల్లన్. 96

వ. ఆరౌతులు వీఁడు గాలుమానిసి యగుటం జేసి మనకు నొప్పింప వెరవు గా
దయ్యెడు నను దుర్విచారంబున. 97

ఆ. ఆర్వురును గడంగి హయముల డిగి పటు,ఖడ్గదీప్తు లడరఁ గదియుటయును
బ్రమరి తిరిగి వారిఁ బండ్రెండుదునియలు, సేసి క్రీడికొడుకు సెలఁగి యార్చె.

క. వెక్కస మందుచుఁ గురుపతి, రక్కసుతో ననియె నియ్యురగదౌహిత్రుం
డొక్కఁడ మనసైన్యంబు, లుక్కడఁచుచు నున్నవాఁ డాలంబున కంటే. 99

— ఆలంబుసునిచేత నిరావంతుఁడు మృతుం డగుట. —

వ. అని యాతనివలను సూపినం గని దైతేయనాథుండు. 100

ఆ. కడఁగి నడచి మాయ గావింప నయ్యిరా,వంతునశ్వసేనయంతసేన
పుట్టివారిమీఁదఁ బురికొని తలపడి, సమయఁజేసె నదియు సమసె నధిప. 101

వ. అయ్యిరావంతుం డొక్కరుండును బొలివోనివిక్రమంబున నలంబుసుని మా
ర్కొని రయంబు మెఱయ మెఱుంగు మెఱసినట్లు గవిసి కరవాలంబున విల్లు
దునిమిన దనుజుండు వినువీధి కెగసి మాయాశరంబుల నతని నొప్పించినం
గోపించి గగనంబునకు లంఘించి. 102

క. ఘనఖడ్గంబున వానిం, దునుమ నలంబుసుఁడు దోడ్తో నుజ్జ్వలయా
వనరూపము గ్రొత్తగఁ గై,కొని పెనఁగం బెనఁగఁ బార్థుకొడు కచలుం డై.

క. జననీవంశంబునఁ గల,యనుపమమాయానుభావ మాత్మఁ దలఁచి శే
షునిచందం బగురూపం,బునఁ బేర్చి యనేకనాగపుంజముతోడన్. 104

చ. అడరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని మాయతోడ లోఁ
బడ భుజగంబులం బొదివి పట్టి రయంబున మ్రింగి యప్డు చే
డ్పడునరుపట్టికంఠము గృపాణమునం దెగ వైవ మేదినిం
బడి మొగ మొప్పెఁ బూర్ణశశిభాతి వికారము లేనిచెన్నునన్. 105

వ. అంత వియత్తలంబుదాత్తమిహిరమండలమండితమధ్యం బయ్యె నని చెప్పిన
విని ధృతరాష్ట్రుం డయ్యిరావంతుండు వడినం బాండవులును వారియోధవీరు
లును జేసిన తెఱంగు సెప్పు మనవుడు సంజయుం డతని కిట్లనియె. 106

1. గడువడి పేర్వసను గడిమి.

శా. క్రోడంబుట్టువుపాటు సూచి యలుకన్ దుర్వారశుంభద్గతిన్
హైండింబుండు మహాసురేంద్రుఁడు గజేంద్రారూఢుఁడై సంగర
క్రీడాలోలతఁ దన్ను మీఱి విలసద్దోర్గర్వం బొల దిక్చక్ర మ
ల్లాడన్ బెట్టుగ నార్చి చొచ్చెఁ గురుసైన్యంబున్ మహోగ్రంబుగన్. 107

చ. కరమున నున్నశూలమునఁ గ్రమ్మఱమెఱుంగులు శత్రుసైన్యభీ
కరములు గాఁ గజాశ్వభటసంఘముల న్నడి గ్రుచ్చినట్లుగాఁ
జెరువుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధసింధురో
త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్. 108

క. వంగాధిపతియు శౌర్యో,త్తుంగతనుం డగుచు నీసుతుం దలరఁగ దై
త్యుం గదిసె గాఢమదమా,తంగఘటలతోడ నవుడు దారుణభంగిన్. 109

వ. ఇట్లు దన్ను బెట్టు గిట్టినకరినికరంబులం గని పొంగి కరవాలంబు గొని యడరి ఘట్టోత్కచుండు. 110

క. కరదంతకర్ణమస్తక,చరణము లని తోఁప కుంపసచందముగా ని
ష్ఠురవిక్రమకేలీవి,స్ఫురణంబున రూపు మాపె సురలు నుతింపన్. 111

వ. ఇవ్విధంబున గజంబులు వొలిసిన గజపురనాథుండు రోషంబున నురవడించి నారాచవృష్టి ముంచి వేగవంతుండును విద్యుజ్జిహ్వుండును బహ్వాశియు ననుదనుజప్రధాననాయకు[1]లం బ్రేతపతిపురంబున [2]కనిచి యాభీమసేనతనయుతనువున నిశాతశరంబులు నించినం గోదండపాణియై క్రోధాగ్నిజ్వాలలు నిగుడుచున్నవునఁ బటుబాణజ్వాలలు నిగిడించి కదిసి కురుపతి నవలోకించి యతండు. 112

ఉ. పాడియు సత్యముం గలుగు పాండవకోటికి నీవు దొల్లి యా
ప్వాడిమెయిన్ సభం గిరము భంగ మొనర్చితి నాఁటియుందఱుం
జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూఁదలించి మై
నాడఁగ నేసెఁ గృష్ణభుజగావలిఁ బోలిననారసంబులన్. 113

క. దానికిఁ జల మెడలక నీ,సూనుం డాపవనసూనుసూనుని మేనం
దా నుగ్రశరము లిరువది,యేను వెసం గీలుకొలిపె నిభపురనాథా. 114

తే. అసుర గినిసి కృతాంతజిహ్వాయనుబోని,శక్తియెత్తిన నమ్మహీశ్వరున కపుడు
వంగపతి యడ్డపడుటయు వానిగజముఁ, గూలవైచిన నాతండు నేలకుఱికె.

క. ఏనుంగు వడిన నచ్చటి,సేనలు గెరలుటయు రాజసింహుఁడు దన్నుం
దాన పురికొల్పికొని వెఱ, పూనక దానవుని యెదుర నొక్కఁడ నిలిచెన్. 116

క. నిలిచి మహాస్త్రం బెఱమం,టలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చె
క్కలు గాఁగ నేసి దిక్కులు, నలిగులిగా నతఁడు సింహనాదము సేసెన్. 117

వ. ఇట్లు సేసిన విని గాంగేయుండు గురుపతియోధవీరులం గలయం గనుంగొని.

---

1. లుద్రేకంబునఁ గదిసిన వారిం బ్రేత. 2. కనిచి రణప్రారంభంబునం గదిసి యాభీమ.

క. భీమునితనయుం డత్యుద్దామగతిఁ రాజుఁ దొడరి ✽ తత్కరటిఘటా
స్తోమంబు గూల్చి యాతని,పై మాఱి పెనంగినట్లు ✽ బలువిడిఁ గవిసెన్. 119

వ. ఆఘటోత్కచుండు దివిజులకు నజయ్యుండు మీఱి వేవేగ రారాజుం గూడికొనుం డనిన సేనాపతిపలుకులకు గురుకృపాశ్వత్థామచిత్రసేనులు బృహద్బలబాహ్లికావంతీనాథభూరిశ్రవసులును సైంధవసోమదత్తవివింశతివికర్ణులు నేకోద్యోగంబునం దమతమయనుచరు లైనయోధవీరసహస్రంబులతో రథంబులు దోలికొని చని భవత్తనయుం బరివేష్టించి హిడింబాతనయుం దాఁకిన నతండును దైతేయబలంబులం గొని బలిమి మెఱసి నిలిచి మార్కొనియె నారెండుసైన్యంబులు నొండొంటి కెదిర్చి పేర్చి పెనంగుచుండ నాభీమసేననందనుం డాచార్యప్రభృతులగునాపన్నిద్దఱపై బహుప్రకారక్రూరబాణంబులు వరఁగింప నందు. 120

—.. ఘటోత్కచుండు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబు సేయుట. ..—

క. కొందఱనూతులు వొలిసిరి, కొందఱచాపములు దునిసెఁ ✽ గొందఱపటుల
స్యందనహయాలి పడియెను, గొందఱయంగములు వ్రస్సెఁ ✽ గురుకులముఖ్యా.

వ. ఇట్లతిరథమహారథులం జిక్కువఱచినరక్కసుని కలిగి రయంబున సాధనంబులు సమకట్టికొని రభసంబున నాకుంభసంభవాదిద్వాదశరథికవరులు నొక్కపెట్ట చుట్టు ముట్టి మహాస్త్రజ్వాలాజాలంబులం బొదివిన. 122

ఆ. ఓర్వ రాక దానవోత్తముఁ డంబరవీథి కెగసి పోయి ✽ విపులరవము
సెలఁగఁ బెలుచ [1]నడరిసజీమూతభంగి దుర్దాంతుఁడైనఁ జూచి ✽ ధర్మసుతుఁడు.

వ. భీమసేనుతో ని ట్లనియె నిక్కడ భీష్మబాణంబ బడినపాంచాలబలంబులఁ బరిపాలింపను నక్కడ నాచార్యాదుల కగపడ్డఘటోత్కచుం గావను వలసియున్నయది యివ్వలనికిం గవ్వడి గలం డవ్వలనికి వేగంబ యరుగు మనిన సింహనాదంబు సేయుచు. 124

క. కౌరవబలములు సుడివడ, మారుతి గవియుటయు మెఱసి ✽ మార్కొని కురుధా
త్రీరమణుఁ డర్ధచంద్రా,కారశరము దొడిగి ధనువు ✽ గ్రక్కునఁ దునిమెన్.

తే. తునిమి తోడన క్రొవ్వాఁడి✽దొడ్డనార
సంబు భీమునివక్షస్స్థలంబు దూఱ
సేయుటయు సోలఁ గని ద్రౌపదేయు లడరఁ
గడఁగె సౌభద్రుఁడును ఘటోత్కచుఁడుఁ గలసె. 126

వ. ఇట్లు దండి నొచ్చినఁ బాండుపౌత్త్రులు నీపుత్త్రునిపై నొక్కపెట్ట మిక్కుటంబగుకోపంబునం గవిసిన. 127

చ. కని కృపబాహ్లికాదిరథి✽కప్రకరంబు గడంగి వారి మా
ర్కొని పెనఁగంగఁ దేఱి కడుఁ ✽ గ్రూరత నేచినమారుతాత్మజుం

1. సొదరి; సుదరి.

జెనసి గురుండు ర క్తపరిషిక్తుని౯ జేసిన నాతఁ డల్గి యా
తని నొకనారసంబున నురంబున గ్రుచ్చి మూర్ఛ మునుంగ జేసినన్. 128

మ. ధనురాచార్యుని౯ జూచి తత్తనయుఁడు౯ ధాత్రీశుఁడు౯ భీము మా
ర్కొని రాతం డెలనవ్వు నెన్నుగ గడాఘోరాకృతిం దేరు డి
గ్గినయాలోనన తేటి ద్రోణుఁడు గడంగెం జూచి తోడై కృపా
దినికాయంబు గడంగి వాయుసుతుపైఁ దివ్యాస్త్రముల్ నింపఁగన్. 129

క. ఏపున హిడింబసుతుఁడును, ద్రౌపదిపుత్త్రులు సుభద్రాతనయుఁడుఁ గోపో
ద్దీపితులై వారలయాటోపముఁ గుదియించి రతిపటు ప్రదరములన్. 130

వ. అప్పు డనూపభూపాలుండును భీమసేనసఖత్వలోలుండు నగునీలుండు నశ్వత్థా
మం దొడరి నొచ్చినం గని ఘటోత్కచుండు. 131

క. తలపడి యగ్గురునందనుఁ, జలమున నొప్పింప గురుఁడు సరభసముగ ను
జ్వలబాణావృతుఁ జేసిన, బల మఱి దనుజుండు మాయ బన్నెఁ గుపితుఁడై.

వ. ఇవ్విధంబున హిడింబాసూనుండు సేసినమాయం జేసి. 133

క. గురుఁడు మొద లైనయాప,న్నిరువురుఁ గురుపతియు నొవ్వ నేటులఁ బడి నె
త్తురు దొరఁగ సోలి సంగర,ధరణిం బడినట్లు దోఁచెఁ దత్సేనలకున్. 134

చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొన౯ నెనఁ బాఱ నావగా
తనయుఁడు సేన నాఁగి యివి దైత్యులమాయలు గాని బొంకు బొం
కని యెలుగెత్తి చెప్పఁగ భయంబున నమ్మక పోయె నట్లు వో
యినఁ జనుదెంచెఁ గౌరవమహీశుఁడు దీనత భీష్ముపాలికిన్. 135

వ. వచ్చి యిట్లనియె. 136

క. నీవును ద్రోణుఁడుఁ గలుగం,గా వైరులచేత నేను గష్టపడితిఁ గా
దే వారితోడఁ దలపడి, చావొండెను విజయ మొండె సంపాదింతున్. 137

చ. అన విని నవ్వి పాండవులయంతటివారికిఁ గాక నీకు మా
ర్కొన నగు నయ్య [1]యిప్పరుసుకుత్సితవర్తన మిట్టిదు స్తరం
బునఁ దగులావు సేయు మనుజబోఁటులు లేరె చలంబు డింపు మీ
వని పతితోడఁ జెప్పి సరిదాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్. 138

వ. భగదత్తు నాలోకించి, 139

క. దనుజు లొనరించుమాయలు, నిను: జేరవు వారి గెలుకు నీ విప్పుడ యా
జనపతి మెచ్చఁగ నాదైత్యుని గెలువుము నీదుసేనతో నడరి వడిన్. 140

వ. అని భీష్ముండు పలికినం బ్రాగ్జ్యోతిషపతి మేటిమగండు గావున నమ్మాటకుం బొంగి
సింగం బడరినచందంబున నార్చి సుప్రతీకంబు నెక్కి సేనాసమేతుం డై. 141

1. యిప్పుడుమ ♦ కుత్సిత.

తే. పరఁగి తోఁతెంచు పాండవబలము మీఁదఁ
గవియుటయు నంతనంతఁ గౌరవులమూఁక
మరలి యేర్పడఁ జూచి యక్కమ్మాట యపుడు
నిజముగాఁ గొని యాజికి నిగిడె మగుడ. 142

వ. ఇట్లుభయసైన్యంబులుం [1]దలపడినసందడికయ్యంబున నపరాహ్ణం బగుచునుండ.

క. నగపతియుఁ బోనిగజపతిఁ, దగ నేడ్తెఱ నెక్కి ప్రబలదైత్యబలముతో
నిగుడంగ ఘటోత్కచుండా, భగదత్తునిమీఁదఁ గవిసెఁ బార్థివముఖ్యా. 144

వ. తదవసరంబున వృకోదరుం డరదంబు రయంబు మెఱయ నయ్యభిమన్యుద్రౌపదేయప్రముఖులుం దానును హైడింబునకుం దోడై కడంగె నట్టియెడ. 145

ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగదత్తుదంతి రక్తధార లొప్పెఁ
జెలువు రెట్టిగాఁగ జేవుఱుసెలయేఱు, లున్నతాచలమున నురలునట్లు. 146

క. శూలంబున హైడింబుఁడు, గాలాకృతితోడ వైవఁగా నది పొడియై
రాలెడునట్లుగ మగఁటిమి, వ్రాలినభగదత్తుఁ డేసె వడి భల్లమునన్. 147

వ. ఇ ట్లేసి యార్చి వెండియు. 148

ఆ. భీముహారులఁ గూల్చి పేర్చి సౌభద్రాది, యోధవరుల నెల్ల నుఱక తఱుచు
టంపవానఁ దడిపి హయరథభటసమూ, హంబుఁ జంపె సమదహస్తిఁ బఱపి.

క. మందరము మహాంభోనిధి, యందుఁ దిరుగునట్లు, పాండవానీకములో
నం దిరిగి సుప్రతీక మ, మందగతిం జంపెఁ బెక్కుమాతంగములన్. 150

క. అలిగి దశార్ణాధీశుఁడు, గొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము న
జ్జ్వలము లగునతనితోమర, ములతాఁకున నది చలించి మొగతిరిగె వెసన్.

వ. ఇవ్విధంబునం బోరుభగదత్తుం గనుంగొని గండు మిగిలి కురువిభుండు గురుకృపాది యోధవీరసమేతంబుగాఁ దఱిమినం దమబలంబులు గోలాహలబహుళంబు లగుటయుఁ బాండవాగ్రజుండు పార్థపాంచాలపురస్సరుండై యవ్వాలనికిం గ్రొవ్వాలరం గోత్రల సేసె నట్టిసమయంబున. 152

—✿ ఆర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట. ✿—

క. నరుఁడు ధనుర్గుణరావ, స్ఫురణంబును దేవదత్తభూరిరవము నం
బరము వగిలింప నానా, శరములఁ గురుసైన్యసరభసత్వం బుడిపెన్. 153

ఆ. అపుడు సేరి భీముఁ డతనికి భుజగేంద్ర
కన్యకాసుతుండు గలనఁ బడుట
నల్లఁ జెప్పుటయును నడలి యొచ్చట నని
యడిగి యతఁడు నూవ నచటి కరిగి. 154

1. దలపడి సందడికయ్యంబుగా నపరాహ్ణంబునం బెనంగు చుండ.

వ. దనుజఖండితుం డగుచు పడి యున్నయయ్యిరావంతుశరీరంబు గనుంగొని యా
ధనంజయుండు. 155

చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీరులు నించి యాసురో
ధనువిపినీతియుం బిరప ధర్మతనూజుఁడు సంధి గోరి ప
ల్కినతగవుం గడంగి యునికిం దలకొన్ననిజోద్యమంబుఁ దో
చిన మదిఁ దిట్టుచుం విసుతి సేయుచు రోయుచు నుండె నయ్యెడన్. 156

వ. ఇట్లు పుత్త్రశోకానలసంతప్తచిత్తుం డగుసవ్యసాచిం జూచి గోవిందుండు మంద
స్మితంబు సేసిన. 157

క. తని యతఁడు దెలిసి నీచే, వినినది యిది మున్న దీని విధిచితి నహీంభం
జన తేరు నడపు గురుబల, వినిపాతనపాటవమున విహరించుటకున్. 158

వ. అని పలికినం బద్మనాభుండు రథంబు రయంబున మునకొనపయింపుచుఁ బార్థుం
డు పటుబాణపరంపరలు పరగింప భగదత్తుండును గృపాచార్యుండును త్రిగర్త
పతియును భీష్ముం గూడుకొని యాక్రీడి నెదిర్చిరి సాత్యకి యుదరినం గృతవర్మ
బాహ్లికులు మార్కొనిరి మారుతి గవిసినం గుంభసంభవుండు దలపడియె నతని
ప్రాపున నేపు మిగిలి నీపుత్త్రకు లాబకమర్దను మర్దింపం గడంగి కవిసిన. 159

క. గురునంపవెల్లి నాఁగుచు, సరభసముగ వారిమీఁద శరవర్షంబుల్
గురియుచు వారలయమ్ములఁ, దెరలక భీముండు పటుగ్రతిస్యందనుఁ డై. 160

వ. సమరక్రీడ సలుపుచుఁ గురుకుమారులు దొరఁగించునారాచధారల నొచ్చి
యాజ్యధారాక్రాంతుం డై నయర్చిష్మంతుండునుం బోలె మండి యుద్దండకోదండ
నైపుణ్యంబు సూపినం గుండభేదియు ననాధృష్యుండును గనకధ్వజుండును విరావి
యు సుబాహుండును దీర్ఘబాహుండును దీర్ఘలోచనుండును దీర్ఘనిద్రం బొందిరి
పెఱవారు వెఱచఱచి విఱిగి పఱచిన నజంబుల వెనుకొనువృకంబువిధంబున
వృకోదరుండు దోర్విలాసంబు మెఱసె నప్పుడు బ్రొద్దు గ్రుంకు చుండ నీపెద్దకొ
డుకు బలుమొనలం బురికొల్పికొని చలంబునం గోత్తల సేసినం గౌంతేయవ్యూ
హంబులు నభినవోత్సాహంబునం బోర పెనంగిన. 116

తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబులఁ జాల నొప్పెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
దెఱఁగులోడవులు దొడిగినతెఱవవోలె. 162

---

*"క. నీచెలువుమ నీబలువున, నీచతురత నీబలంబు నీసాహసముల్
నీచక్కఁదనము నే నే, రాచూలికిఁ గలుగఁ గందునరా రాకుత్తా.

వ. అని యంత నిలువక." ఈ పద్యగద్యములు 155-వ దానికిఁ దర్వాత నచ్చుప్రతులలో
ముద్రింపఁబడి యున్నవి గాని వ్రాఁతప్రతులం జూపట్టవు.

వ. అంత. 163

క. తిమిరము గవిసినఁ బాండవ,సమితియుఁ గౌరవులు రణము । సాలించి నిజా
వసములకుఁ దగఁ జని రయ్య,ష్టమయామిని నుదితపటువిస్మయాకులం దనరన్ 164

క. కురువిభుఁడు నగరు సొచ్చియుఁ, జొరమిన గాంధారవిభుని । సూతతనూజున్
ద్వరితముగఁ బిలువుమనియా,తురతం బలుమాఱుఁ జెప్పె । దుశ్శాసనునన్.

వ. చెప్పిన నతండు వారిం గూర్చుకొని వచ్చుటయు నేకాంతంబున నమ్మహీకాంతుండు వారలతో ని ట్లనియె గాంగేయగురుకృపాశ్వత్థామలు మధ్యస్థులై పాండవబలంబులం జెఱుచునట్టిసంరంభంబునకుం జొరరు మనసేనలు నానాఁటికి సన్నంబులై సమయుచు వచ్చె నేమి సేయం గలవార మనిన విని రాధేయుండు రణక్రీడాలంపటుం డై. 166

క. నరనాథ యింక భీష్ముని, దురమునకుం దేకు మేను । దోర్బలవిభవో
ద్ధురతం బాండుకుమారో,త్కరముం దత్సేనలఁ మృదం బఱఁగింతున్. 167

క. అని పలికిన విని దుశ్శా,సనుఁ గనుఁగొని మనము వోయి । శాంతనవునిభం
డన ముడిపి వత్త మని చె,ప్పి నరేంద్రుఁడు వీడుకొల్పెఁ । బెఱవారిఁ దగన్. 168

వ. ఇట్లు కర్ణసౌబలుల నిజనివాసంబులకుం బోవం బనిచి బహుప్రకారసౌరభసంవాసితంబు లగుజలంబుల జలకం బాడి పరమసురభిచందనానులేపంబులను జీనిచీనాంబరపరిధానంబులను మహనీయమాల్యాభరణంబులను బ్రస్ఫీతమణిమయభూషణధారణంబులను దగ నలంకృతుండై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ బరిమళపరంపరాభాసిత నూతనతైలధారాభిషేక ప్రదీపితంబు లయినకరదీపికాసహస్రంబులు వెలుంగ వేత్రహస్తులు దొలంగు తొలంగుం డని సందడి నెడగలుగ జడియ వందిసందోహంబులు సంకీర్తనంబులు సేయ మాగధమంజులగానంబులు వీనులం బొరయఁ బాఠకపఠనరవంబుల మనంబు రంజిల్ల రమణీయరత్నఖచితం బగురథం బెక్కి మందమందగమనంబున మందాకినీనందనుమందిరంబు సేరం జని తదీయద్వారంబునం దేరు డిగ్గి దుశ్శాసనుముంజేయి కరతలంబున నవలంబించి యల్లన నడచి యుచితప్రకారంబునం బ్రవేశించి యప్పితామహుపాదంబులకుం బ్రణామంబులు సేసి తత్సమీపంబున సముచితకనకాసనంబున నతం డనుప నాసీనుం డై చేతులు మొగిచి యమ్మనుజపతి యతనితో ని ట్లనియె. 169

మ. నిను ము న్నెంతయు నమ్మి పాండవుల యుగ్రోన్మేషంబు నేఁ జీరికిం
గొన నీపౌరుషచందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే
రి నయం బిచ్చుచు నొంప నూఱ్కొనక వారిం బట్టి పాలార్చె దొం
డన నేరం గురుముఖ్య యింక నిట నీ । వాలంబు సాలింపవే. 170

చ. అనిమొన దేవదానవుల । కైనను మాఱ్కొన రాదు నిన్ను నేఁ

డెనిమిదినాళ్లు లయ్యె సమ§యింపవు నొంపవు సవ్యసాచి న
ప్పని యటు లుండనిమ్ము నినుఁ § బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవ నిచ్చి నృప§సత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే. 171

వ. అనవుడు. 172

క. అమ్మాట మానసమునకు వా,లమ్మై తాఁకుటయు భీష్ముఁ § డత్యంతవిషా
దమ్మున నించుగవడి మా,నమ్ము దగం దాల్చియుండె § నతవదనుం డై. 173

వ. పడంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి. 174

క. తలకొని నీకుం బ్రాణం,బులు డాఁపక యోపినట్లు § పోరఁగ నిమ్మైఁ
బలుకఁ దగునె యొక్కట నా,వలనం గలభక్తి యెల్ల § వమ్మునఁ గలయున్. 175

వ. అని పలికి యలుక వొడమి వెండియు. 176

సీ. కాల్పడే మహనీయ§ఖాండవం బింద్రుని, నమరగణంబుతో § విముఖుఁ జేసి
బహుదివ్యశరములు § వడయఁడే యొక్కటి,బవరాన మెప్పించి § శివునిచేత
గంధర్వులకు నోడి § కర్ణుండు నీతమ్ము,లును బాఱ విడిపించి§కొనఁడె నిన్ను
విను నను ద్రోణు నా§తనిపుత్త్రుఁ గృపుఁ గర్ణు, గెలిచి విరాటుగో§వులఁ గొనఁడె

ఆ. తక్కు పెక్కుతెఱఁగులఁ § బెక్కండ్ర నేమిమి, సేసె వినమె యట్టి§జెట్టి నిన్ని
దినము లిట్లు దొడరి § పెనఁగియు నీచేత, నేఁడు వినఁగ వలసె § వేఁడిపలుకు.

క. తగనిపని యని తలంపక, పగ గొంటి విజయ్యుకైన§పాండుసుతులతోఁ
దెగి యింక నీవు రణమున, మగఁటిమి వాటింపు రిత్త§మాటల నగునే. 178

వ. అని మఱియును. 179

క. గాండీవి గెలువ రాదు శి,ఖండిని జంపంగ నాకుఁ § గాదు వినుము న
న్నొప్పించుమగలు మార్కొ,నినం, జెంపుదు నగ్రముగ మున్న § చెప్పితి నీకున్.

క. ఏనును నాదళమును ద్రుప,దానీకవిరాటసైన్య§యాదవబలసం
తానములతోడఁ బెనఁగెదఁ, బూనుఁడు మీ రెల్లఁ బాండు§పుత్త్రుల గెలువన్.

ఆ. నడికిరేయి వచ్చి § నను నొవ్వఁ బలికినఁ, గలుగునయ్య జయము § గడఁగి నీవు
నడవు మనికి నెల్లి § నాచేతి[1]బలుపు నూ,చెదవు గాక వేయుఁ § జెప్ప నేల. 182

క. అనినఁ బ్రియమంది నగరికిఁ, జని పతి సుఖనిద్ర సేసి § సముచితసమయం
బున మేలుకాంచి కయ్యం,బున కాయిత మయ్యె మేను § పొం గారంగాన్.

వ. ఇట్లు సన్నద్ధుం డయి బలంబుతో వెడలి నీపుత్త్రుండు భీష్ము నుపలక్షించి భూపతి
ప్రకరంబులతో ని ట్లనియె. 184

—•• భీష్మునినవమదివసయుద్ధము. ••—

తే. ఇతఁడు పాంచాలు రాదిగ § నెల్లబలముఁ
జంపి పాండుతనూజుల § సమరభూమి

1. బయవు.

గెలువఁ గలవాఁడ నని రాత్రి ◊ పలికె నేఁడు
దలఁచి మనలావుఁ జేవయు ◊ మెఱయ వలయు. 185

క. అనియాడుతలుపమాటలు, విని బీభత్సుండు సిగ్గు ◊ విపులవిషాదం
బును నొక్కపెట్ట పుట్టఁగ, ననిమిషతటినీతనూజుఁ డతిదుఃఖితుఁ డై. 186

వ. తన్నుం దాన యుపశమించుకొని యున్నం గనుగొని కౌరవేశ్వరుం డతనిక
న్నెఱింగినవాఁ డై దుశ్శాసనునితో ని ట్లనియె. 187

క. మన మెల్ల బితామహు నొద్దన యుండుద మదియుఁ గా కీతనిముందటఁ బె
ట్టన వలయు శత్రుబలము,ర్దను లిరువదిరెండువేలరథములవారిన్. 188

వ. అని నియోగించిన నతం డట్ల చేసె నద్ధరణీశుండు గురుకృపాశ్వత్థామల నాలో
కించి గాంగేయుం జూపి సత్యవ్రతుం డగునీతండు శిఖండిపై సేయునని మనమె త్తి
విడియున్నాఁడ చెప్పుట మీఱెఱుంగుదుర కాదె యన్నిచునకు నోచరంబు గాకుం
డ నిమ్మహానుభావుం బాదివిగొని రా వలయు ననిన వారలు నట్ల కాక యని ర
య్యమరనదీసూనుండు సర్వతోభద్రవ్యూహం బొనర్చి నందుఁ గృపాచార్య
కృతవర్మశల్యశకునిసుదక్షిణసైంధవులును గురుకుమారులుం దానును ముందట
నిలిచెఁ దదనుమతిం గుంభసంభవభూరిశ్రవోభగదత్తులు వలపటను సోమదత్త
ద్రోణపుత్రవిందానువిందులుదాపటను హాలాయుధాలంబుసశ్రుతాయువులు వెను
కను ద్విగర్తప్రకరపరివృతుం డై జననాథుండు నడుమను నిలిచి రంతకు మున్న
కౌంతేయులు సైన్యసమేతంబుగా వెడలి రట్టియెడ నర్జునుండు మన మొగ్గ
రంబు నూచి ధృష్టద్యుమ్నున కి ట్లనియె. 189

తే. కంటె గాంగేయు నతనిచక్కటి శిఖండిఁ, బెట్టుమీతని మనమెల్లఁ ◊ బిండుగట్టి
పొదివికొని వత్తమివ్విధంబునకుఁ దగ ద,ళంబుగా మోహరింపు బలంబునెల్ల.

వ. అనిన విని యతం డట్ల చేయుదునని సాత్యకివిరాటులు వలపటను నభిమన్యు
పాంచాలకేకయులు దాపటను నకులసహదేవద్రౌపదేయపురస్సరుం డైన యుధి
ష్ఠిరుండు నడుమను జేకితానకుంతిభోజులు వెనుకనుంగా నొనర్చి యగ్రభాగంబు
న శిఖండి నునిచి యతనికెలంకుల డాసి భీమసేనఘటోత్కచు లొక్కవలనను
బార్థుండుఁ దాను నొక్కదిక్కున నిలిచి తక్కినయోధవీరులం గలయంజేర్చి గట్టి
మొనగా నమర్చె ని ట్లుభయసైన్యంబులుం బన్ని భేరీభాంకారశంఖాదినిస్వన
గర్జానూర్జితబహుళంబుగా నొండొంటిం దాఁకె నట్టిసమయంబున. 191

క. చెంగట నభిమన్యుండు పిశంగతురంగప్రచారచంచద్రథుఁ డై
పొంగి మనదిక్కు ప్రజమీఁ,దం గవిసెం జిచ్చు దూదిపైదరికొనుమాడ్కిన్. 192

వ. ఇట్లు గవిసి. 193

తే. మెఱసి మండలచారియై ◊ కొఱవి ద్రిప్పి,నట్లు గురుకృపసింధురాజాదు లైన
యోధవీరులు వెగడందనులివు మిగిలి, తరువఁబడునబ్ధి క్రియ సేనదిరుగఁబడఁగ.

వ. ఇట్లు మాఱులేక తఱుముచున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలంబుసుతో
నిట్లనియె వీఁడు రెండవయర్జునుం డై మనబలంబులఁ గలంచుచున్నవాఁ డర్జున
నందను నెదుర్కొన నీవ కాని మాఱు లే దేము పాండవుల కడ్డపడియెదము
నీవు వీనిం బొదివి భంజింపుము. 195

అలంబుసుఁడు దుర్యోధనప్రేరితుం డై యభిమన్యునిపైఁ గవియుట.

క. అనవుడు నతండు దుర్దమదనుజావలి మున్నుగాఁగఁ | దఱిమెం గుంతీ
తనయబలము గాకులు, పెనుగాలిం దూలునట్లు | భీతిం జెదరన్. 196

ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము సొచ్చి దైత్యులం
గుప్పలుగా మహిం జెలుచఁ | గూల్చిన దానవనాథుఁ డమ్మలం
గప్పెఁ గడంగి వారల నఖండపరాక్రమలీల వారు వాఁ
డొ వ్పతి తేఁకూఁబరము | యూఁతగ వ్రాలఁగ నేసి యార్చినన్. 197

క. ఆలోనన తెప్పిఱి లయా,కాలుండునుబోలె నసుర | గన్నుల నిప్పుల్
రాలఁగ వారలసిడములు, నేలం బడ నేసి చాపనికరము ద్రుంచెన్. 198

వ. త్రుంచి నవ్వుచు. 199

తే. ఒకని నొకని నైదై దుమ్మహో | గ్రభాసు
రాస్త్రముల నేచి నొంచిన | నతనిమదము
సొంపు సోదరవ్యథయును | జూచి యడరె
నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు. 200

వ. అప్పు డుభయసైన్యంబులవారును వెఱఁ గంది. 201

క. దనుజుఁడు మాయాధికుఁ డ,ర్జునతనయుఁడు దివ్యశరధరుం డె ట్లగునో
యనుచుండఁగ నయ్యిరువురు, నని సేసిరి వృత్రవాసవాకృతి దోపన్. 202

క. ఇతరేతరశరకృతశో,ణితధారలు నిగుడ నపుడు | నిర్భరదావ
ద్యుతు లడరఁ బొలుచునగముల,గతిఁ బొలిచిరి వార లప్రకంపోన్నతు లై.

క. దనుజేశ్వరుండు మాయం, బొనరించినఁ దమము గవిసె | భూనాయక ఫ
ల్గునసుతుఁడు భాస్కరాంబక,మున వెలుఁగొనరించె నసురసమూహము వొగడన్.

తే. అసుర వెండియుఁ బెక్కుమాయలు ఘటింప
శక్రపౌత్రుండు దివ్యాస్త్రజాల మడరఁ
జేసి యన్నింటి నడఁగించి | చెలఁగి నొంప
రథము డిగి పాఱెఁ బెలుచ నారాతుసుండు. 205

క. రక్కసుఁడు విఱిగినం గడు, నుక్కున సౌభద్రుఁ డడరుసురవడి గని న
ల్దిక్కులం బఱచెం దమలోఁ, జిక్కువడుచుఁ గౌరవేంద్రసేనలు భీతిన్. 206

వ. అప్పుడు పెక్కండ్రు రథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యుపయిం గవిసిన.

తే. అతఁడు దానికిఁ దలఁకక | యుందఱకును, నన్నిరూపు లై పోరంగ | నర్జునుండు

సరభసంబుగ భీష్ముపై గురియింపఁ, బొంగియిరువాఁగు నిరువురఁ బొదివె బెరసి.

వ. అట్టిసంకులసమరంబున నభిమన్యుపై గడకుకృపాచార్యుం దాఁకి సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ నడుమ యతనివిల్లు ద్రుంచినం గోపించి. 209

క. ఆసాత్యకి వేలోకవి, ల్లాసురగతి నెత్తియుగ్ర మగునారాచం
బేసిన నాతఁడు గేతు, వ్యాసక్తుం డయ్యె మూర్ఛ వచ్చి నరేంద్రా. 210

క. ఆలోవన తెలిసి మెఱుఁగు, వాలికతూపు తఁ డతనిశ్రవణమున కుఱుం
గీలించి నిడుము గ్రక్కున, నేలం బడ నేసి యార్చె నింగి వడంకన్. 211

వ. దానికిం గినిసి శినిమనుమండు పౌగరు మిగులునారాచనిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగునుగ్రభ స్తిబింబంబో తె నైనం గనుంగొని. 212

క. ద్రోణాచార్యుండు సుత, త్రాణపరత్వమునఁ గృష్ణశరవృష్టిపై న
క్షీణోద్ధతిఁ గవియుడు గీ, ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. 213

చ. అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లను ద్రోణుఁ డాత్మ న
ర్జునునకుఁ గూర్చు నాతఁడు గురుం గని యెంతయు భక్తి సేయు వా
రనిఁ దమలోన నట్లు పెన వవ్వుడు దార్కొని యెట్లు పోరిరో
వినఁ గల దేర్పడం జెపుము విస్రుతభంగిగ నాకు సంజయా. 214

వ. అనిన నానూతనందనుం డతని కిట్లనియె. 215

క. క్షాత్రము దలకొని సంగర, ధాత్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్
పౌత్త్రులు శిష్యులు మామలు, పుత్త్రులనం గలదె తొడరి పోరన వలయున్.

-ఆర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట.-

వ. వినుము. 217

సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యు మూఁడునా, రసములు నేసి యుగ్రంబుటంప
వెల్లువ వఱపిన వెగ డొంద కాతఁ డాతని మేనఁ దూపులు దఱచు గాఁగ
నాటించె నంత భూనాథుండు పురికొల్పఁ, గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ
నరుఁ డేచి వాయుబాణమ్మున నమ్మేనఁ, దూలింపఁ గుంభజుశైలశరము

ఆ. వచ్చి యుడుప నలిగి వానవి నారాచ, వర్షమునఁ ద్రిగర్తవరునివుత్త్ర
చయముఁ [1]దెరలుచుటయుజనపతికృపశల్య, బాహ్లికులును దాన బార్థుఁ దాఁకె.

వ. అట్లు దాఁకుటయు వారల నతండు గన్నె రాకమ్ములం జీకాకుపఱిచె నట్లుగురుండు మొదలైనయుండఱకును నాధనంజయుపోరు దలమునుక లయ్యెఁ గురుపితామహుండు ధర్మసూతి యున్నయట్టి కుఱికి తలలు చెండాడె శకునిభూరిశ్రవసులు గవలం దలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభసేనలతోడం దొడరి భీమసేనుం బొదివిన. 219

1. దెల్చుటయును.

క. గిరి డిగు కేసరిచాడ్పున, నరవము డిగి భ్రమితపటుగదాభీలత నా
కరువలిపట్టియుఁ గవిసినఁ, గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తిగతిన్. 220

తే. క్రందుకొని యిట్లు మాతంగఘటలు విఱుగ
నాశ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ
బోక నిలిచి యమ్మారుతపుత్త్రుఁ జోడుఁ
దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు వఱపి. 221

వ. అప్పుడు గాంగేయుండు సేయుదారుణరణంబు ధర్మపుత్త్రునకు భరం బైన నతం
డెలుంగెత్తి పేరువేరం బిలిచి చేయి వీచిన నాకళింగనాథభగదత్తుల విడచి
యప్పుడు గఱచుచు. 222

క. కలయఁగఁ గరములఁ జరణం,బుల నరమున శోణితంబు పోరనఁ దొరఁగం
దలి రెసఁగిననడమామికి, చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. 223

వ. అంతకు మున్న ధృష్టద్యుమ్నశిఖండివిరాటద్రుపదులు ధర్మనందనున కడ్డపడి
భీష్ముపై నడరి బహుప్రకారవిశిఖంబుల వెగడుపఱచిన నతం డలిగి శిఖండి
సేయ నొల్లక యమ్మువ్వురను మూఁడేసివాఁడితూపుల నేసిన నావీరరథికులు
హుతాగ్నిత్రయంబునుం బోలెఁ బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని నొ
ప్పించిరి వృకోదరుఁ డద్దెసం గవియుటం గనుంగొని కేకయగణంబై సేయుద్రౌపదే
యులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయుం గలమేటిమగ లెల్లను మిన్నేటి
కొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరుదెఱంగులదొరలును బలంబులును
నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడు చుండం జండరశ్మి వినువీథిచక్ర
సగంబునకుం జనుదెంచె నట్టియెడ. 224

తే. రథములను సామజములఁ దురంగములు
నుఱక [1]నెత్రుఁటేఱుల నీఁది తెఱియ నడచి
పోరి రేటును వ్రేటును బోటు నొక్క
యులవిఁ జెలఁగంగ నుభయసైన్యములవారు. 225

వ. అప్పుడు మనబలంబులజనంబులు. 226

క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు, నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ
ర్మతనూజు గెలువ వచ్చునె, మతి లేరై రింక నేటిమాటలు మనకున్. 227

ఆ. అనుచు వగచుపలుకు [2]లాలించుభీష్మాది,యోధవరులతో సుయోధనుండు
చెనఁటిమాట లేమి వినియొద రనిన వా,రదియు నదియు విననియట్లపోలె. 228

వ. పరాక్రమక్రీడలు సలుపు చుండి రాసందడికయ్యంబునం గిమ్మీరమర్దనుండు గద
వండువు సేయు చుండె నప్పుడు. 229

---

1. నెత్తురుటేఱులఁ ♦ దఱియ. 2. లాలించి.

క. సరభసముగ సారథి దన, యురదముఁ దెచ్చుటయును నెక్కి యతివిశిఖశర
స్ఫురణాపరిణతి బాహ్లికు, విరథుం గావించె సురలు వినుతింపంగన్. 230

తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ, పాటమున నొంచె నార్జునిబాణపాత్రు
డతనిసారథిఁ బడ నేసి యంతఁ బోక, తురగములఁ జంపి యాతనిఁ ద్రుళ్ళడంచె.

వ. అక్కుమారుండును దుర్ముఖునిరథం బెక్కెఁ బాంచాలపతి గుంభసంభవుపై నడరి యతనిమేన నానాస్త్రంబులు నించిన. 232

క. ద్రోణుఁడు గోపించి తను, త్రాణం బఱువ్రక్కలు సేసి రూపవ్రన రాజ
ద్బాణంబులు గ్రుచ్చిన సంక్షీణబలుండై యతండు సిగ్గఱి తొలఁగెన్. 233

సీ. తత్తఱి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి, కృష్ణుపై నమ్ములు గీలుకొలుప
నలిగి యన్నరుఁడు వాఁడలంపకోలల బోలి, నడరెం పుటయు వానియఖిలబలముఁ
జేతిసమ్మెటలను జేకుకోలల వ్రేసి, యంకుశంబుల సూటి శిరయుమున
వాహనంబులఁ దోలువారును వింజ్ఞను, బలుకలు వైచుచుఁ బఱచువారు

తే. నైనమిత్తం డ్రిక్కిడిపై నడర నతనిఁ, జొచ్చె సాత్యకి యన్నదీసుతుండు శక్తి
వైవమెయివాల్చియుదివట్ట్రివైచెసుగుడ, నాలఁడా భీష్ముఁ డెడఁదునుకమూడెనధిప.

వ. ఇట్లు ద్రుంచి. 235

క. ఆలోనన మొఱఁ దొమ్మిది, వాలమ్ములు నాటఁ బాండవవ్యూహము సం
డాలరథఘోటసుభట్యా, భీలతఁ దలకడచి పొదివె భీష్ముపనంతన్. 236

—•• దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మునకు సహాయంబుగాఁ బంపుట. ••—

క. కని కౌరవపతి దుశ్శా, సనుతో నిట్లనియెఁ గంటె శాంతనవునిపై
ఘనసేన ద్రోచెఁ జనికై, కొను డీవును సౌబలుఁడు నకుంఠితవృత్తిన్. 237

క. అనవుడు నయ్యిరువురు నే, పునఁ గదియుటఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో, ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్.

వ. ఆపదివేవురు నెఱరావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి యొ
క్కనం బాండవబలంబు మహామత్స్యసమూహాభిహారంబునం గలంగుమడువునుం
బోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును వివిధవిశిఖపరం
పరలు వరగింప ముందటికాళ్లు దునిసిన మొగ్గతిలంబడియును మోరలు వఱియ
లై నెఱి దప్పం గూలియు గుండియ లవిసిన నొగసి కెడసి ను వాగెలు ద్రెవ్వి
న వలియం బాఱియు నాశ్వికులు నేల గొఱగినం జెనఁటి తిరిగియు ననేక
ఘోటకంబులు రూపఱిన నేపఱి యత్తురంగనికరంబు లేటమొగంబువడి చెదరి
కనుకనిం బఱచిన. 239

క. భేరీశంఖాదిరవ, స్ఫారత నప్పాండుపుత్త్రబల మేచుటయుం
గౌరవపతి శల్యునితో, గారవమున నిట్టు లనియెఁ గడు దీనుం డై. 240

క. వెలివిరిసి వచ్చుజలనిధి, పొలుపునఁ దోఁతెంచుధర్మపుత్త్రునిబలుగో

ల్లల నిలువరింప నీ వొక్కరుఁడవె కలిగితయి మమ్ముఁ గాచికొను మిచటన్. 241

ఆ. అనుడు నలిఁగి పాండవాగ్రజుఁ గనుఁగొని, వాఁడె విపులబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదివి మారిమసంగి నట్లు మఱపఁ జూచె నరుఁడు ననిలసుతుఁడు.

క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ, జెక్కుడమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్
గ్రక్కున వచ్చిన యయ్యిరు, దిక్కుల సైన్యములు సత్త్వదీప్తత బెరసెన్. 243

వ. ఇట్లు గలయఁబడి యపరాహ్ణంబున నుభయచతురంగమథనంబగు ప్రధనంబు
సేసె నట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబులగు
కిరణంబులు పరఁగించి. 244

సీ. పండ్రెంటఁబండ్రెంటఁ బాండవాగ్రజుని భీమార్జునులను మాద్రీకొడుకులను మూఁటమూఁట
నేడింట నేడింట నేచి సాత్యకిని ధృష్టద్యుమ్నునొప్పించి సముదవృత్తి
నార్చిన మాత్స్యపాంచాల్యసైకములను నొప్పించి వరూథినులను మగధబలముఁ
గాశిసైన్యంబుఁ గరూశసేనయును నొక్కపెట్ట రయంబున భీష్మమీఁద

తే. నురవడించినఁ బాండవోత్కరము గృష్ణు
తమ్ముఁ బాంచాలనందనుసమ్ముఖమున
కడరని కాఁగి యుండఁ గన్నిరూపు
లై మహారణ మొనరించె నస్త్రగురుఁడు. 245

ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భటశౌర్యసారదు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ జాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథితకంపితపాతితమూర్తిఁ జేసి యు
త్యంతరయంబునం దనరథంబు గతుల్ మెఱయం బ్రదీప్తుఁడై. 246

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణవ్రాతంబుఁ దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబు గాన్. 247

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడి గొని మార్కొన మగలు లేక మదంబునం బొంగి
గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడ మఱియునుం గడంగి దుర్వారంబు
లగుదివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేదిక్కు సూచినం దానయై రథికులను హాస్తి
కులను నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున మ్రోడుపడినయుద్యా
నంబుచందంబున నగుచున్నచోట్లును గాలుబలంబులం గనుపుకొట్టినం గాలు
చేయి తల డొక్క[1] యని యేఱుపాటు లేక వండం దఱిగినయట్లున్న మొదలును
బెక్కుదెఱంగులచప్పుళ్లు నిగుడ రథచయంబునవయవంబులుం గరిహయనిక
రంబులయెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదివినవెదురుటడవి తెఱంగునం దోఁచు

1. యనువేఱుపాటు.

పట్లును దఱచుగోడుగులు విటతాటనంబు సేసినం బెనుగాలిం జిక్కువడినకుసుమితకాశవనంబునుం బోలు చక్కట్లును బహురత్నమయమకుటాదిభూషణవ్రజంబు వివిధవర్ణచామరజాతంబు నఱికి పడ వైచినం బ్రబలోద్ధతలులాయలులితం బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించు ప్రదేశంబులును నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండువడియుఁ గలంగం బాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహుళంబు లగుటం గనుంగొని గోవిందుండు. 247

ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచుచున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము దోఁపఁగఁ జేయక యున్కి యొప్పునే. 248

వ. అనిన వివ్వచ్చుండు విచారడోలాయత్తం బగుచిత్తంబుతోడ నిరుత్సాహుం డై యున్నం జూచి వెన్నుం డతని కిట్లనియె. 249

క. మును మత్స్యనాథునగరం,బున సంజయుతోడ నీవు పొంగుచు బెట్టా
డినమాట లెల్ల మఱచిన, నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా. 250

వ. అనుటయు నర్జునుండు. 251

ఆ. సకలబంధుజనులఁ జంపి కౌరవహీన, మైనరాజ్య[1]మహిమ యేచు బడసి
యనఘ యేమిసుకృత మాచరించినవాఁడ, నగును మనసు గొలువదయ్యె ననికి.

వ. అయిన నీతో [2]నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటికొడుకుం బడ వైచెదం దేరు నడపు మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు సమ్ముఖంబుగా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలినసైన్యంబులు గూడికొని గాంగేయు పయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి సింహనాదంబు సేసి. 253

మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిన్ గాండీవియంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశరవ్యూతాస్యముల్ గాఁగ స
త్వరుఁ డై యేసి రథంబు గూడఁ బొదివెన్ వాలంపమొత్తంబునన్. 254

వ. అప్పుడు. 255

తే. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము
వడినఁ దా నొచ్చియుండియుఁ దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. 256

1. విభవ ♦ మేను. 2. నిప్పటి కేటి.

క. అతఁ డొండొకవిల్లెత్తిన, నతిరయమున నదియుఁ దునుము నాతం డౌరా
శతముఖనందన యనుచును, ధృతి వేఱొకవింట శరతతిం బరఁగించెన్. 257

క. ఆబెట్టిదంపుటంపలు,చే బీభత్సుండు నొచ్చి చేష్టడి మఱియుం
దా బంటుతనము పటుబా,హాబలమును గోరుచుండె నంగము దూలన్. 258

క. విష్వక్సేనుఁ డింతయుఁ, గ్రొవ్వున భీష్ముండు గడఁగుటకొల్తలయుం ద
క్షేపము నాతనిఁ జేయఁగ, దప్పుల నిల్చుటయుఁ జూచి తనచిత్తమునన్. 259

క. దారుణరోషం బెసఁగఁగ, నారాయణుఁ డవుడు సైరణం దొఱఁగి వెసం
దేరినొగలఁ బగ్గము లిడి, క్రూరత [1]మునికోల యెత్తికొని యిల కుఱికెన్. 260

శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిం బోవుట.

వ. ఇట్లు లంఘించి. 261

మ. ధరణీచక్రముఁ గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణికం
ధరముల్ మ్రొగ్గఁబడం దిశావలయము మ్రుక్కంపంబు గా నీబలం
బురలం బాఱఁగ భీష్మపైఁ గవిసె శౌర్యోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంక్రచచ్చాపాహుంఘోరాకృతిన్. 262

తే. లలితపీతాంబరంబువిభ్రాజన మొప్ప
సింహనాదోద్భటం బగుచెలువుతోడ
మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయ వచ్చు
కారుమొగి లనఁ గృష్ణునాకార మొప్పె. 263

వ. అట్టియెడ. 264

క. బలుఁ జీఁపము వోయిన వెల,వెలఁబాఱుచు నీదుయోధవీరులు వాలిసెం
బాలిసె నదె భీష్ముఁ డనుచును, [2]గలఁగంబడి యట్టు లెత్తి కనుఁగొనుచుండన్. 265

చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము దేవ పురుషోత్తమ వికస్వరపుండరీకలో
చన యిది లెస్స నాకిచట శాశ్వత మైనయశంబు నచ్చట
న్వినుతికి నెక్కుసద్గతియు నీవయఁ జేయుఁ జేయు మిష్టమున్. 266

వ. అని పలుకునంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గ నుఱికి వెన్కు వెనుక నెయిది కరంబుల గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని పోఁడియుం బోవం బోవఁ బదియడుగులకొలంది నాకొంతేయుండు పదస్థైర్యంబును బాహువీర్యంబును మెఱయ మహీతలం [3]బూని మెట్టి నిలువం బట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దనుజమర్దనుతో ని ట్లనియె. 267

ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పి తేని జగమే మను నించుక సేపు పోరులన్

1. ములుకోల. 2. గలయం బడి. 3. మూఁది దొట్టి నిలువం.

డయ్యెట దప్పె నాపయిఁ గ్రందంగినభీష్మునిపాటు సూతు రా
వయ్యె రథంబుమీఁది కిటు వ్రాలు శ్రితమానము వీటిఁబుత్తురే. 268

వ. అనిప్రార్థించినం బార్థపలుకులకుం బ్రియం బంది హృషీకేశుండును దూరక మరలె న
య్యిరువురు నెక్కినయరదంబు శిఖరద్వయసుందరం బైనశైలంబునుంబోలెఁ
బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగువారిదంబుకరణి గర్జిల్లుచుఁబటు
నారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడుపఱచి యచ్చట నొండొరుల
మెచ్చక యఱిమి తఱిమిన వైరివీరుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుండై
పరిశ్రాంతు లైనకృష్ణార్జునులును భీతు లగుభీమసేనప్రముఖులును జేయునది లేక
చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరుసప్పుడు బెట్టుమానిసి సలిచీమలం
గాలం జమరుచందంబు దోఁచె నయ్యవసరంబున. 269

క. తాన స్తశిఖరి మఱువడఁ, [1]బోనిచ్చెను పాండురాజపుత్త్రివిరాజ
త్సేన పొడ వడఁగ నసుకృప,నో కలినాప్తుండు గ్రుంకె గ సుర్వీనాథా. 270

వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయంబునం బంకనిర్మగ్న
మైనగోవునుంబోలె నున్ననిజసేనం జూచి కొక్కింతసేపు చింతాక్రాంతుం డై
యప్పటికిం దిగుచుటయ కర్జంబుగాఁదలంచి తగువారలనెల్లందిగియ నియమించి.

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు వగచుచుపార్థాదులు ద
న్నుం గొలిచి చనఁగ విడిదల,కుం గడు విన్ననయి పోయెఁ గురువంశనిధీ. 272

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోహటించి పోయినం దారును దమబలంబులఁ దివియ
నియమించి. 273

చ. ఎలమి నమస్కరించుచు నహీనపరాక్రమభంగు లేర్పడం
బలికి యుదాత్తవాక్యములఁ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్బలసి భవత్తనూజులు మనంబులు నిండి ముదంబు మోములన్
వెలి విరియంగ నేఁగిరి నవీనవిభూతి నివాసభూమికిన్. 274

వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవనాఁటిబవరంబున బెండుపడి యానిశాసమయం
బునందు రహస్యప్రకారంబున. 275

క. మనమున విషాద ముడుగఁగ, ననుజులఁ గూర్చుకొని దానవాంతకుసదనం
బునకుం జని యిట్లను నా,తనితో నాత్మీయకార్యదశ దెలియుటకున్. 276

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ,రార్చుల నవ్వీరుఁ గన్నఁ గలారం గంటే. 277

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుస్సామంబునం జేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను నిర్మూలంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము గొన్నయ ట్లగునె నిశ్చింతంబునం గానసం

1. బోనాడును.

బునకుం బోయెదఁ దమ్ములం గొని తపఃస్వరాజ్యుండ నై యుండెదన్. 278

క. మున్నును నేఁ గారణముగ, నన్నియుఁ జుమ లనుభవించి రనుజులు వీరిం
గ న్నారఁ జూతుఁ గాని జ,గన్నుత భీష్మునకుఁ [1]గోలుస్త్రగా నీఁ జాలన్. 279

వ. నీకు మాఁదెన ననుగ్రహంబు గలదేనిఁ గయ్యంబు దక్కి ధర్మవిరోధంబు గా కుండినట్టియొక్క తెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వన వచనంబుల ననునయించి యతని కి ట్లనియె. 280

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ, వత్యద్భుతబాహువీర్యు లనుజన్ములు దా
ర్గత్యము గల్గునె నీకున,మాత్యుఁడ నై యేను రాజ్యమహిమ నొనర్తున్. 281

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొర కున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నుఁ, మగిడింపక చూచు చుండు మనుజాధీశా. 282

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి, నాకు నతనికి నై యేను నరవరేణ్య
కూర్మిమై నిత్తుఁ గండలు గోసి యైన, నరయు నాతండు నాయెడ నట్టివాఁడ.

వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు నులూకుండు వచ్చి నప్పు డతనిపలుకులం బుట్టినబెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయ వలయు నేను నీరెండెడలం బెక్కు లు వలికినవాఁడ మాకిరువురకు నొండొరువుల పలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 284

క. కయ్యము సేయక తగునా,హయ్యము సేయఁ గలవాఁడ నని పలికితి ని
న్నియ్యెడ నే బొంకింతునె, దయ్యము నా కేల యిట్టిదైన్యము దెచ్చెన్. 285

వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబు గల దమ్మహాత్ముండు గౌరవులకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం బగుకార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా ని ట్లనియె. 286

ఆ. అకట తండ్రి సచ్చినంతనుండియు మము, నరసి ప్రోచినట్టియనుఁగుఁదాతఁ
జంప వేదిఁ దలంచుటెంపు సూచితె రాజ,ధర్మ మింతక్రూరకర్మ మగునె. 287

వ. అనవుడు. 288

తే. విని మురాంతకుఁ డితఁడు శాశ్వతనవుకడకు
నరుగఁ జూచినవాఁ డని యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నేతెంచెదు గాక యనిన
యున్నదీనూనుతొంటివాక్యములు దలఁచి. 289

వ. అజాతశత్రున కి ట్లనియె. 290

ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట.

ఆ. నీతలంపు లెస్స నీవు ము న్ననినట్లు, కాక భీష్ముఁ డలుక గదిరి పోరఁ

1. 'గొలుపుంగా' అని వ్రాఁతప్రతులు.

జక్కఁ జూచె నేని శత్రువుల్ వొలియరె, యిప్డు డతనిపాలి కేఁగు మధిప.
సీ. నీవు ద న్నడిగిన నిజవధోపాయం బు,వశ్యంబుఁ జెప్పు దేవవ్రతుండు
మనము రహస్యవర్తనమున నందఱ,మును జని యమ్మహాత్మునకు భక్తి
నెఱఁగి తెల్లంబుగ హితకార్యగతి విన్నపంబుసైఁ బ్రార్థించి యడిగి యతని
సదయమంత్రోపదేశంబున నెగడుద, మని యిట్లు హరి నిశ్చయంబు సేయ
ఆ. నయ్యజాతశత్రుఁ డనుజులు నతఁడును, దాను సౌమ్యవేషధరణ మొప్ప
నతినిగూఢవృత్తి నాపగాసుతుమందిరమున కరిగి సముచితముగఁ జొచ్చి.
వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవసపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణ
మిల్లిన నతం డత్యాదరంబునఁ బేరువేర వార లందఱ సేమంబు లడిగి యిట్లనియె.
క. ఇచ్చటికి మీర లందఱు, వచ్చినపని యేమి చేసి వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను, జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్. 294
వ. అని తెలివొందిన మొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని
కి ట్లనియె. 295
క. మా కెమ్మెయి సామ్రాజ్యము, నీకులు నెబ్బంగి బహుళసేనోత్పాద
వ్యాకులత రాక తక్కం, జేకొని యత్తెఱఁగు కరుణఁ జెప్పఁగ వలయున్. 296
క. అనవుడు నేఁ బెనఁగఁగ మీ, కనఘా సైన్యజయంబు నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున, నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్. 297
వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుండు. 298
ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేత త్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మివ్విధిన్ గెలువ వచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే. 299
క. అనుటయు ని ట్లను గంగా,తనయుఁడు నీచెప్పినట్ల తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురె చే, ధను వుండఁగ వినుము తద్విధము దేటపడన్.
తే. ఇట్టివానిఁగ నన్ను మీ రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా యిట్టు లడుగ
మీకుఁ బ్రియ మైనకార్యంబు మొయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు గలదె నాకు. 301
వ. ఏనాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబునొందినను నన్నుజయింప సమకూ
రు జోడు పుచ్చినవానిని గైదువుఁ బెట్టినవానిని సిడంబు డించినవానిని నంగనను
నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని భ్రాతృహీనుని నపుత్త్ర
కునిం గని యేటుఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు మఱియు నొక్క
వ్రతంబు పూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చినపురుషత్వంబు

గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నుపాయంబు సెప్పెద ద్రుపదు
నపత్యంబైన శిఖండి యట్టివాఁ డగుట మీ కెఱుంగుదురకాదె విశేషించి ముంద
టిపుట్టువున నంగన యగుట వాని కెదు రేయ కుండుఁడు నర్జునుండు వానిం బుర
స్కరించుకొని వచ్చి యేయ నేయుట మానినయెడ నొప్పించి పడ వైచునది
పదంపడి బంధుమిత్త్రులగు ధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నావను
చేసు బనిచినట్లు చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత నను
జ్ఞాతులై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవు చున్నసమ
యంబున బీభత్సుండు. 302

ఆ. సురనదీసుతుండు పరలోకగతి నిరీక్షించుటకును దాను గృతకవృత్తిఁ
జంప వలయుటకును సవిషాదమానసుం డగుచు నిట్టు లనియె నచ్యుతునకు.

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధర్మరతు వయోవృద్ధు లోకసమాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ, బురుషోత్తమ చంప బుద్ధి పుట్టదు నాకున్. 304

ఆ. [1]నన్నుఁ బాంసుకేలి నున్న నర్మిలి నెత్తి, మేనిధూళి దనదుమేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మాతండ్రిగుణము లగ్గించి కన్నునీరు నించు నతఁడు. 305

ఉ. అక్కట తండ్రి లేనిమము నమ్మెయిఁ బెంచినతాత నిమ్మెయిం
ద్రెక్కొనఁ గాదతండు సముదీర్ణభుజాబలశౌర్యశాలి యై
యిక్కడిసేనఁ జక్కడిచె నేసియుఁ జాతున కాక ధర్మముం
దక్కట కోర్వఁ జాలుదునె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. 306

వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కిట్లనియె. 307

ఉ. క్రూరత కోర్చి యించుకయు రోయక పైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ
గోరరి గొంచు సద్వ్యయము గోరి కొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి వచస్పతి సెప్పుట యుప్రసిద్ధమే. 308

చ. అనిమొన నోర్తు భీష్ము నని యాడినవీదగుపూన్కి లోక మె
ల్లను విని యుండఁగా నిటు చలం బెడలం జన దెట్లు లైనఁ జం
పన తగు రాజధర్మపరిపాలన గా కిది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్. 309

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను నా ద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయువధార్థ మం ద్రదియుఁ దప్ప దతండును వాని నేయఁ డే
ను నతని నేయుచందమున నూల్కొని యన్యుల నేయు చుందు వాఁ
డనితరవధ్యకాయుఁ డగు నాయనఁ దాఁ బడ నేయు నుగ్రతన్. 310

వ. అనవుడు నవ్వికవ్వడికిం గమలనాభుం డిట్లనియె. 311

---

1. నన్ను బాలకేళి నున్నచో నర్మిలి, తొడ నెత్తి మేనిధూళి బెరయఁ,

ఉ. నీ వొకరుండు దక్కఁగ ననింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును ♦ జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్
దైవముచూపుపోలెఁ దుది ♦ దాఁకుడె యీపృథ మిట్టు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యొటులఁ ♦ ద్రోచినఁ బోవదు చూచి యుండుమీ. 312

వ. అని పలికిన విని యతం డట్లు గాక యప్పటికి నెట్లయిన నట్లయ్యెడు నని యర్జునుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజనివాసంబున కనిచి తమతమనికేతనములకుం జని యారాత్రి సుఖనిద్ర సేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 313

క. పాండుసుతు లేమిభంగి శిఖండిం గూర్చుకొని యాపగాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు [1]ప్ర, చండతతో సమరకేళి ♦ సలిపిరి చెపుమా. 314

భీష్మునిదశమదివసయుద్ధానుక్రమము.

వ. అనుటయు నాసూతనందనుం డతని కిట్లను సూర్యోదయసమయంబున పాండునూనులు సేనాసమేతులై వెడలి మోహరించునప్పుడు ముందట శిఖండి నిలిపి యతని కెలంకుల భీమార్జునులును వెనుక నభిమన్యుద్రౌపదేయులును వారియిరువంకలం జేకితానశైనేయులును నటపిఱుంద ధృష్టద్యుమ్నాదిపాంచాలకుమారుల మున్నిడికొని కవల నుభయపార్శ్వంబులం బెట్టికొని యుధిష్ఠిరుండును వీరిమూరెలం బొదివికొని విరాటద్రుపదముఖ్యు లగుపృథ్వీపతులును గేకయపంచకధృష్టకేతులును నిలిచి రిత్తెఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి రంతకుమున్న మనవారును వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల నీకుమారు లమ్మహాత్ముఁ బరివేష్టింపఁ గుంభసంభవతత్సంభవులుం దక్షిణవామభాగంబులను గృపకృతవర్మభగదత్తపురస్సరుండై కురురాజు మధ్యభాగంబునను బృహద్బలకాంభోజముఖ్యులైనమహీపతు లమ్మనుజేంద్రుచుట్టును ద్రిగర్తు లపరభాగంబునను బన్ని బలుమొన యమర్చికొని త్రోచి నడచి రిట్లిరువాఁగునుం గవిసి వివిధతూర్యస్వనంబులు నింగి ముట్ట నొండొంటిం దాఁకిన. 315

క. సమరం బప్పుడు దనుజులు, నమరులునుం బెనఁగుచంద ♦ మై తోఁపఁగ భూ
రమణ విను నేమి సెప్పుదు, జముపురమున నగ్గలంపుఁ ♦ గసందడి యయ్యెన్. 316

వ. అట్టియెడ. 317

మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణమైఁ ♦ గౌరవ్యసైన్యంబు సీ
తుక్కువడం జేయఁగ భీమపార్థులును గో ♦ కో యమ్మంచు నొక్కుమ్మడిం
గవియం బాండవసేన యుబ్బి యసరం ♦ గాఁ జూచి కల్పాంతభై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్. 318

1. ప్రచండసమరకేళి నెట్లు ♦ సలిపిరి.

ఆ. కాలు కాలు పెనఁగి । కాలుబలంబులు, నొడ్డగెడవుగా రథోత్కరంబు
మొగ్గతిలఁగ గుఱ్ఱములు నేల యద్రువ మాతంగఘటలు గూలెఁ బ్రదత్తిణంబ.

క. కనుఁగొని శిఖండి వెన మాఱ్కొని భీష్ముని నేసె మహోగ్రక్రూరాస్త్రములం
గని యతఁడు మరలి చూడక, తని నిర్దేశించి పలికె । వరహాసముతోన్. 320

ఉ. ఎవ్వతనేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగ నా
కవ్వమిఁ జేసి యెట్టినను । నుగ్రతి నేయఁగ నొల్ల నావయిం
గావ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే
నవ్వమఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండిసీ. 321

వ. అనినం గోపించి శిఖండియు నతని కిట్లనియె. 322

క. గెలిచితి రాజుల నెల్లను, బలియుం డగువరశురాముఁ బ్రతిపక్షుఁడ వై
యలవుకలిమి నెఱపితి నీ, చలము బలము నాకుఁ జూపఁ । జాలవు కంటే. 323

క. ఏయు మొకనేర్పుమై ని । ట్లేమిక క్రేశించి యయుగు । మొట్లయినను మ
త్సాయకముల నినుఁ గూల్చెదఁ, జూయెవ్వత నైతి నేమిరసూచెదు నన్నున్.

క. నేఁ డెమ్మయి నైనను నీ, పోఁడిమి సెడఁ దోన తవిలి । పొదువుదు నిన్నున్
వాఁడిమగఁ డనుట యుసుపుము, వేఁడిమిపొంపెనఁగన స్త్రీవిద్య మొఱయుదున్.

వ. అనుచు మఱియు నయిదమ్ము లేసె నప్పలుకులువిని ఫల్గుణుం డాత్మగతంబున
నేఁడు శిఖండి చందంబు వింత యయి యున్నయది నదీనందనుండు సమయుటకు
సమయం బైన దైవదత్తోత్సాహంబున నేఁచి పలికెం గావలయునని యూహించి
యుపోద్బలంబుగా నతని కిట్లనియె. 326

—.. అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్మపైఁ గవియించుట. ..—

ఆ. ఇట్టు లాడి పిదప । నేమియుఁ జేయంగఁ
జాల కున్న మనల । జగము నవ్వ
నేను గలుగ నిన్ను । నెవ్వారి కేమియుఁ
జేయ రాదు భీష్ము । నేయు మదరి. 327

వ. అనియె నప్పుడు గాంగేయుండు దోలంగి పాంచాలబలంబులపైఁ దఱిమినం
దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి
మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ మనసైన్యంబు
దైన్యంబు నొంద నగునే యనవుడు రారాజుతో నతండు. 328

క. మును పదివేవురఁ జంపుదు, నని యిచ్చినబాన పచ్చె । నవనీశ్వర నీ
మనిచినఋణంబు దీర్చితి, విను లా విట మీఁదఁ దఱుఁగువిధ మై తోఁచెన్.

ఆ. నేఁటిభంగి నూడ । నృపవర పాండవు, లొండె నన్ను వారి । నొండె నేను
సమయఁ జేత గలుగు । నమసెదరేయొక, మర్త్యుచేత వారమర్త్యబలులు.

వ. ఐనను నాచేతిబలువు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరంబులం బ్రచండ నరనాథయూథంబులం బొదివికొని పాండవబలంబుం దేఱి చూడ రాక నిర్ధూమ దహనస్వభావుం డైనపితామహుప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలు పఱపం జేయం దొడంగిన వారిం గనుంగొని. 331

ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ,పాండ్య కేకయాదిబలము లొక్క-
మొగిన త్రోవనీదు మొనలకు మారొక్కనుటయు,నవుడు పోరుఘోరమయ్యె నధిప.

వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి. 333

తే. నీవు భీష్మున కలికినఁ బోవ దేను, గలుగ వెఱ పేల యతని పైఁ గ్రమ్మి మొనసి
కొని మదీయబాణంబులఁ గప్పుహోరఁ, బఱపి కూల్చెద నీతని బటురయమున.

వ. అనిన నాతనిపలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యుమ్నుండు. 335

క. మనయోధు లందఱును శాం,తనవుని పైఁ దఱుమఁ డింద్రతనయుఁడు గలుగన్
మన మతనికి శంకింపఁగ, నని లే దని పలికి యార్చె బలువిడి [1]నడరెన్. 336

వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపదవిరాటులును సాత్యకిచేకితానధృష్టకేతుకేకయమాగధులును మఱియునుం జేయంగలరథికులు నొక్కపెట్ట బెట్టడరిన నక్కడ గురుపుత్త్రభూరిశ్రవసులును గృతవర్మకృపకాంభోజపతులును వికర్ణదుర్ముఖవివింశతిచిత్రసేనులును లోనైన యోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందనుపయిం గవియుపాండవసైనికులను నతని కడ్డపడుకౌరవ్యవీరులను జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవసరంబున. 337

క. మొనసి శిఖండిని మున్నిడి,కొని యురవడిఁ దఱుమునరునకును వెస దుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన,వననిధికిని వేలవోలె వసుధాధీశా. 338

వ. ఇట్లు నిలువరించి. 339

క. ఇరువురు కృష్ణుల నాతం,డిరువదిబలునారసముల నేసెం గ్రోధ
స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు, నరనాయక యతనినూఱునారాచములన్.

తే. అతఁడు నొచ్చియు నాటించె నైదుమూఁడు, లింద్రసుతుఫాలమున నాతఁ డేచివిల్లు
దునిమి పెల్లేచుఁ [2]దలఁకక దుస్ససేనుఁ, డన్యధనువున నిరువదేనమ్ము లేసె.

క. ఆతూపులు నఱికి పరి,స్ఫీతం బగునారసంబు పృథుతరవక్షో
న్న్యస్తంబు సేసి విజయుఁడు, నీతనయుని మూర్ఛవుచ్చె నిష్ఠురవృత్తిన్. 342

వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 343

క. సారథి యరదము భీష్ముని, తేరివెనుక [3]అరిగె నంతఁ దెలివొంది ధృతి
స్ఫారుఁ డగునక్కుమారుఁడు, దారగతిన్ మగిడి వచ్చి తాఁకెం గ్రీడిన్. 344

వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగదత్తులును నభిమన్యునితో సుదక్షిణుండును

1. నడచెన్. 2. దరలక ; తెరలక. 3. కరిగె.

విరాటద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుండును నకులుని
తో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుండును భీమసేనుతో భూరిశ్రవసుం
డును జేకితానుతోఁ జిత్రసేనుండును ధర్మనందనుతో నత్రుగురుండును దలపడిన
[1]బెట్టిదం బగుబవరంబయ్యె నం దిరుదెఱంగులయోధులునన్యోన్యధ్వజభంజనంబు
ను బరస్పరతురగహననంబును నిత రేతరసూతనిపాతనంబును మిథఃకోదండఖండ
నంబును జేయుచుండం జటులతరశరసంపాతసంపాదితశంపాజాలకాభీలంబును భీష
ణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసారఘోరంబును నగునపూర్వపర్జన్య
సమయంబు దోఁచె నప్పుడు గయ్యంబుకలరూ పంతయుం గనుంగొనుటకు
మింటిక్రేవ నున్న వెరవుగా [2]దనుపరుసున సవిత్రుండు చక్కనిమింటికిం జనుదెంచె
నట్టియెడ. 345

మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు
త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచుం గాండీవి పెల్లేయుడుం
ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు నిర్లూనాఖిలాంగుండు నై
రటదశ్వం బగుతేరితో నతఁడు సంగ్రామంబునం బాఱెనన్. 346

తే. ఫల్గునుఁడు భీష్మముందటిబలము నెల్లఁ, జటులరథవల్గనుం డయి చంపుచున్నఁ
జూచిద్రోణుండుగుణరవస్ఫురణఘూర్ణ, రోదసీభాగుఁడగుచు మార్కొనఁగడంగి.

—ద్రోణాచార్య అశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.—

వ. అక్కడ నడచినం గౌంతేయాగ్రజుండు తోడన తవిలి సేనాసమేతంబుగా నడ్డ
పడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు. 348

క. అప్పుడు [3]క్రోధమునం గను, నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడ మై
యొప్పినతనయున కిట్లని, చెప్పం దత్కాలగతివిశేషము లెల్లన్. 349

చ. తడఁబడె దివ్యబాణములతంత్రము మంత్రముఁ దప్పెడుం గడు
న్వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు పీ
డ్వడియెడుఁ జెయ్వులంగము గడంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువం బని బుద్ధి జనించెఁ బుత్రకా. 350

వ. అతనిమును మటు తల యెత్తి చూడుము. 351

క. కూలెడుగుఱ్ఱంబులు ధర, వ్రాలెడునేనుఁగులుఁ గెడయుదురథములు నై యా
భీలయుగాంతసముద్భట, కాలపురోభాగరేఖ గానఁగ నయ్యెన్. 352

వ. అదియునుం గాక. 353

తే. అదరి కురుసేనపై గ్రద్ద లాడఁజొచ్చెఁ, బఱచుచున్నవి యుల్క లెక్కడ వినంగ
వచ్చె నతిరూక్షభంగి శివారుతంబు, లావగానందనునకుఁ గీడావహిల్లు. 354

1. బెట్టుబవరం. 2. 'ననుకరణి మధ్యాహ్నం బయ్యె నట్టియెడ' అచ్చుప్రతి. 3. 'క్రోధము గన్నుల, నిప్పులు' అనియె వ్రాఁత ప్రతులు.

వ. యుధిష్ఠిరు మొగంబునం గ్రోధం బగ్గలంబై తోఁచుచున్నయది ద్రౌపదేయనకుల సహదేవసహితుం డయి తఱుమునతని మిగిలి నాకు రా రాదు నీవు దేవవ్రతు పాలికిం బోయి యతనికి దాపట వలపటం బ్రాపై నిలువు మిది ప్రాణంబులు డాఁచునసమయంబు గా దని పలికి పనిచిన నశ్వత్థామ యుద్ధామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 355

క. నరుఁ జేచి శిఖండిఁ [1]బురస్కరించుకొని యపుడు భీష్ము సముఖుంపఁగ న
త్వరుఁ డగుటకుఁ దగ రథత్వరుఁడై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్.

వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబుల బారిసమరం దొడంగిన భగదత్తకృప కృతవర్మశల్యసైంధవచిత్రసేనదుర్మర్షణవిందానువిందవికర్ణులు పదుండ్రునొక్క పెట్ట యతనిం బొదివి నానాస్త్రసంతానంబుల నొప్పించిన నొచ్చియుం జలింపక పోరుసమ్మారుతిం గనుంగొని క్రీడితోడై తఱియ నుఱికి ధనువులతునియలను బాణంబులపఱియలను గేతుచ్ఛత్త్రచామరంబులచెక్కలను భూషణంబుల పొళ్ళను బుడమిం గప్పినం జూచి సుయోధనుండు సుశర్మాదిభూపాలకుల నాలోకించి యాభీమార్జునులం దాఁక నియోగించిన. 357

క. ముందటిపదుండ్రు నానృపు, లందఱునుం గూడి [2]పెనఁగి యయ్యిరువురుచే
తం దూలపోవఁజొచ్చినఁ, గ్రందుగ బలుమొనలు నెల్లఁ గవియం బనిచెన్. 358

వ. ఇవ్విధంబునం బెక్కుమొనలు పయిం బడిన నయ్యిరువురకుం బోరు బరంబగుట యెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖు లగురథికజనంబులు సైన్యోపేతంబుగాఁ దోఁచి యేచిన. 359

క. పాండవబలములయుత్యుద్దండపరాక్రమము సూచి దర్పోద్ధతవే
దండములఁ గనిన కేసరి,చండత భీష్ముండు వొదివె శరనఖరములన్. 360

క. డొల్లెడిసూతులుఁ బెలుచం, ద్రెళ్ళెడుతురగములుఁ గా నత్యతిక్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ, నెల్లెడలం దాన యగుచు నేడ్తెఱఁ బొదివెన్. 361

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మగతంబున.

తే. ఉత్తమక్షత్త్రియుల నెల్ల నుగ్రవృత్తి, నేఁడు పదినాళులేని నానిశితశరచ
యములఁ గూల్చితి వేసరికనట్టు లయ్యె, మేనితోడిపొత్తింకిట మానుటొప్పు.

వ. అని తలంచి తొలంగి బలంబులం బెరల్చికొనుచుం గయ్యంబు సేయుచుండంబునం గౌంతేయాగ్రజుం గదిసి యుల్లన యతనితో ని ట్లనియె. 364

క. జనియించినంతనుండియు, జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచు నుండం
జనియెం గాలము విసివితి, ననఘా యే నింకఁ జాల నాసురవిధికిన్. 365

ఆ. మీరు నాహితంబు గోరుదురేని శిఖండి మున్ను గాఁగఁ గడఁగి యంత
వట్టువారు నొక్కపెట్టకాఁ బైఁ బడి యేయుఁ డింకఁ దడవు సేయవలదు.

---

1. 'బురస్కరుఁడుగఁ గొని' అనియు పెక్కుప్రతులు. 2. పెనఁగ ♦ నయ్యిరువుర.

నవ్వి యావిప్రభుఁ డెకటార్చెఁ § నాగసహాయున్. 205

వ. అట్టియెడఁ గేకయపతులును బాంచాలనాథుండును దపనీయసుజ్ఞాతు లగుసింహసేన వ్యాఘ్రదత్తులుఁ జోనైనయోధు లేకులాచార్యుం బొదివి శౌర్యబాహువీర్యంబులు నెఱపి రందు సింహసేనుండును వ్యాఘ్రదత్తుండును నెట్టన నానాస్త్రంబుల నొప్పించిన నాధనుర్ధరుండు. 206

తే. కన్నులఁగవఁ గెంపు గదురంగ § గౌరవులకుఁ
జిత్త మలరంగ నావ్యాఘ్రదత్తసింహ
సేనమస్తకములు రెండుశాతశరములఁ
గుండలంబులతో నేలఁ § గూల నేసె. 207

క. తక్కటిరథికుల నెల్లను, జక్కఁ బడం జేసి పురుషసింహుండు మదం
బెక్కటియుద్ధస్థిరుఁ బొడవెమ్ము, నక్కుంభసంభవునకుఁ గదిసె § నేడ్తెఱ మెఱయున్.

వ. అయ్యవసరంబున నాసైన్యంబులజనంబులు. 209

క. అదె పట్టువడియె ధర్మజుఁ, డదె యాతం డగు ద్రోణుచేత § నక్కట నేఁడు
న్మదుఁడై సుయోధనుఁడు దం,డ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొనియెలమిన్.

వ. అనుచు సంభ్రమాకులచిత్తు లగుచు నున్నంత. 211

మ. ధరణీభాగము గ్రక్కఁదల నడల రథ్యవ్రాతచంచద్గతి
స్ఫురణం బొప్పఁగ బాణజాలపట. సఘంటంబుం గప్ప నత్యంతని
ష్ఠురసంతర్జనఘోషభీషణమహాటోపంబు [1]దిగ్దంతు లా
తురతం బొందఁగఁ జేయ వచ్చె నపుఁ బార్థుం డగ్గురుం దాఁకినన్. 212

వ. కౌరవయోధవరు లొక్కపెట్ట ఘోరవ్యాజనకు బోనటయై నసైన్యంబుగా నవ్యసాచిం బొదివిన నవ్వీరుండు ఘోరాకారుం డయి గాండీవచండనిస్వనంబు లొండొండ నిగుడ నిశితసాయకపరంపరలు గురిసి కపాలోపలంబును మేదోమాంసపంకంబునుం నస్థిచూర్ణసికతంబును నసృక్శోణితనదీప్రకరంబును బఱపె నంత గభస్తిమంతుండ స్తశైలాంతరితుం డయినఁ బార్థుబాణాంధకారంబునకుఁ దోడు సంధ్యాసమయంబు గవిసినం గురుసైనికులకుఁ దమవార లెవరివార లని నిరూపింప నశక్యం బగుటయు ద్రోణదుర్యోధనులు సమరంబు చాలించి వాహినులఁ దివియించిన నిరంబై ధనంజయుండును జయతూర్యస్వనంబులును బాంచాలకేక యాదిబంధుమిత్రప్రశంసావచనంబులును వీనుల విందుగాఁ దనబలంబుల మరల్చి ధర్మనందనుం గొలిచి చనియె నిత్తెఱంగున రెండుసేనలుఁ దమతమవిడిదలల కరిగి యథోచితవ్యాపారంబుల నుండి నాఁటిరాత్రి సనిన మఱునాఁడు.

క. రేపకడ యుభయబలములు, నేపున నెలమియును నెసకమెసఁగ వెడలి యా
టోపంబున రణసన్నాహోపక్రమలీల మెఱయ § నుజ్జ్వలభంగిన్. 214

1. దిగ్భిత్తు లాతుర.

వ. ఉన్నసమయంబున లజ్జావిషాదంబులు మొగంబునం దోఁప ద్రోణుండు దుర్యో ధనున కి ట్లనియె. 215

చ. నరవర మున్న చెప్పితి రణంబున నర్జునుఁ డొద్ద నున్న నె
వ్వరికిని ధర్మసూనుఁ బొదువంగ నశక్య మొకండు పార్థు ను
ద్ధురుఁ డయి నేల వాపికొని యోర్పుల మెప్పుగఁ బోవఁ జాలిన
న్వెరవునఁ బట్టెదం బరులు వేవురు మార్కొనినం గలంచెదన్. 216

—.. ద్రోణాచార్యుల రెండవనాఁటియుద్ధము. ..—

ఆ. నరుఁడు లేనిచోట ననుఁ గని వెన్నిచ్చి, పాఱకున్నఁ బట్టువడియెఁ గాఁగఁ
దలఁపు ధర్మపుత్త్రు ధరణీశ పాఱుట, గలిగెనేని సంతసంబె మేలు. 217

వ. అనిన విని సుశర్మ దుర్యోధనున కి ట్లనియె. 218

క. అనఘుఁ డెవ్వండు మము నవమానించుచు నునికిఁ జేసి మనుజేశ్వర యో
యనలము సంతతము మా, మానసములఁ బొడువ నతని మార్కొనుకడఁకన్.

వ. తమకించుచుండుదుము నీకు బాస యిచ్చి పెద్దకాలం బయ్యె నేఁడు రణభూమియం దు నర్జునుం డొండె త్రిగర్తు లొండెం గా వలయు నే మతనిఁ బెద్దకయ్యంబు లోనం బాపికొనిపోవుట నీచిత్తంబునకు వచ్చున కాదె యనవుడు నతనితమ్ములు సత్యవ్రతుండును సత్యకర్ముండును సత్యవర్ముండును నిబ్భంగిన పలికిరి వారలవశం బైనరథికవర్గంబు నిత్తెఱంగున నియ్యకొని యుల్లసిల్లె నిమ్మెయిం ద్రిగర్తులు పది వేవురు దొరలు గడంగినం గనితుండికేరళమాళవశిలింధ్రమగధమచ్చిల్లి కాదిదేశా ధీశులును బంధుమిత్రసహితంబుగా నివ్విధంబున వారితోడివా రై పంతంబులు పలికి యుబ్బునం బొంగి రిట్లు ప్రరుసునననగణ్యాతిథికోత్తము లుత్సహించి కృతస్నాను లై యగ్నులం బూజించి తత్సన్నిధి సర్వసాధులు నాకర్ణింప సపదము లిట్లనిరి.

సీ. అర్జునుఁ జంపుదు మతని కోడితి మేని, గోవధంబును వనితావధంబు
బ్రహ్మవధంబును బరదారగమనంబు, బ్రహ్మస్వహరణంబుఁ బరధనాప
హరణంబు గురుజనత్యాగంబు శరణాగ, తారక్షణము నన్యతాభిరతియు
మద్యపానము నర్థిసమానవవైముఖ్య, మను గృహదాహంబు జనుల నెట్టి

ఆ. గతులఁ బుచ్చు నట్టిగతులు వాటిలు నక్క, రీటికోలుతలకు నోట లేక
దుష్కరంబు సేసి తుది గన్నపుణ్యాత్మ, కలితగతుల మేలు గలుగు మాకు.

వ. అని సంశాపంబులు పలికి సంశప్తకు లనేకరథికముఖ్యులు బహుళచతురంగబల పరివృతు లై కురురాజు నంతసిల్ల నుల్లాసంబునం జనిరి గురుండును గరుడవ్యూ హంబు సమకట్టి దానికిఁ జూచు వై తాను నిలిచె దుర్యోధనుండును దమ్ములుం దలయును గృపకృతవర్మలు గన్నులును సింహళాభీరశూరసేన కేకయప్రముఖులు మెడయును బాహ్లీకభూరిశ్రవస్సోమదత్తశలశల్యులువలపలిఱెక్కయు నశ్వత్థామ సుదక్షిణవిందానువిందులుడాపలిఱెక్కయు శకునిపౌండ్రకళింగాంబష్ఠమాగధులు

వెన్నును నానాజనపదసేనాసమన్వితుం డై సూతపుత్త్రుండు పుచ్ఛంబును సైంధవాదివివిధదేశాధీశులు నెడనెడం గలయఁ బెరసి యొడలిపొలుపును బలుపును నై నిలువ నియోగించిన నవ్వ్యూహవరంబు మహాపవనసముద్ధూతసాగరాకారంబై యుత్సాహనృత్యంబు సేయుచందంబునం జూడ నొప్పె నందు మధ్యమప్రదేశంబున భగదత్తుండు గజారూఢుం డై యుదయాచలంబుపైఁ బొలుచుభానుండునుంబోలెఁ దేజరిల్లుచునుండె నంత నక్కడం ద్రిగర్తాదులు పాండవసేనదక్షిణదిక్కునకుం జని సమరంబునకు సవ్యసాచిం దొలంగం బిలుచుటయు నన్నరశార్దూలుం డన్నతో ని ట్లనియె. 222

చ. తఱిమి సుశర్మ దమ్ములును । దానును నాజికి నన్నుఁ బిల్వ నే
నెఱుఁగనియట్టు లుండు టిది । యేపురుషార్థము వారి నెల్ల నే
డ్తెఱి నుఱుమాడఁ బంపుము కడిందిగఁ జూడకు నీకు నేమియుం
గఱిగొఱి గాదు పోమి గడుఁ । గష్టము నాకు సుదాత్తమానసా. 223

వ. అనుటయు నయ్యుధిష్ఠిరుండు. 224

తే. గురునిబలశౌర్యములు నెఱుంగుదుము మనకు
నతనిపూనికి బొంకు సేయంగ వలయు
దీని కెయ్యది కార్యంబు । దాని నీవు
బుద్ధి నుచితంబుగాఁ దలఁపోయు మనుడు. 225

వ. ధనంజయుం డతని కి ట్లనియె. 226

చ. పిలిచినఁ బోవ కుండు టిది । [1]బీదతనం బగుఁ గాన నేర్పుగాఁ
దలఁపదు లోక మే నరివధం బొనరింపఁగ నెల్లుఁ బోయెదం
జలము బలంబు ధైర్యమును । శౌర్యమునుం గలవాఁడు వీఁడు నేఁ
డలఘుఁడు గుంభసంభవుని । నాఁగు భవత్పరిరక్షణార్థియై. 227

వ. అని పాంచాలవరుం డగుసత్యజిత్తుం జూపి. 228

క. ఇతఁ డున్నయంత సేవును, మతి నేమియు వెఱవ వలదు । మార్తురచేతన్
హతుఁ డయ్యెనేని నిలుచుట, చతురత గా దనికిఁ దొలఁగి । చనవలయు నృపా.

—✿ అర్జునుఁడు ధర్మజుచే ననుజ్ఞాతుం డై సంశప్తకులపైఁ బోవుట. ✿—

తే. అనిన నొడఁబడి యట్ల కా । కనుడు నన్న
కేంద్రునకు భక్తి మ్రొక్కి సు । రేంద్రపుత్త్రుఁ
డతనిచేత దీవన గొని । యవ్విరోధు
లున్నదెస కేఁగె సంతోష । ముత్కటముగ. 230

వ. ఇట్లు ధర్మజునియొద్దఁ బాసి విజయుండు ననుటకు నుబ్బినమనసైన్యంబులం గనుంగొని యమ్మహీపతి ధృష్టద్యుమ్నుతోఁ గౌరవులు గరుడవ్యూహంబుగా మోహ

1. బెట_బెంట_బెండు_తనం బగు,

రించినవారు దీనికి నీవుం దగ మండలార్ధవ్యూహంబు సమకట్టుమని పనిచిన నతం డట్లు చేసె నివ్విధంబున నుభయవ్యూహంబులును గాఢసన్నాహంబులై శంఖ భేరీప్రముఖతూర్యస్వనంబులు సెలంగ నడువానకాలంబునం బొంగినగంగా యమునలుం బోలె నొండొంటిం దార్కొనుసమయంబునం దయ్యజాతశత్రుండు ద్రుపదపుత్త్రు నాలోకించి గురుం జూపి. 231

క. నేఁ డీబ్రాహ్మణుచేతం, బోఁడిమి సెడి యేను జిక్కి పోవక యుండన్
వేఁడిమి మొఱయుశరంబుల, వాఁడిమిసొం పెల్లఁ జూప వలయుం జుమ్మీ. 232

క. అనుడు నతఁడు నవ్వుచుఁ ని, ట్లను నే నాఁగంగ ద్రోణుఁ డని నిసుఁ గదియుం
జనువాఁడె యింత యేటికి, నను నీతఁడు గెలువ లేఁడు నమ్ము మధీశా. 233

వ. అనిపలికి పారావతవర్ణాశ్వవర్ణనీయరథుండగు నయ్యతిరథుండు కుంభసంభవునకు సమ్ముఖంబుగా నడచుటయు నాధృష్టద్యుమ్నుదర్శనంబు దనకు నరిష్టంబగుటయు నగ్గురుం డొక్కింత విన్ననై యతనిదిక్కు చేరి చూడం జాలక క్రోధించి పాంచాలబలంబుపై నిశితవిశిఖంబులు వరఁగించుచుం బాయవడ నడరె నంత నక్కడ.

సీ. క్రీడి యాఁకొని యున్న కేసరి హరిణచ, యముమీఁదఁ జనునట్లు లాత్రిగర్త
వరులపై నరుగంగ వారట మున్నర్ధ, చంద్రాకృతిగ నొడ్డు సంఘటించి
కొనియుండి యాతనిఁ గని ప్రీతి నార్పులు, బొబ్బలుఁ జెలఁగంగ బొంగుటయును
జూచుచు నాసవ్యసాచి మందస్మితుఁ, డై కృష్ణుతోడ ని ట్లనియెఁ జూడు

ఆ. [1]మొక్కలైన రవము నెసకంపుటుబ్బునఁ, బొదలుచున్నవారు ప్రమదముకతన
నెవరిఁ దమ్ము నించు కేనియు నెఱుఁగరు, వీరుక్రొవ్వి చావ వేఁడి రకట. 235

వ. అని మఱియును. 236

క. తగు సంతసింపఁ గుజనుల, కగపడనివిశిష్టగతికి నస్మద్దివ్యా
శుగములచేఁ బోఁ గనుటకు, విగతభయత్వంబు సమరవిధి కొప్పఁగదా. 237

వ. అనుచుం జేర నడచి దేవదత్తంబు పూరించిన. 238

ఉ. ఆనినదంబు సాంద్రముగ నాకస మంతయు నిండఁ బర్వఁగా
మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూల విద్విష
త్సేన నితాంతనిశ్చలత చిత్రసమర్పితమూర్తియో యనం
గా నులి వేది యుండియును గ్రమ్మఱఁ దేఱె రవంబు మానఁగాన్ 239

వ. ఇట్లు దెలివొంది యొండొరులం బురికొల్పికొని సంశప్తకు లొక్కపెట్ట ఫల్గును పయిం బటుశరపరంపరలు గురిసి రతండు దవ్వుదవ్వులఁ బదియేనువేలరథంబుల వారిం గూల్చినం దెలుచ నడరి. 240

క. శరము లొకఁ డొకఁడు పదిపది, వరఁగింపఁగ మూఁటమూఁటఁ బార్థుఁడు నొంచెన్
సరి నైదైదేయుఁగ నన్నరుఁ డందఱ రెంట రెంట నలి నొప్పించెన్. 241

1. 'మిప్పు డేమి కతము' అ. ప్ర.

వ. అట్టియెడ సుబాహుండు గ్రీడికిరీటంబు దశవిశిఖంబుల నేయ నతం డతనిపై
ననేకశరంబులు నరంగించిన సుశర్మునకు సురథునకును సుధన్వునకును బాసట
యై యప్పార్థుం దాఁకిన. 242

ఆ. వారి కేతనములు నడిచి ద్రుంచి యమ్మెయి, దాసుధన్వుమాయుశరాసనముల
తునిమి యులవమిగిలి దర్పదోర్గరిమ నిజాస్త్రకంబుఁ దునిమెఁ దేవరథముల కుతికి.

క. ఇరువురు యుద్భటరథపతుల బారిగొనుటయును బెలుబలంబు పురికొనక వెలిం
బెరయుచు గుంపులు గట్టుచుఁ, గురుపతిసైన్యంబుపాలికకుం జనుచుండెన్. 244

వ. ఇట్లు భయభ్రాంతులైన సైనికులం గనుంగొని సుశర్మ యెలుంగెత్తి. 245

క. వెలివడుఁ డిట మఱువకుఁడు మఱు, న్నెలుఁగరె యర్జునునిఁ గుటిలమృగహాపతికడనే
డెలుఁ బలికినపంతంబులు, పలికితిరె నో రెడ్డి చిత్త మరలిన మనకున్. 246

వ. అని యరవసంబు సేసిన నాసైనికులు గోల్తల సేసి రప్పుడు నారాయణగోపాలు
రెక్కడెక్కడ యని వారిం గూడి కడంగిన నిస్సాణాదితూర్యరావంబులు సెలం
గుటయు వాసవి వాసుదేవు నాలోకించి. 247

చ. ఒడలకు బ్రాణములు గెలుగ సూరక యుండుదురే త్రిగర్తులి
ప్పుడు సుఖముండి పోవ మటు వోపగనిమ్ము రథమ్ము నావుకుం
గడు వెస నాథనంజయుని కాంత్రిత మెక్కడ సక్కడెల్ల నె
క్కుడుముద మొప్పఁ దేవ రథికోటులపైఁ బఱపెన్ ముకుందుఁడున్. 248

క. విపులాంబుదములు పూనిన,విమానమో నాఁగ మెఱసె వెలిమావులవే
గమునాంపున నయ్యరదం, బమరేంద్రునిలీలఁ బొలిచె నతనిసుతుండున్. 249

వ. ఇట్లు మండలప్రచారగత ప్రత్యాగతాదివివిధగతులం దేరు సంచరింపం జేయుచు
నిలింపకోటికిం గన్నులపండువు సేయం బుండరీకాక్షుం గనుంగొని నారాయణ
గోపాలురు కుపితాత్ములై యర్జునదుర్యోధనులు ద్వారకానగరంబునకుం బోయిన
నాఁడు కృష్ణుతోడిసరిగా దుర్యోధనుఁడు దమ్ముఁ గోరికొనినవాఁ డగుటం జేసి
యీసునం బేర్చి యన్నరనారాయణులమేనుల నానాస్త్రంబులు నించిన నరుండు
దేవదత్తంబు పూరించి యవష్టంభంబునం ద్వష్ట యిచ్చినమహాస్త్రంబు ప్రయో
గించినం దత్ప్రభావంబున. 250

క. గాండీవిచంద మయి వా, రొండొరులకుఁ దోఁచి రొక్కలు లొకటుల నానా
చండాస్త్రశస్త్రసముదయ,ఖండితులుగఁ జేసి పడిరి కలనం గలయన్. 251

వ. ఇమ్మెయిఁ గృతార్థం బయినదివ్యాస్త్రంబు పదంపడి శాంతం బగుటయు హత
శేషులువోక పొదివి రథరథ్యకపికేతుగరుడకేతుసహితంబుగా సవ్యసాచి నాభీల
శరజాలసంవృతుం జేసిన. 252

క. ఆపార్థుండు గోపానల,దీపితుఁడై విశిఖశిఖలు తీవ్రనిహతి న
త్తాపులగమి నేర్చి జముని,ప్రోపు గుడువఁ బుచ్చె వారిఁ బురువంశనిధీ. 253

కం దఱిమె) నాచార్యుంకును శస్త్రసనాను సైన్యంబులు దలంకఁ దఱిమె నప్పుడు
నీకొడుకు దుర్ముఖుం డతనికిఁ బ్రియంబుగా ధృష్టద్యుమ్నుం దలపడినం గురు
పాంచాలకుమారవర్గంబు లగ్గలికం గవిసి పోరె నట్టియెడ. 268

చ. గురుఁ డనుతీవ్రమారుతముసోఁకి నుల్లల కోర్వక ధర్మపుత్త్రబం
ధురబలవారిదోత్కరము | ధూమ్రుఁడు నాఁగఁ దదల్పి వీరసుం
దరముగఁ జేయి వీచిన నెఱదగ్గఁ గతిం బురికొన్నఁ గౌరవ
స్ఫురణము నుద్భటం బగుచు | సూర్యుని మ్రింగె ధరాపరాగముల్. 269

వ. ఇట్టంగి నుభయసైనికులును గలయఁ జెరసిన మణిభూషణకిరణజాలంబులకతం
బున ధూళికృతంబు లగుతిమిరంబుల గెలిచి పోరు చుండ ధారాళరక్తసిక్తం బై
ధరారజఃపటలం బడంగుటయు. 270

క. ఇరువాఁగును వారొక్కని విస్ఫురణ మెఱయ నాయుధములు ప్రోఁగ లేనిశిఖల్
దరతరము మొగయఁ బోరఁగ, పెఱఁ జతురంగములు నద్భుతంబుగఁ గెడసెన్.

క. కరిఘటలు దురగములపడి, ఖురపంబుల మొత్తమునకు | యడరి వడిం గా
ల్వురు మగ్గఁ జేయుచును మ్రగ్గిరి విస్మయము మొలయఁ జూచు ఖేచరతతికిన్.

ఉ. తేరులయొప్పు మ్రాఁకువడఁ | దేఁకువ లేనిపదాతికోటి నుగ్
గై రుధిరంబులో మునుఁగ | నానిన యేనిక పిండు పక్షముల్
ఘోరము గాఁగఁ ద్రెళ్ళి వెసఁ | గూలుఁ గులాద్రులఁ బోలఁ, నాశ్వికుల్
వీరవినోదముల్ సలుపు | వేడుక సొంపునఁ గూడి యెక్కటిన్. 273

చ. నిలిచినరూపు డొల్లి ధరణిం బడి యున్నశరీర మంత లిం
తలు శకలంబు లై నెఱయ | దండడెమువాఁకి గలంగ నొంటి గుం
పులు వడి పోవ రక్తజలపూరము రొంపులు ధూళి గా రథం
బులు రథసంబునం బఱపి | పోరిరి యోధులు క్రోధదీప్తులై. 274

క. కొమ్ములఁ గ్రుమ్మియుఁ బాదతలమ్ములఁ జమరియును గరములం బఱిపఱి యై
యి మ్మొడలఁగఁ దిగిచియు నరదమ్ముల నేనుఁగులు వీఁటతాటము సేసెన్. 275

క. తురగమున నరుని వ్రేయుచుఁ, గరిదంతము వెఱికి యన్యకరి వై చుచు ను
ద్ధురరథము చదలఁ ద్రిప్పుచుఁ, గరులు వినోదంబు సేసెఁ | గనుఁగొను ప్రజకున్.

వ. ఒక్కొక్కచోట. 277

చ. మెఱుఁగులు గర్జితంబులును | మిక్కిలిసోనయుఁ గల్గు మేఘము
ల్గిఱికొన నొప్పునాకసము లీల రణక్షితి నూఁడ బాల్పగుం
దఱ చగుభూషణద్యుతివితానము పర్వ గజవ్రజంబు పె
ల్లొఱలుచు నెత్తురుల్ దొరఁగు | చుండ నొగిం బడి యున్కి నత్తఱిన్. 278

ఆ. అశ్వసుభటతతులయంగఖండంబులు, రుధిరకర్దమమున | బ్రుంగి యున్న
పెల్లు చూడ రౌద్రబీభత్సకరుణభయానకైకహేతు | వయ్యె నధిప. 279

వ. అట్టిసమయంబున నారోహకులు వసివం దెరలం జాఱువారణహయంబులును వాహనంబులు నిహతంబు లయిన నెసవెళ్ల మెలంగువివిధయోధులును రుధిర మాంసమస్తిష్కమయమహాపంకంబునం గలయం మునింగిచరణంబు గాళులు వెలుక రా కుండియు గొరిజ దిగంబడియును రథకరిఘోటకంబులు సంచరింప నేర కునికి వెఱంగుపడుచుం బెనంగుకడిందిమగలును రక్తాంబుతరంగావర్తకరిగిరికలితంబైన సమరాంగణసాగరంబు నానావిధవాహనయానపాత్రగతులం దఱియం జొచ్చి తమయట్టివారు గొందఱు మునింగినను జెండియు విజయధనవాంఛం జేసి వెలివక వర్తించువీరవ్యవహారులు నయి మొయ్యాది నూచిన కొత్తుటం గెం పెక్క సైనికు లుక్కనం బొంపిరివోవు చున్నసంకులసంగ్రామంబునం జెక్క సెమర్పక దర్పం బునం జెలంగుచు ద్రోణుం డెలుంగు నూపి కడంగి. 280

క. కరియూథనాథుం బోనుపం, ద్వరితోద్ధతియానమున్నిశాతరం బై కే సరి సనిమొనపగిది యుద్ధి,ప్పిరు డెసకుం జనియె నతనిసేన దలంకన్. 281

క. అతికోలాహలవికల,స్థితి యగుతనబలము బిగిలి ధీరత్వమహో న్నతుం డగునతండు విశిఖ,ప్రతతి వఱపె నసుశిఖి సక్రాతుబు వొగడన్. 282

—•• ద్రోణాచార్యునిచేత సత్యజిత్తు సచ్చుట. ••—

చ. కని ద్రుపదాన్వయోత్తముం డకంపితశౌర్యుం డు సత్యవిక్రముం డనుపమధైర్యధుర్యుండు మహాబలదీప్తుండు సత్యజిత్తు ద్రో ణుని వెసం దాఁకి తత్తనువు నొవ్వ శరోగ్రశరంబు లేసి సూ తునిమెయి గ్రుచ్చెం బేర్చి పదితూపులు ధర్మజుం డుల్లసిల్లగన్. 283

ఆ. గురుండు సత్యజిత్తుకోదండదండంబు, దునుముటయును వేఱుధనువు పుచ్చి కొని యుదాత్తరేఖం గ్రూరభల్లంబులు, మున్నుడింట నతనిం గప్పె నతండు

వ. తదవసరంబున సత్యజిత్తుం గూఁకొని. 285

క. వృకుం డనుపాంచాలకుమా,రకుం డఱువదితూపులం గరం బరుదుగ న స్త్రకళాచార్యుం బొదివిన, వికాసమునం బొండెం జాండవేయుబలంబుల్. 286

చ. ఘనతరకోపవేగమునం గన్నుల నిప్పులు రాల సత్యజి త్తనువు వృకాంగముం విశిఖధారల ముంచె గురుండు వార లా తనివడి కోర్చి మై గలయం దాఁకంగ సారథియు బ్బడంగ వా హనములు బిఱువోవ సిడ ముల్లల నాడంగ నేసి యుద్ధతిన్. 287

ఆ. సత్యజిత్తుమేన సాయకదశకంబు, నాటి కుంభజుండు నగుచు విల్లు దునుమ నొండువింటద్రోణునినొప్పించె, నతండు వృకుండు బెలుచనడరియేసె.

క. కవిసి వెసం సత్యజితుని,ధనువు నఱకి గురుండు వృకునితల దునియంగ నా తనిహయములు సారథియును, మును డొల్లంగ నాఱుబాణములు బి ట్టేసెన్.

ఆ. అన్యచాపహస్తుండై సత్యజిత్తు సం,రంభజృంభణమునం గుంభజన్ముం

దలరఁ జేయుటయు నతండు గొంపోరెను, నానకంబుతోడ నవుడు గఱచి. 290

ఉ. ఖండము లై పడం ధనువు గ్రక్కున నేయుచు సత్యజిత్తు వి
ల్లొండు గొనం గొనం దునియ నుద్ధతి నేయుచుఁ జెక్కువిండు లు
ద్దండత నుగ్గు సేసి భుజదర్పధురంధరుఁ [1]డీతఁ డింత ద
క్కుం డని యుద్ధచండ్ర విశిఖ ప్రహతిం దల డొల్ల నేసినన్. 291

క. సాహంకారుం డగుగుసు, బాహుబలంబునకు నులికి పాఱఁ దొలంగెన్
[2]వాహములఁ దోలుకొని యు, త్సాహంబుఁ జలంబు నెడల ధర్మజుఁ డధిపా.

— ద్రోణాచార్యునిచేత సూర్యదత్తుఁడు సచ్చుట. —

సీ. ఆతని వెనుకొన నాచార్యునకు నడ్డ, పడి వాదిమొన లెల్లఁ గడఁక నొక్క
పెట్ట ద్రోచిన దూసితెట్టువైఁ బ్రాఁకు, నగ్గిచందంబున నుగ్గుఁ జేయు
నగ్గురుఁ దాఁకె మాత్స్యానుజుఁ డాయుధా, వుల నొంచి యార్చినయలిగి యతని
తల కుండలములతో నిలఁ బడ నతఁ జేసె, ధరణినాయక సూర్యదత్తుఁ డిట్లు

ఆ. వడిసఁ జూచి మత్స్యబలకోటి విచ్చినఁ, జేదిమగధకేకయాదిసేన
లెల్లఁ జెదరఁ దలరఁ దల్లడపడఁ గల, గుండుగొనగఁ జేసెఁ గుంభజుండు. 293

క. మెఱుమ ధనుర్దండము గుణ, ముఱుముఁగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁదఱచై
పఱవ రుధిరంపుఁగాలువ, లఱిముఱి ఘనభుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా.

క. వీరాస్థిశర్కరాఘన, భేరీమండూక కవచపృథులోర్మిరథ
స్ఫారావర్తగజమకర, ఘోరమహిమ రక్తనదులకుం దగియె నృపా. 295

వ. ఇవ్విధంబునం బాండవాగ్రజుం బట్టికొన నప్పళించి తఱుముచున్న మహావీరు మా
ర్కొని యుధామన్యుండును నుత్తమౌజుండును వసుదానుండును శిఖండియు నై
దైదుశరంబులు దేసిరి సాత్యకియు త్రిధర్ముఁడు వరుసన నూటయిరువదింటఁ బందింటం
గప్పి రయ్యుధిష్ఠిరుండును మరలి బాణశతత్రయప్రయోగతీవ్రుం డగుధృష్టద్యుమ్న
చేకితానులమును న్నిషిక్కొని పొంగి తానును బాడ్రెంట నొప్పించె నప్పు డాభార
ద్వాజుని ముఱియునం బలువురు పాండవపక్షయోధవీరులు వోదివినం గని నీ
మన్నించురాజులు రాజకుమారులు నతనికి బాసట యై కవిసి రతండు వసుదాను
వసుధం గూల్చి క్షేమ జమకడ కనిచి యుధామన్యుని నుత్తమౌజుని శిఖండిని
సాత్యకిని జెక్కుటమ్ముల దెమ్ములం గీలించి తన్నుం గదిసినం గని యయ్యజాత
శత్రుండు వెండియుఁ గైతవంబున రణంబునకుం దొలంగం బాఱిన. 296

క. గురు దృఢసేనుఁడు దాఁకిన, హరిసారథి కేతురథశరాసనశకలో
త్కరములతోడ నతండును, దొరఁగించెఁ దదీయతనువ్రదునియలు ధరణిన్.

వ. ఇత్తెఱంగునం దునిమి తఱుమునతనిదోర్విలాసంబు దుస్సహం బగుటయుం
బాండవబలంబులు దెరలినం గురుసైనికులు నలుగడలకు నెగచి రట్లు విజృం

1. డింతతోడ. 2. వాహనములఁ దోల్కొని.

భించినకుంభసంభవు నెదుర్కొని వార్ధక్షేమియుఁ జిత్రసేనుండును సేనాబిందుం
డును సువర్చసుండును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును శిఖండియు సాత్యకి
యును సుమిత్రుండును సాయక జాలంబులు నిగిడించిన. 298

తే. అందఱకు నన్నిరూపు లై § యతఁడు వోరి
యాసుమిత్రునిఁ గూల్చిన § నతనిఁ గేక
యులును మాత్స్యపాంచాలురు § నొక్కపెట్ట
కవిసి విరిసిరి తచ్ఛరా § ఘాతభీతి. 299

వ. ధృష్టద్యుమ్నసాత్యకిసేనాబిందుప్రముఖరథివరులును వస ఘటి యుండి రనిన
విని ధృతరాష్ట్రుం డచ్చెరువడి యిట్లు వేర్చినయాచార్యుశౌర్యభుజవీర్యంబులు
సైరింప నక్కడ నెవ్వరు లేరైరి గదే యనుటయు సంజయుం డది సెప్పెదనా
కర్ణింపు మని యిట్లను నట్లు గలంగినకౌంతేయసేనం గనుంగొని కలకలనవ్వుచుఁ
గురువిభుండు గర్ణునితో ని ట్లనియె. 300

క. పెనుగాలిని వెసఁ గూలిన,వనముక్రియం బడినపాండవబలముఁ గంటే
వినుము యింక నెన్నఁడును మొగ,కొన కీద్రోణుడిచనువారు§గురుకోల్తలకున్. 301

చ. పవనతనూజుఁ గంటె నిజ§పార్శ్వములం దనవారు లేక కౌ
రవులు మహోగ్రభంగి నడ§రం గడు దైన్యముఁ బొంది యున్నవాఁ
డవిరళదివ్యమార్గణదు§రాసదు ద్రోణునిఁ జూచి నీఁడు రా
జ్యవిభవకాంక్ష యొల్లఁ దెగ§టాఱఁగఁ బాఱెను నట్లు సూచుమీ. 302

వ. అనిన విని కర్ణుం డతని కి ట్లనియె. 303

ఉ. భీముఁడు నట్టివాఁడె యరి§భీషణవిక్రముఁ డస్మదీయసం
గ్రామజయంబు ప్రాణములు § గల్గఁగ సైఁచునె పాండవేయు లు
ద్దామబలాఢ్యు లాహవము § దక్కుదురే యది గాక వారు నీ
చేతను పడ్డపాట్లు దమ§చిత్తములన్ మఱవంగ నేర్తురే. 304

చ. వినుము తదీయయోధులును § వీరగుణాఢ్యులు భీము డున్నఁగాఁ
గొని గురుఁ దాఁక కుండుదురె § కూడుద మీతఁడు నొవ్వ కుండఁగా
మనమును నీతనిన్ బలస§మగ్రులమై యటు గాక యోడి రం
చునికి ప్రమాద మేను మొగ§మోడక చెప్పితిఁ గౌరవేశ్వరా. 305

వ. అని పలుకునంతకుం గూడుకొని. 306

సీ. హంసగౌరము లగు§హయములు నమృతాంశు, కేతువు మెఱయ న§జాతరిపుఁడు
రురునిభాశ్వంబులు § హరికేతనంబును, బ్రస్ఫురితములుగఁ § బవనసుతుఁడు
శుక వర్ణహరులు ప్రశస్తశరభధ్వజం,బును నొప్ప సహదేవ§పూర్వజుండు
నంబుదచ్ఛాయర§థ్యములు హంసాలవ,తాకయు శోభిల్ల § దదనుజుండుఁ

తే. కడఁగి తమతమసిడములు గ్రాల ద్రుపద
మాత్స్యసాత్యకిముఖయోధమండలములు
దారుణాటోపవిక్రమోత్సాహలీలఁ
దోడు నడవంగ నడరిరి ద్రోణుమీఁద. 307

వ. ఇట్లు పాండవబలంబులు జలధరంబులు శైలంబు గప్పుకరణిఁ గుంభసంభవుం బొదివిన దృష్టపథం బవరుద్ధం బగుటయు నతండు దెగియె నసుదిగులు మన వారికిం బుట్టు నట్టియెడ నీకొడుకు గడంగి సేనలకుం జేయివీచి యందు ముంగలి యై నడచు వడముడిం దాఁకినందమకించి సాత్యకిని గృతవర్మయు క్షత్త్రధర్మని సైంధవుండును యుయుత్సుని సుబాహుండును నకులుని దుశ్శాసనుండును సహదేవునిఁ జిత్రవర్మ్ముండును ధర్మనందను శల్యుండును ద్రుపదుని బాహ్లికుండును విరాటుని విందానువిందులును శ్రుతకీర్తిని వివింశతియు శ్రుతసేనుని సాల్వుండును శ్రుతసోమునిఁ జిత్రసేనుండును శతానీకుని శ్రుతశర్మయుఁ బ్రతివింధ్యుని నశ్వత్థామయు సౌభద్రుని లక్ష్మణుండును శిఖండిని వికర్ణుండును గుంతిభోజుని దుర్మ్ముఖుండును గేకయపంచకంబును గర్ణుండును గాశీశ్వరుని జయుండును బాంచాల్యుని జయత్సేనుండును ధృష్టద్యుమ్న పుత్త్రుల బృహద్ధనుర్జయమిత్త్రులును వార్ధక్షేమిని గృపాచార్యుండును మణిమంతుని భూరిశ్రవుండును ఘటోత్కచుని నలంబుసుండును దలపడి రెన్నం గొలఁది గాదు గాని మఱియు ననేకు లనేకుల మార్కొని రబ్బంగి భారద్వాజునిం బరిమార్పను గావను బూని యక్కడియిక్కడి వీరు లుక్కు మిగిలి యొండొరుల కేతనంబులు గూల్చియు ఘోటకంబులప్రాణంబులఁ బీల్చియు సారథుల రూపుమాపియు నరదంబులు పఱియలువాపియు నాతపత్త్ర చామరంబుల బడలువఱిచియుఁ జాపంబులు విఱిచియుఁ గత్తళంబులతునియలు ధరఁ దొరలించియు నెత్తురు దొరలించియు నిత్తెఱంగున ఘోరసంగ్రామంబు సేయుచుండ మధ్యాహ్నం బయ్యె నప్పుడు దన్నుం గవిసినధృష్టద్యుమ్ను నమ్ముల నవలీలం గుదియించి యగ్గురుండు వెండియుం గొందఱం జిక్కుపఱిచె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 308

క. వీరిచట నివ్విధంబునఁ, బోరఁగ నర్జునునితోడఁ బోర పెనఁగున
వీరులు నంశప్తకు లెటు, లైరొకొ యాతనిపరాక్రమాతిశయమునన్. 309

చ. అనవుడు నాతఁ డిట్టు లను నవ్విభుతో నది వెండి చెప్పెదన్
వినుము నరేంద్ర యట్టియెడ వీరరణస్ఫురణంబునన్ భవ
త్తనయుఁడు గంధసింధురవితానము పై నడరించి భీమసే
నునిఁ గినియించె నాతఁడు గనుంగవ నిప్పులు రాలుచుండఁగన్. 310

1. యిక్కడక్కడివీరు. 2. దొరఁగించియు.

క. శరజాలమహావాత,స్ఫురణంబున నుగ్ర దంతి । ఘోరఘటాబం
ధురవారివాహపటలము, విరియించుచు బెట్టు గవిసి । విభు నొప్పించెన్. 311

వ. అట్లు కురురాజు నొచ్చిన నడ్డంబు సొచ్చి 312

శా. వంగాధీశ్వరుఁ డేనుఁగుం గొలిపి గర్వస్ఫూర్తిఁ [1]దివ్యాస్త్రవి
ద్ధాంగుం జేసె మరుత్తనూజు నతఁ డుద్యత్క్రోధుఁ డై వానిమా
తంగంబుం బడ నేసి వాఁ డొరగుచోఁ దన్మస్తకం బుర్వి డొ
ల్లం గేళీవిధ మొప్ప నేయు బల మెల్లం బెల్లగిల్లెన్ వడిన్ 313

వ. ఆసమయంబున. 314

భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱప పాండవసైన్యంబులం గలంచుట.

క. దానవజయ మింద్రున కె,ద్దానివలనఁ గలిగె మున్ను । దానుగ్రము న
య్యేనుఁగు భగదత్తుఁడు పవ,మానతనయుదెసకుఁ గొలిపి । మన మెలరారన్.

వ. ఇట్లు మనసైన్యంబు దైన్యంబు వాయం గొలుపుటయు నగ్గజంబు. 316

సీ. కినుక మైనిగిడిన । కనుఁగవ మెఱుఁగుల, [2]గములు ముందటఁ గెంపు । గడలుకొలుపఁ
జెవులు మ్రొగ్గించి పూఁ । చినరౌద్రతర రేఖ, వినువీధిఁ జూపఱ । వెఱఁగుఁ బెనుప
గంతునఁ జాఁగిన । తొండంబు లయసము,వత్రిదండములీలఁ । బట్టువఱుపఁ
గడుబెట్టిదపుటుర । వడిఁ బదన్యాస మి,లాస్థలి గ్రక్కదలంగఁ జేయ

ఆ. ననిలపుత్త్రుదెసకు । నడరినఁ గని ధర్మ,తనయుసేనజనులు । దల్లడిల్లి
చంపెఁ జంపె భీము । సామజం బనియెడు,నులివు గలయఁ జెలఁగఁ । గలఁగి రథిప.

వ. తదవసరంబున యుధిష్ఠిరుండు. 318

క. అలుకొందుమనముతోఁ దన,బలముం బురికొలిపి పొదివి । భగదత్తుని న
మ్ముల్లఁ గప్పె నతఁడు వానిన్, విలసిల్లుమహాంకుశమున । విరియఁ జడియుచున్.

క. గజముఁ గొలిపి యాదిక్కున, గజఘోటకభటనికాయ । కాయములు రథ
వ్రజములుఁ బొడిపొడి గాన,క్కజముగ విహరించె బాహు । గర్వస్ఫూర్తిన్. 320

వ. అప్పు డాలోకించి. 321

చ. అలిగి దశార్ణభూరమణుఁ । డాతనిఁ దాఁకినఁ జూడ నొప్పె త
క్కలు గలపర్వతద్వయము । కై వడి వారలదంతియుగ్మమి
ట్టల మగువీఁకఁ దత్కరిఁ బ్రడం బొడిచెన్ వడి సుప్రతీక ము
త్తలపడువానిఁ జంపె భగ । దత్తుఁడు దోమరసప్తకంబునన్. 322

ఆ. చంపి విక్రమంబు । సొంపారఁ బాండవ,బలము బడలువడఁగ । భద్రదంతిఁ
జటులగతులఁ బఱప । సాత్యకి యడ్డంబు, నడచి యేసె దొడ్డ । నారసమున. 323

చ. కరిపతి జిఘ్నసం దిరిగి । క్రమ్మఱ నూల్కొని వృష్ణివీరును
ద్ధురరథ ముద్ధతిం బెనఁచి । తొండమునన్ వెస నెత్తి వీచి వై

1. దివ్యాస్త్ర. 2. గములముందటఁ గెంపు ♦ గడలుకొనఁగ.

నె రయమునఁ జలం డిలకుఁ జిత్రముగా నెడ దాఁటి పోయెఁ జె
చ్చెర గజ మొంటఁ జుమ్మి, గవిసి చిందఱవందఱ సేసె మూఁకలన్. 324

క. సారథి తురంగములు మోఁ, పారంగాఁ బూన్చి తెచ్చి యనికల మగునా
తే రల్లఁ జేర సాత్యకి, బీరము వొలివోవ కుండఁ బ్రియమున నెక్కెన్. 325

ఉ. భీముఁ డుదగ్రతం గవియఁ బెల్లగునాకరిచేతిశీకర
స్తోమమునం దురంగములు దోఁగి కడున్ వెగ డొంది యీడ్చి సం
గ్రామవినోదలీలకు వికారము గాఁగ రథంబు వప్పుడు
ద్దామపరాక్రమస్ఫురణఁ దాఁకి సువర్ణముఁ బచ్చె హస్తిచేన్. 326

వ. అతనిపటుట గనుంగొని సౌభద్రుండును ద్రౌపదేయపంచకంబును జేకితానుం డును ధృష్టకేతుండును యుయుత్సుండును గడంగి సామజంబుపై శరవర్షంబులు గురిసిన నది కోపించి యురవడించి. 327

క. పదముల రథవాహంబులఁ, జదుపుచుఁ బైకొని యుయుత్సుసారథిఁ జంపన్
బెదరక యభిమన్యుని తే, రొదవిన నది యెక్కి యాతఁ డుద్ధతి నేసెన్. 328

క. నరతనయప్రముఖరథికవరులు విభముమీఁద నేయువాలమ్ములు ని
ష్ఠురగతి శరదభ్రముపైఁ, బరఁగుతరణికిరణచయముపగిదిం బొలిచెన్. 329

క. రభసంబునఁ బ్రాగ్జ్యోతిషవిభుఁడు గరిం గొలుపుటయును వెస నది యరివీ
రభయంకరముగ వారల, ప్రభ సెడ నరదములు వైచెఁ బలుదెసలఁ బడన్.

ఆ. ఇట్లు భీమసేనునెడ నర్జునసుత, ప్రముఖులైనయలఘురథికవరుల
జృంభణంబుఁ జెడినఁ జేష్టడి చెడి పాఱఁ, జొచ్చెఁ బాండురాజసుతులసేన.

క. నలి భగదత్తుఁడు గదుపుల, వెలుచు పసులవానియట్ల విలసద్గతి న
బ్బలము సెగవ ధూళియు నాకులసంరావంబు గగనకుహరము నిండెన్. 332

క. అని చెప్పి సంజయుఁడు కురు, జననాయక యపుడు సవ్యసాచిరణముది
క్కునఁ జిత్తం బిడి యడిగితి, విను మయ్యర్థవరు తెఱఁగు విస్పష్టముగాన్.

వ. అనవుడు నాంబికేయుం డాకర్ణనవాంఛ మిగులఁ నది సెప్పు మనుటయు నాతనికి నాసూతనందనుం డిట్లనియె. 334

—అర్జునుఁడు భగదత్తుని దెస రథంబు దోలు మని కృష్ణునితోఁ జెప్పుట.—

క. అంతకు మును భగదత్తుని, దంతియసమసమరకేళిఁ దాఁ గని హరితోఁ
గుంతీసుతుఁ డిట్లను మన, మెంతయు వెస బలములోని కేఁగఁగ వలయున్.

వ. అది యెట్లంటేని. 336

చ. బిరుదు జితశ్రమంబు బలభేదనశాలి మహాస్త్రశస్త్రపా
తరయము సైఁప నోపు భగదత్తుని యేనుఁగు దానికోర్తలం
[1]దిరుగక పోర నెవ్వరికిఁ దీఱదు నీవును నేను లేనిచో

1. దిరముగఁ బోర.

భర మగు నేఁడు రాజునకుఁ । బాపవికిం దలఁ గొండెడఁగ మదిన్. 337

ఆ. అనిన నట్ల కాక । యని శౌరి యరదంబు, ద్రిప్పి యాత్మసేనదిక్కు వోవ
నిచ్చటయును వెనుక । రయిపి సంశప్తకు, లార్చి పేర్చి పఱిపి । రత్త్రసనితి.

వ. ఇట్లు చతుర్దశసహస్రరథికముఖ్యులు బెట్టు ముట్టిన. 339

క. బలముల గాపఁగఁ జనుటయు, నలుక మెఱయ మగిడి వీరనడఁగించుటయున్
వలయుపనులయుం దిప్పుడు, దలకొని యెద్దానిఁ జేయఁ । దగవో నాకున్. 340

వ. అని వితర్కించి వివ్వచ్చుండు సంశప్తకవధంబ యుచితంబుగా నిశ్చయించి మరలి గాండీవగుణాక్వాణమిదురకోదసీకుహరుండును దేవదత్తధ్వానవిదళితదశదిశానందోహుండును నై దివ్యబాణంబులు పరఁగించినం గేతుఛాతపత్రచామరవ్యజనంబులును భేరీశంఖకాహళమృదంగంబులును యుగాక్షరథాంగకూబరంబులును దంతశుండాకుంభవంశదండంబులును ఖురస్కంధవాలంబులును ధనుశ్శరముసలముద్గరక్షురికాంకుశంబులును దనుత్రాణకంకటమస్తకచ్ఛదంబులును మకుటకేయూరహారకంకణాంగుళీయకంబులును శిరఃకరవక్షఃకుక్షికటిచరణంబులును దునియలుం బఱియలుం దుముళ్ళుం బోళ్ళు నై వాలిన నన్నేల ఘోరంబును నభిరామంబు నై యుండె నన్నిపాతంబులును బీభత్సుం బ్రశంసించెఁ గంసారి విస్మయప్రమదమగ్నమానసుం డయి కిరీటిం గరతలంబున నప్పళించి యుగ్గించె నివ్విధంబున నన్నిరథికులం బిలుకుమార్చి పేర్చి రథాంగపాణిం జూచి రథంబింక రయంబున నక్కడకు నడపు మనుటయు. 341

ఆ. ఆతఁ డట్ల చేయ । నరవాయి గొనక సు,శర్మ దాను ననుజచయముఁ బిలుచ
నెయిది పార్థ పార్థ । యిట్లువోఁ దగునె యే, మనికిఁ బిలువఁ బిలువ ననిన నతఁడు.

క. పిలిచిన మఱలమి దగ దబ్బలములఁ గాచుటయు వలయుపని యైనది నీ
వలసినవిధంబు సేసెదఁ, దలకొను మొక తెఱఁగు దైత్యగర్వధ్వంసీ. 343

చ. అనుచు మురారిఁ జూచుటయు । నాతఁడు దేరు మరల్ప మోమునం
గినుక మునుంగున వ్వాలయఁ । గ్రీడి త్రిగర్తునిచాపదండకే
తనములు ద్రుంచి హైపడనశ్వముల నంతకుప్రోలి కన్చి యా
తని నవలీల నొంచిన నతండు వెసం బడి మూర్ఛ వోవుఁడున్. 344

వ. మగిడి యట నిరూపించి నారాయణు నుద్దేశించి. 345

సీ. పాఱెడు మనసేన । పఱఁగెడుఁ బెండూళి, నభము గోలాహలక్షుభిత మయ్యె
భగదత్తుశుండాల । మొగచుచు నున్నది, పఱువుము వెస వానిపై రథంబు
నావుడు నతఁడు హయవేగమున రథ్యములఁ దోలఁగఁ గిరీటి । యలవుఁ జలము
మెఱయంగ నీమొనకు మెఱుఁగువాలమ్ముల, నఱుము సేయుచు సింహనాదమునకుఁ

తే. బ్రాపులై దేవదత్తంబురవము గుణము, రావమును దిక్తటంబులఁ బ్రయ్యఁజేయ
వచ్చి వివ్వచ్చుఁ డడ్డంబునచ్చె వీఁకఁ, జండచేష్టితోద్దండవేదండమునకు. 346

వ. అని దూఱినం గృష్ణుండు దొల్లి భూమిదేవి గామించి యోగనిద్రావసానమునం బ్రబుద్ధుం డై యున్నవిష్ణుకడకుం జనుటయు నతండు తత్సంగతిం బ్రీతుం డై యున్నాతికి వరం బిచ్చుటయు నవ్వరంబున నవ్వెలందియం దుదయించిననరకునకు వైష్ణవాస్త్రంబు విధేయం బగుటయు నది భగదత్తాయత్తం బై యునికియుం దద్ఘోరసాధనంబు దనకుం దక్క నొరులకు నోర్వరామియు నెఱింగించి యిది యట్లు గాక దీన నేమి యని మఱియుం దగుమాటలం గిరీటి ననునయించి విరోధిం జూపి వీఁ డిప్పరమసాధనంబు వృథ యగుటం జేసి వెఱఁగుపడి యున్నవాఁడు వీనితండ్రిని నేను దెగఁ జూచిన ట్లీక్రూరకర్ముని బిలుకుమార్పు మనినఁ గొండొక తేఱి యాతండు గాండీవగుణంబు సారించి దృఢముష్టి సేయుటయు.

—భగదత్తుండు సుప్రతీకంబుతోడ నర్జునుచేఁ జచ్చుట.—

ఉ. వాలికదోడ్డనారసము ♦ వజ్రము శైలము దాఁకునాకృతిన్
ఫాలముమీఁదఁ దాఁకిన సి♦భంబు వెసం బడి కొమ్ము లూఁతగా
వ్రాలుచు నర్ధచంద్రరుచిరప్రదరంబునఁ ద్రుంచె బాణవి
ద్యాలసితుండు గ్రీడి భగ♦దత్తునికంఠ ముకుందతోద్ధతిన్. 358

వ. ఇట్లు దంతిని భగదత్తునిం బరిమార్చి మాఱు లేక మలయుమధ్యమపాండవునిం గనుంగొని శకునితమ్ములు వృషకుండును నచలుండును దాఁకిన నతండు వృషకుని రథరథ్యసూతధ్వజచ్ఛత్రచామరంబులు రూపఱ నఱకుటయు నాతండు సోదరు నరదం బెక్క నప్పుడు వారి కడ్డపడినగాంధారవీరరథికపంచశతంబుఁ బంచత్వంబు నొందించిన సంక్రందననందనునరవఱికిం దెరలక యేకరథస్థు లగునయ్యిరువురుం బరాక్రమించిన. 359

తే. చేరి యుండుట నను వైన ♦ వారి నొక్క
నారసంబునఁ బడ నేసె ♦ నరుఁడు దానిఁ
జూచి కన్నీరు నించి సీ♦సుతులు సాలఁ
గుంది రర్జును నవుడు మా♦ఱొక్కనియె శకుని. 360

వ. అతండు మాయావి యగుట ననేకమాయలు గల్పించిన మొగిళ్లుపరఁగి పాషాణవృష్టి వివిధాయుధంబులు విప్వచ్చుపైఁ గురిసెం బదంపడి తమం బడరెఁ బిదప నీళ్లు వెల్లిగొనియె మఱియు మహోరగశార్దూలాదిక్రూరసత్త్వంబులు గవిసె వాని నెల్లను దోడ్తోన దివ్యాస్త్రవేది యగునాసవ్యసాచి యడంగించి యల్లని నగవుతో ని ట్లనియె. 361

క. మాయలు జూదముతోడన, పోయెం గా కింక నిచటఁ ♦ బొసఁగునె యవి మ
త్సాయకము లడ్డసాళ్ళే, నీయాచవి లేదు పొమ్ము ♦ నిలువక మామా. 362

క. అని పలికి వాలుటమ్ములు, తనువున నినుచుటయుఁ గలఁగి ♦ ధైర్యము మానం
బును వీటిఁబోవఁ బాఱెను, జననాయక నీమఱంది ♦ సరివారు నగన్. 363

ఉ. ఆతఁడు పాఱినం దెరలునచ్చటిసేనలఁ గాల్కొనంగనీ
కాతతబాహువిస్ఫురులు బక్రకారియు సాత్యకియుం గడంగి తో
డై తనపార్శ్వభాగముల నార్చుచుఁ దోలఁగఁ దోలె ఖేచర
వ్రాతము మెచ్చఁ గ్రీడి కురురాజును ద్రోణుఁడు నున్ననేలకున్. 364

ఆ. బలము విఱిగి రెండుపాయలై యిట్టు లమ్మనుజవిభుని గురునిసమయువు సొచ్చె
ద్రోణుఁ బొదువుఁ దనుచు దుర్దమలీల నాదిక్కువారు గవిసి రుక్కుమిగిలి.

క. చనుఁ దద్దం బాచార్యున, కనునెలుఁగులతోడ నీసుతావలి వెనమూ
ర్కొనుటయు మనసేనలు పురికొని పాండవబలముఁ దాఁకెఁ గురువంశనిధీ.

క. గురుఁ డొడ్డుగఁ దమకించునఁ, గురువీరులుఁ బాండుపుత్త్రకులయోధులు ని
ర్భరసమరవ్యాత్తకళా,నిరతిం గ్రీడించి రుగ్రసిప్రణత మెఱయన్. 367

క. శరగురుఁ డెచటికిఁ దఱిమిన, వెరవున నచ్చటికి నెల్ల విక్రాంతిధురం
ధరుఁ డగుధృష్టద్యుమ్నుఁడు, బరవసము దలిర్ప నడ్డపడి పోరాడెన్. 368

చ. కురుపతిధర్మనందను లకుంఠితవిక్రమకౌతుకంబునం
బురికొలుపంగ సైన్యములు వొక్క పెనంగెడురౌద్రభంగి క
చ్చెరువడి యున్కి నిట్టులని చెప్పఁగ నిప్పుడు నేరనయ్యెదం
గరిపురనాథ చూడ వినఁ గల్గునె యమ్మెయిఁ గయ్య మెయ్యెడన్. 369

వ. అట్టియెడ. 370

క. నీలుఁ డనురాజు గురుసుతుపై లీలం దేఱు వఱపఁ బటువిశిఖమునం
గీ లెడపినజంత్రముక్రియ, నేలం బడ నేసె నతఁడు నృపుఁ డగ్గింపన్. 371

క. చచ్చిననీలునిఁ గనుఁగొని, విచ్చినసైన్యంబు గురుఁడు వెనుకొనుటయు 'వే
వచ్చినధృష్టద్యుమ్నుని, నచ్చినయబ్బలము మగిడెనం బోరొప్పెన్. 372

వ. అప్పుడు సంశప్తకులు నారాయణగోపాలబలంబులుం గూడికొని పఱతెంచి. 373

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడించి రాక గెలుపే [1]యతఁ డేఁ
డీ డాఁగి పోయెనొకొ మా,తోడిబవర మిట్లు రాను దొలఁగినఁ దెగునే. 374

వ. అనునెలుంగులు నింగి ముట్ట దక్షిణభాగంబునం గవిసినం గవ్వడి యట నడచి
వారికిం గయ్యం బిచ్చినసత్త్రెఱపి గని తఱుచుకౌరవయోధులకోలుతలకుం గాక
దమసేనలు దెరలిన భీమసేనుం డదల్చి మార్కొని. 375

క. తలమిగిలి వచ్చు బాహ్లికు, నిలు మని విశిఖముల నొంచె నృపతియు గురుక
ర్ణులు నశ్వత్థామయు న,మ్ములవానలు గురిసి రొక్కమొగి నతనిపయిన్. 376

వ. అతం డందఱ కన్నిరూపులై యార్చుచు నేట్లాడె నిట్లొక్కనిం బెక్కండ్రు
వొదివినం గనుంగొని కౌంతేయాగ్రజుండు పురికొలుప నకులసహదేవసాత్యకి
సౌభద్ర లాసమీరపుత్త్రునకు బాసటయై దుర్యోధనాదులం దలపడుటయు

1. యతఁడుఁ - వేఁడీ డాఁగెనొకో మా- వేఁడిం దాఁకెన్నొకో మా.

రెండుసేనలు గలయఁ బెరసి నిట్లపరాహ్ణంబునం గ్రందుకయ్యం బయ్యె నం
దరదంబులు దాఁకువెల్లున డొల్లుకరులును గరవాలధారలఁగాన నగుకుంభికుంభ
మౌక్తికంబులును దురగఖురంబులం గరటిరథంబులను బెనఁగొనుచు వ్రేలువ్రేవు
లును దెగిపడియు నంకుశంబులు విడువక మిట్టి మిట్టిపడుబాహువులును దొండం
బులం బెనఁచి యెత్తినం దారును హయంబులు వ్రేలురావుతులును ముందటి
కాళ్లు దెగ వ్రేసినఁ గూలుశుండాలంబులును సామజంబు లడరి రథ్యసారథి
రథికసహితంబుగా మల్లడిగొనం ద్రొక్కిన నేలం గలసినరథంబులును నాశ్వికు
లొక్క మొగిఁ జెక్కినం దునిసి పడి యేమిటియంగంబులో యనునం దేహంబు
నతుం బట్టయి యున్నపదాతిగాత్రఖండంబులును జూచుఖేచరులకు వెక్కసం
బొనర్చ నట్టినంకులసమరంబున ధృష్టద్యుమ్నుండు. 377

క. మన కిది సమయము సుండీ
యని ద్రోణునిఁ జూపి తఱుమ నమ్మిన రథికుల్
గని [1]పొదువుఁడు సంపుఁడు పొరి
గొనుఁడు దునుముఁ డనుచుఁ గూడుకొని యతనిపయిన్. 378

చ. కవిసిన నమ్మహీభుజుఁడు గన్నుల దట్టపుఁగెంపు వెలర్ప భై
రవముగ దివ్యబాణనికరం బడరించినఁ దేఱి చూడ రా
క వెఱఁగు నొంది చిత్రములకై వడి నాఘనయోధు లుండ నీ
రవుతులు జోదులుం రథికరాజియు వారిమొనల్ గలంపఁగాన్. 379

మ. తను సత్త్వోద్ధతిఁ బిల్చి దుర్దమభుజాదర్పంబు శోభిల్లఁ దాఁ
కినసంశప్తకకోటి నొంచి సమరక్రీడాకళాకౌతుకం
బున నాభీలకపీంద్రకేతనపరిస్ఫూర్జత్ప్రభాజాలముల్
వినువీధిం బరఁగంగ వచ్చె మగుడన్ వివ్వచ్చుఁ డచ్చోటికిన్. 380

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చిన క్రియ భీముకడకు వాసవి యిమ్మై
వచ్చిన మనయోధావళి, చిచ్చువడియె వారిమొన దఱిమికొని వచ్చెన్. 381

ఉ. బాసటయై వృకోదరుఁడు పార్శ్వమునం దఱుమంగ వైరిసం
త్రాసనమూర్తి వాసవి శరప్రతతిం దొరఁగించి ద్రోణును
ల్లాసము మాన్చి కౌరవబలంబులు నెత్తురువెల్లిఁ దేలఁగాఁ
జేసినఁ గర్ణ కర్ణ మముఁ జేకొనవే యనుచున్ భయంబునన్. 382

— కర్ణార్జునులయుద్ధము —

క. తనవెనుక క్రోడి పాఱిన, ఘనయోధులఁ జూచి బాహుగర్వస్ఫూర్తిం
దనరుచు నోడకుఁ డోడకుఁ, డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతున్.

వ. ఇట్లు దాఁకి యతనిపై నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన నతండు వారుణ

1. పొడువుఁడు.

బాణంబున వారించి వారమ్ములు గురియం గూడుకొని భీమసాత్యకిధృష్టద్యుమ్నులు
శరత్రయంబులు సూతసూనుమేన నాటించిన నతండు గాండీవనిర్గతచండమార్గ
ణంబుల నగిడించుచు నమ్మువ్వురచాపంబులు నవ్వుచుం ద్రుంచి వారలు శక్తులు
వైవ వానిం దునిమి పేర్చి యార్చిన నర్జునుండు నారాచసప్తకంబున నవ్వీరు
నొప్పించి యతనిం దలకడచి తన్నుం దలపడినయతనితమ్ములతలలు మూఁడును
భూమిదేవికి బలి సేసె నంత భీముండు రథంబు డిగ్గి వచ్చి గదాదండంబునఁ గర్ణ
బంధువులం బదివేవురం బడలుపఱిచి మరలి రథస్థుఁడై వేఱొక్క విల్లుగొని విశిఖం
బులు వఱపి యంగపతియంగంబులం దురంగశరీరంబులను నొప్పించె నాలోనన
యప్పాంచాలవరసుతుండును శైనేయుండును నొండువిండ్లు గొని యతనిసారథి
నొఱగను జాపంబు విఱుగను జేసి రాసమయంబున దుర్యోధనుండును ద్రోణ
జయద్రథులును నెయిది శాత్రవసముద్రంబున మునుంగ కుండ నారాధేయు
నుద్ధరించి రట్టియెడ. 384

క. ఉభయబలంబులుఁ బురికొని, యిభరథతురగభటతతి మహిం గూలఁగ న
క్షుభితములై పోరాడెం, బ్రభువులు వెను దన్ని చూడఁ బార్థివముఖ్యా. 385

సీ. కాలువలై పాఱెఁ గీలాలజలములఁ, దేలి పోయెడు మృతదేహములును
బ్రోవులపోవులఁ బెల్లునఁ జిత్రిత, చ్ఛాయంబు లగుమాంససంచయములు
గరిహయంబులకళేబరముల క్రిందఁ గొం, డొకతోఁచు భటగాత్రనికరములును
దలలపెండఱచులోఁ మిలమిల మెదలెడు, కరపదంబులనవఖండములును

తే. రౌద్రబీభత్సనర్తనరంగభంగి
నపుడు సమరాంగణము ఘోర మయ్యెఁ జూడ
ద్రోణఫల్గుననిష్ఠురోద్ధురనిపాత
జాత మగునమ్మహోద్భటసంకులమున. 386

వ. అంతం బతంగుండు పశ్చిమాచలంబునవ్వలకుం జనిన సంధ్యారాగంబు సాం
పునం గెంపినుమడించు నెత్తురుమడువుల నోలలాడుభూతవేతాళంబులను శవకబ
ళనలోలంబు లగుసృగాలంబులను మాంసచర్వణకోలాహలబహుళంబు లగు
కంకగృధ్రాదిపక్షికులంబులనుం జూచియుఁ బాండవబలంబు సమయసముచితం
బగుసమరవిరామంబునకు నున్ముఖం బగుట యెఱింగియు మున్న సవ్యసాచియుర
వడిం గాక తమ మొన దెరలు చునికిం జేసియు నదియ మేయిగా నాచార్యుండ
దొరలకుం జెప్పి సేనలఁ దివియ నియోగించెఁ బాండవసైన్యంబులును మరలె
నివ్విధంబున నుభయసైన్యంబులు నిజస్కంధావారంబులకుం జనునవసరంబున
మనజనంబులు ద్రోణుప్రతిజ్ఞాభంగంబును ఫల్గునుపరాక్రమస్ఫురణంబును నతని
యెడ నచ్యుతునకుం గలసౌహార్దవిశేషంబును నుగ్గడించుచు విన్ననై పోఁ బురి
వేగుటయుఁ గయ్యంబునకు వెడలునప్పుడు విషాదవివర్ణవదనుండగుచు నీతనయుఁ

జెల్లయోధులు వినం గుంభసంభవున కిట్లనియె 387

మ. వినుఁ బార్థుండు వర మిచ్చి తట్లు గడిమిన్ భీమాగ్రజుం డాజిఁ గి
ట్టినఁ బట్టం గడు నగ్గమైనయెడఁ గ్రోడిం దెప్ప నీ కైనఁ జా
లనివాఁ డందురు నిన్ను నన్నుఁ గుటిలాలాపంబులన్ వెట్టిఁ జే
సిన నీకైనది యేమి యాశ్రితగుణశ్రేష్ఠుండు వంచించునే. 388

వ. అనిన విని గురుం డప్రీతుం డయ్యును గటకటంబడక యతనితో నిట్లనియె. 389

ఆ. నరునివిక్రమంబు నారాయణునిమహా
త్త్వంబు నెఱిఁగియెఱిఁగి తగునె యిట్లు
వలుక ధర్మపుత్త్రుపైఁ జేయి వదలక
వారు రారె పెక్కువరుస లధిప. 390

ఉ. ఎవ్వరి నెట్లు సేసెదనొ యేర్పడఁ జూడుము నేఁడు పోరికిం
గవ్వడి రాక యుండఁ దొలఁగం గొనిపోవఁగ జాలువారి నీ
వెవ్వరి నైనఁ బంపు మిది యేటికి నొండొకబుద్ధి సేసె దే
నవ్వుచుఁ బల్కినన్ ధరణినాథ యసత్యము గల్గ నేర్చునే. 391

వ. అనవుడు. 392

మ. విని సంశప్తకు లేము దక్క నొరు లావివ్వచ్చు భంగించి పె
ట్టనికిం బాపి యలంప నేర్పు గలరే యంచున్ వెసం బోయి పి
ల్చిన నప్పార్థుఁడు నుద్ధతిం జనుడు నక్షీణోగ్రశస్త్రాస్త్రవ
ర్తనఘోరం బగుసంగరం బచట రౌద్ర[1]స్ఫూర్తిమైఁ జెల్లఁగాన్. 393

వ. ఇక్కడ భారద్వాజుండు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజునను మతి నభిమన్యుం డయ్యొడ్డు భేదించి బృహద్బలలక్ష్మణప్రభృతు లగుభూపతులను భూపకుమారులను బెక్కండ్రఁ బొరిసమరి యనేకయోధవీరవిక్రమసంకులంబునం జిక్కువడి యుక్కు మురిసినట్లు సమసిన మనమొనలు సెలంగుచుం బాండవబలంబులు పొగులుచుం దమతమయునికిపట్లకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకు సౌభద్రుండు వడుట సెప్పె ననిన విని నాఁటికయ్యంబుకలరూపంతయు నేర్పడ నెఱింగింపు మనుటయు. 394

ఉ. సాత్త్వతేయ వాఙ్మయవిశాలగృహస్ఫురిత[2]ప్రదీపితా
పత్త్యయగోచరా విహృతిభగ్ననిశాచర శాంత బోధసం
పత్త్యవినాథవన్మహిమభాసుర సంభృతభూసురాళిసాం
గత్య వివిక్తయుక్తజనకౌశలభావిత దేవసేవితా. 395

క. వేదశిరోమణిచరణా, నాదాంతస్సార[3]కరణ నైష్ఠికతరణా.
భేదరహితప్రకారా, వాదవిదూరా విరించి[4]వర్ణ్యవిహారా. 396

1. స్ఫీత పై. 2. ప్రదీపికా. 3. చరణ 4. వర్ణిత.

మాలిని. అనుపమహితవిద్యాప్రవ్యక్త యోగానురక్తా
దనుజమథనలీలాప్రస్తవ్య శాంతానుభావా
జననమరణదుఃఖోత్తారి సర్వోపకారీ
సనకముఖయతీంద్రాప్రసన్న నిత్యప్రసన్నా 397

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 398



శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము – ద్వితీయాశ్వాసము.



కర భక్తాంభోధిసు
ధాకర చక్రత్రిశూలధారణరక్షో
భీకర నిర్భరతరకరు
ణాకర దృగ్దీప్తినికర హరిహరనాథా. 1

— ద్రోణుని మూఁడవనాటియుద్ధము. —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనమనుమండు మృతిం బొందుట విని ధృతరాష్ట్రుండు. 2

ఉ. చిత్తము పొక్కెడుం బురుషసింహునిఁ బౌత్రకులాగ్రగణ్యు న
త్యుత్తమతేజు భూరిగుణు నొప్పుమెత్తనిమేనివాని నె
ట్లుత్తలపెట్టిరో పలువు రుగ్రమనస్కులు గూడి యక్కటా
యుత్తెఱఁ గెల్లఁ దేటపడునట్టులుగా వివరించి చెప్పుమా. 3

వ. అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను నట్లు భారద్వాజుండు పద్మవ్యూహంబు సంఘటించునెడ వివిధదేశంబులరాజులు దళంబులును రాజకుమారులుఁ గేసరంబులును గర్ణదుశ్శాసనబహుళసేనాపరివృతుం డయి కురువిభుండు గర్ణికయునుంగా నభేద్యభంగి నొనర్చిన నది వలయాకారం బగుటం జేసి చక్రవ్యూహంబు నసం జను నమ్మొగ్గరంబు మొగంబునం దాను దర్పంబు మెఱయ నెఱయం బొలిచి నిలిచె మఱియు వలయునెడలకు లావై జయద్రథగురుపుత్త్రకృపశకునికృతవర్మభూరిశ్రవశ్శల్యులును నీకొడుకులును మనుమలును రక్తమాల్యానులేపనాంబరాభరణంబులు శోభిల్లం బొలిచి నిలిచి రంత భీమసేనప్రముఖంబైనపాండవబలంబును గదియనడచె నందు సాత్యకిధృష్టద్యుమ్న కుంతిభోజులును జేకితానక్షత్త్రధర్మక్షత్త్రవర్మలును ధృష్టకేతునకులసహదేవులును నుత్తమౌజశ్శిఖండియుధామన్యులును ఘటోత్కచవిరాటద్రుపదులును ద్రౌపదేయకేకయసృంజయసముదయంబును నుక్కునం దఱిమియక్కుంభసంభవుం దలపడిన నవ్వి

తే. బాలుఁడవు నీవు కుంభజప్రముఖ సైన్య
పతులు ప్రౌఢులు పెక్కురు § బవరమునకుఁ
జొచ్చి యెఱుఁగని నీచేతఁ § జచ్చువారు
గారు బహువిధసమర కర్కశులు వారు. 14

చ. అనవుడు నల్ల నవ్వి యతఁ § డాతని కిట్లను దేవయుక్తుఁడై
యనికి బలారి వచ్చినఁ బురారి గణంబులఁ దాఁ బన్నినం
గినిసి కడంగి క్రీడియును § గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతు మా
ర్కొని యను చుండుదుర్ సరకు § గొందునె ద్రోణునిఁ దోడియోధులన్. 15

వ. అని పలికి వాసియాలాపంబు నాలంబు సేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన వాఁ డనుమానించుచు మనసైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరునడపుటయు వారి సేనయుం దోడన కడంగుటయుం గనుంగొని భారద్వాజప్రముఖయోధు లొండొరులకుం దలమిగిలియేచి యెదుర్కొని పెలుచ నిలిచిన సంకుల సమరం బయ్యె నట్టియెడ. 16

— ✿ అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని సొచ్చుట. ✿ —

ఆ. మెఱుఁగు మెఱచినట్లు § మెఱయంగ నరదంబు, కర్ణికార కేతుకాంతి వెలుఁగ
సంపగముల గురునికరలయించి కడచి యింద్రజునికొడుకు మొగ్గరంబు సొచ్చె.

వ. ఇట్లనన్యభేద్యం బగునాపద్మవ్యూహంబు భేదించి చొచ్చి సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తియై యందు మహార్ణవంబునం దిరుగుమందరనగంబు చందంబునం గాననంబునం జరియించుతీవ్రానలంబు తెఱంగునం గాలపక్వజన[1]సమాజసంహారణక్రీడనంబు సలుపుశూలిపోలికం గేళీగతుల మెలంగి యమ్మెయి నమ్మహారంబు ద్రిప్పకొలిపియుం బొడిసేసియురూపుమాపియు రణవిహారం బొనరింప నవ్వీరవరు నారాచాదినానావిధవిశిఖవ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుఁ గరుల నుచ్చి పోవుచుఁ దేరుల విఱుచుచు హయంబుల[2]ధట్టంబుల నుఱుము సేయుచుఁ గాల్బలంబులఁ జదుపుచుఁ గేతువులం ద్రుంచుచు నాతపత్రంబుల నుఱుమాడుచు రథ్యంబులం గూల్చుచు సూతుల గీటడంగించుచు ధనువులు దునుముచు మైమఱువులు వ్రచ్చుచు భూషణంబులు ముల్చుచుఁ గరవాలంబులఁ ద్రోయుచు మేనులు నించుచుఁ దూపులు మాలించుచుఁ జేతులు నఱకుచు సబళంబులు జగియుచుఁ దలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు నెత్తురు లురలించుచుఁ గండలు సెక్కుచు నెమ్ములు నలఁచుచుఁ బరఁగిన నమ్మొన చిక్కువడియును సుడివడియును గలంగియుఁ దొలంగియు నెఱచఱచియు విచ్చి పఱచియు దీనదశకు వచ్చినం గనుంగొని. 18

క. వీఁకమెయిఁ గ్రీడికొడుకుం, దాఁకఁగ నీకొడుకు తలఁచి § తఱిమి కవిసెఁ బే

1. సమాజంబున సంక్రీడనంబునం గ్రేణి సలుపుశూలి 2. దట్టంబు సేయుచు.

రాఁకలిఁబో నున్నవాఁడిం, దేఁకువ సెడి చేరుకరిపురిం గురుముఖ్యా. 19

వ. ఇట్లు సౌభద్రుఁ బెనయుం జూచు సుయోధనుం జూచి శరాసనగురుండు సైనికవరు
లకుం జేయి వీచి మొఱుం గొత్తి. 20

క. నరసుతున కగ్గ మయ్యెం, గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీఁ
దరుగం జేయుం డద్దము, చౌరుఁడు వెరవులావు నెఱయ శూరత మెఱయన్.

వ. అనుచుఁ దనయరదం బద్దెనమొగంబు సేసి పురికొల్పిన. 22

ఆ. కృపుఁడు గురుసుతుండు కృతవర్మ కర్ణుండు, సౌమదత్తి శలుఁడు సౌబలుండు
పౌరవుండు మద్రపతి వృషసేనుండు, గౌరవేశ్వరుండు గడఁగి రవుడు. 23

వ. అట్లు గడంగి. 24

చ. ప్రకట బలాఢ్యు లొక్కట డిగ్గరం బయి షడ్వరు వీక భూమిపా
లకునకు నడ్డమైన దవుగ్గలం బడి వాలు మ్మని నోరి కండ నా
చికొనిన మ్రోగుబెబ్బులివిశేషము దోఁపగ బార్థపట్టి సా
యకముల నొంచినం దెరలి రందఱు లేవెలపిండునాకృతిన్. 25

వ. ఇవ్విధంబున నయోధవరులు విచ్చిన విన్వచ్చుకొడుకు పేర్చియార్చిన నాచార్యుం
డువీరిచేత నిలువం డని తా నరిగి యన్నరనందను నెదుర్కొనిన వారును గూడు
కొని పొదివిన. 26

క. అతఁ డందఱమార్గణములు, నతిరయమునఁ ద్రుంచుచుం దదంగముల శర
ప్రతతులు నించుచుఁ బోరఁగ, బతి సేనకు జేయి వీచె బరవస మలరన్. 27

క. మనసేన పెలుచ గడఁగిన, వననిధి పొంగెడువిధంబు వాసవిసుతుఁడే
చినఁ జెలియలికట్టతెఱంగున గానఁగ నయ్యె నపుడు కురువంశనిధీ. 28

వ. అనసమయంబున. 29

సీ. రారాజుఁ గృపుఁడును భూరిశ్రవుండు మూఁ,డేసియమ్ములు పదియేడు గురుఁడు
వినుము వింశతి విశంతి విశిఖంబు, లాచార్యసుతుఁడు బృహద్బలుండు
నైదు నెన్మిదియును నాఱు శల్యుఁడు నప్త,శరములు గృతవర్మ సౌబలుండు
రెండుబాణములు వంగ్రేండుఁ దొమ్మిదియును, దుశ్శాసనుండును దుస్సహుండు

తే. నేసి రర్జునసుతుమీఁద నెల్లవారి,తనువులందును సాయకత్రయము లతఁడు
గ్రుచ్చె నశ్మకుఁ డడరినఁ గూల నేసెఁ, దురగసూతకేతనములతోడఁ గూడ.

—దుర్యోధనప్రభృతిమహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యుపైఁ గవియుట.—

వ. ఇవ్విధంబున నశ్మకుండు వడినఁ దెరలుబలంబుల మరల నీక పురికొల్పుకొని
యప్పటియాచార్యప్రభృతియోధులును నీకొడుకులలోనఁ గొందఱును గ్రందు
గం దఱిమి యనేకాస్త్రశస్త్రపరంపరలం బొదివిన నొదవినకినుకం గిరీటినందనుం
డందఱమేనులు నానానిశితవిశిఖవేగంబున నొత్తుటజొత్తిల్లం జేసి కర్ణుపయిం గవిసి.

తే. కంకటముదూఱి యంగంబు గాఁడి పోవఁ, గ్రూరనారాచ మేసినఁ గ్రుక్కి నతఁడు
లీల నట్టిద పఱపి భూపాలనీదు, సుతుల వెనుకకుఁ బఱపె సుస్థితి దలిర్ప. 32

చ. అడరి నరేంద్రకోటి నలు మూఁడుగ నత్తఱి శల్యుఁ డెంతయున్
వడిఁ దనుఁ దాఁకినన్ మెఱుఁగుఁ గ్రొవ్వాలికతూపుల మూర్ఛ వుచ్చి క
వ్వడికొడు కేచి యుద్భటరవంబున నార్చినఁ బెల్లగిల్లి న
ల్గడలకుఁ బాఱె నిల్వక బలంబులు ద్రోణుఁ డెలుంగు సూపఁగాన్. 33

వ. అప్పుడు. 34

క. సురలును సిద్ధులు విద్యా,ధరులుఁ బొగడుచు నలిపుఁ జూచు ధరణీశులుభం
ధురనుతినాదంబులు నం,బరధరణీమధ్యభాగపరితము లయ్యెన్ 35

చ. అని విని యాంబికేయుఁడు మహాద్భుతవిక్రమశాలిఁ బార్థసం
దను మఱి యెవ్వ రట్టియెడఁ దాఁకిరొ నావుడు సూతపుత్త్రుఁ డి
ట్లను నటులైన శల్యుఁ గని యాతనితమ్ముఁడు మేను వెంచి మా
ర్కొని పదితీవ్రబాణములు గ్రుచ్చెఁ దదంగములం జెలంగుచున్. 36

వ. అట్లు పై కేసిన వాసవికొడుకు గోపించి. 37

చ. హయములఁ జంపి సూతుఁ దెగఁ బార్చి పతాక ధరిత్రిఁ గూల్చి చా
పయుతము గాఁగ వానిఘనబాహులు రెండును ద్రుంచి యెంతయున్
రయమునఁ దేరు చక్కడిచి రాజులు రాజతనూజులుం గడున్
భయమునఁ దూలిపోవఁ బటుభల్లహతిం దల డొల్ల నేసినన్. 38

వ. ద్రోణకృపద్రౌణికృతవర్మబృహద్బలకర్ణప్రముఖయోధవరు లొండొరులఁ బేరు వేరం బిలిచి బలంబులం బురికొలిపిన రథనేమిగజఘంటాతురంగకింకిణీస్వన సింహనాదమేదురరోదోంతరరౌద్రంబుగా సౌభద్రుం జుట్టు ముట్టిన నతం డట్టహాసంబు సేసి లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబులు మెఱయఁ గృష్ణార్జునులు గావించు నేర్పు మెఱయం బోరునవసరంబున మండలీకృతకోదండదండుండును[1] బటుసంధానస్ఫురితశరనికరుండును నై పరివేషవలయంబులోనం గిరణస్ఫురణపూర్ణరీతుం డగుతపను ననుకరించుచు గుణఘోషభీషణంబుగా బెడిదంపునారసంబులు పరఁగించి యార్చి యూర్జితం బగుచున్ బలుపిడుగులు దొరఁగించువిలయకాల వలాహకంబు విడంబించుచు విజృంభించి భల్లాంజలిక క్షురప్ర కూర్మనఖర ప్రభృతిబాణవేణికావితానంబుల వెగడుపఱచిన విచ్చిన వాహినులనిలువరింపనేరక నివ్వెఱపడి యాచార్యుండు సూచుచుండె ననవుడు ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 39

క. మనమున ఖేదము మోదముఁ, బెనఁగొని యెడు మద్బలంబుఁ బీడించెను నా
మనుమఁ డని వినికి నాతని, యనిపని యటమీఁద నెట్లు లయ్యెం జెపుమా.

1. బటుశరసంధానస్ఫురితకరుండును; బటుశరసంధానస్ఫురితదశశతకరుండును.

క. అనుటయు సంజయుఁ డి ట్లను, వినుము జనాధీశ యిట్లు ఽ విఱిగిన సేనం
గనుఁగొని పోవఁగనీ క, ర్జునతనయుఁడు దనరథంబు ఽ [1]చుట్టం బఱపన్. 41

వ. కౌఱవి ద్రిప్పిన కెలంకులఁ దోఁపఁ బొడవి పోనీక కీసంగు పెంటలు సేసిన నప్పు డక్కుమారు నాలోకించి వికాసభాసితవదనుం డగుచు గురుండు [2]గురుపతి నెఱను దాఁకఁ బలుకవలయు ననుతలంపున నతండు వినుచుండం గృపాచార్యుతో ని ట్లనియె. 42

ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ ఽ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁ ఽ దాఁకెను నే విజయాత్మజుండు ఘో
టమ్ములఁ గుంజరప్రముఖులు బన్నడల్పడఁ దేరులు నుగ్గు గాఁగ నా
నమ్మిన యోధవీరులు వినాశము భంగము నొంద నొక్కఁడున్. 43

ఆ. అనిన వెలుకఁబాఱి ఽ యుఱిదీన మగునాన,నమున నవ్వు గానిక్రనవ్వు నెఱయ
సౌమదత్తికర్ణశల్యాదు లగుయోధ,జనులతోడ నిట్లు ఽ లనియె విభుఁడు. 44

చ. పలుకులు వింటిరే ధనువు ఽ వట్టెడివారికి నెల్ల నొజ్జ దో
ర్బలవిదితుండు కుంభజుఁడు ఽ బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం
గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁ [3]జొచ్చె నితండు నొంపఁగాఁ
దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ ఽ దాఁ గడుఁ గూర్చుట నెంత ద్రుళ్ళినన్. 45

చ. గురునియొ చేతఁ జేసి తనప్రకృతి సమరోద్ధతి సెల్లె దాని నీ
వెరవిడి గాన లేఁక దనవీరము కాఁ గొని విఱ్ఱవీఁగెడుం
బొరిగొనుఁ డందఱుం గడఁగి ఽ పోవఁగనీక దృఢాస్త్రశస్త్రని
ష్ఠురపరిపాతనోగ్రముగఁ ఽ జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్. 46

వ. అనిన విని వా రందఱు నవ్యాసనపౌత్త్రుం బొదువం బోవ నవ్వీరుల వారించి దుశ్శాసనుం డి ట్లనియె. 47

చ. ఇనుఁ గబళించురాహుక్రియ ఽ నే నొకరుండన పోయి పార్థపు
త్త్రునిఁ బరిమార్తు నీతఁడు మృతుం డగు టేర్పడ విన్నఁ గేశవా
ర్జునులును బిట్టు సత్తు రతిశోకభరంబునఁ జేసి యంతతో
మనవగ దీఱుఁ దీవ్ర మగునమద్భుజదర్పముసొంపు నూడుఁడీ. 48

దుశ్శాసనుఁ డభిమన్యుతోడం బోరి పాఱిపోవుట.

వ. అని పలికి యార్చి యమ్ములు నిగిడించుచు ధనంజయతనయుం దాఁకిన నతండు షడ్వింశతిసాయకంబులు దనువునం జొనిపినం గనలి దుశ్శాసనుండు శరాసార ఘోరంబుగాఁ గవిసినం గిరీటికొడుకునుం బేర్చి పెనంగ నయ్యిరువురకరలాఘవ శరలాఘవప్రకారంబులు రథచిత్రప్రచారంబులుఁ జూప నగ్గించి రప్పు డగ్గలిక సొంపున సుభద్రానూనుండు నీసుతువిల్లు ద్రుంచి భల్లంబుల మేను నెక్కి-

1. చుట్టం బఱపున్. 2. గురుపతికి. 3. దెచ్చె.

స్రుక్కించి యతనితో ని ట్లనియె. 49

చ. అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మెయి నీవు నొవ్వఁ బ
ల్కినఫల మందఁ జేసెదఁ జ్వలింపక యించుక సేపు నిల్వుమీ
నిను లఘుచిత్తుఁ గ్రూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చినగురువంద్రుఁదండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబు దీర్చెదన్. 50

క. అని యతనిజత్రుదేశం,బున నొకవాలమ్ము వక్షమునఁ బెక్కు నుగ్రు
చ్చినఁ ద్రెళ్లి యెఱ్ఱఁడో చ,చ్చినయట్లు రథంబుమీఁద జేష్టి యుండెన్.

వ. ఇట్లు మూర్ఛిల్లిన దుశ్శాసనుతేరు సారథి దొలంగఁ దోలుకొని పోయె నంతకు
మున్న కౌంతేయులు సౌభద్రుండు సొచ్చినపథంబున నాపద్మవ్యూహంబు సేనా
సందోహసహితులై చొచ్చి యెడనెడ నడ్డపడుసైన్యంబులతో సంగరంబు సేయు
చు నక్కుమారుం దల తెత్తిచూచుచు నతం డరిబలంబులం గలంచుటకు సంప్రీ
తు లగుచుఁ దోఁతెంచువారు ముందట దుశ్శాసనుండు భంగపడుట గనుంగొని
పొంగి యార్పులు నింగి ముట్ట నయ్యభిమన్యు ననేకభంగులం బ్రశంసించుచుం
దఱిమి రట్టియెడ. 52

సీ. రాధేయుఁ జూచి రాజరాజు దుశ్శాసనుఁ, డభిమన్యుచే నొచ్చె నకట కంటె
యనవుడు నతఁడు సేనాన్వితంబుగ నక్కు,మారుపై నశర వర్షిరుఁ జేచి
ముందటిమూఁకల మ్రందించి కదిసి డె,బ్బదిమూఁడునాములఁ బటురయమున
నొంచిన రక్తాన్యనుం డయి దివ్యాస్త్ర,జాలంబు వఱపునాజామపేగున్న
తే. శిష్యభుజవీర్యశౌర్యవిశేషభంగి, సరకుగొనక యుబ్బాలుండు సమదలీలఁ
బెనఁగ నయ్యంగరాజు డస్సిన నెఱింగి,యతనితమ్ముఁ డయ్యర్జునసుతునిఁదాఁకి.

చ. హయములమీఁద సూతుపయి నాతనియంగములందు నస్త్రసం
చయ మడరించినం గమలచారుముఖంబున నెత్తినవ్వు చె
న్నయి విలసిల్ల భల్లమున నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష
ద్భయదవిలాస[1]బాహుసముదగ్రత వానిశిరంబు గ్రక్కునన్. 54

ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుమునెవు గనుంగొని యోహటించి శీ
ఘ్రమ్మునఁ బెం పఱం దొలఁగెఁ గర్ణుఁడు పెక్కుబలంబు లప్పు డొ
క్కుమ్మడిఁ దోచి యుద్ధతమహోదధిఁ బోలఁగ మందరమ్ము చం
దమ్మున నొప్పె నుద్భటవిగ్రహస్ఫురణుం డగుపార్థపుత్త్రుఁడున్. 55

వ. ఇట్లు మూఁకలం గలంచి. 56

క. వెన రాధేయుసితొలఁగిన,దెసకుం జనుటయు నతండు ధృతి సెడి విఱిగెం
[2]బన పొడ వడఁగఁగఁ బెఱయో,ధసమూహము తాఱె ధరణిపతుల మన్రవంగాన్.

వ. ఇవ్విధంబున సైన్యంబులుం దారును బఱచుదొరలం జూచి యాచార్యుండు. 58

1. రేఖసముదగ్రత. 2. వస మఱి వడఁకఁగ సెఱయో

చ. నిలు నిలు కర్ణ యోకృపుఁడ నీ విటు లేల [1]కడంక దక్క సౌ
బల ధృతి వోవ నేటికి బాహ్లిక యుత్తఱిఁ గౌరవేంద్ర నీ
బలములఁ జలంబుఁ జూపి నిలుఁడవు దగు సేనల నంచు బెక్కుభం
గులఁ బురికొల్పె నెవ్వఁడును గోల్పడ సేయర యేమి సెప్పుదున్. 59

వ. ఇట్లు ప్రళయసమయధారాధరస్ఫీతవిస్ఫూర్తచ్ఛటాభీలం బగుచ బ్బాలుని బెడిదంపు టంపఱ సైరింపం జాలక సీబలంబులు పాఱిన నక్కుమారకంఠీరవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి యునికిం దనివి సనక వెనుకం దవిలి వట్టియుడవి ముట్టి యేచ్చు కార్చిచ్చుచందంబునం జతురంగబలంబులం జారిసమరిసం దేరులు నలియం ద్రెళ్లినశుండాలంబులును గాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద [2]సూఁదుకొనం గూలినఘోటకంబులు గుజ్జువుట్టల రాసులుఁ మూసికొని యుఱవఱ లైనయరదంబులునుగరటికళేబరంబులువోదివినం గాలు గాలం బెనఁచుకొని పడి యున్నసుభటసమూహంబులును గంకణాంగద కాంతంబు లైనకరకాండంబులగములును ముసుంగువడ ద్రొల్లినసకుండలమస్తకంబులునువీరకటకంబులును మెఱయుఁ జిక్కువడియున్న చరణంబులును గ్రిందు పడం దొరఁగినగాత్రఖండంబులును దునియ లైనధనురాదిహేతివ్రాతంబులపైఁ బొడవు సెడక బాహులతోడం బొలుచుకృపాణప్రముఖప్రహరణంబులును గొడుగులకుప్పలును జామరంబులప్రోవులును సిడంబులతిట్టలును నయి సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె నప్పుడు గగనమధ్యభాగంబున భాసమానుం డయినమార్తాండురెండవమూర్తియుంబోలె నయ్యేకవీరుండు వెలింగె ననవుడు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 60

ఆ. బాలుఁ డొంటి యిట్లు పలువురతోడఁ బోరంగఁ జూచుపాండురాజతనయు
లందుఁ దోడువడుట కై యొకరుండును, గడఁగ కునికి కేమికారణంబు. 61

వ. అనవుడు సంజయుండు. 62

— పద్మవ్యూహంబు సొచ్చుపాండవులకు సైంధవుం డడ్డపడుట. —

చ. వినుము నరేంద్ర పాండవులు విక్రమదుర్దము లైనపార్థనం
దనునకుఁ దోడ్పడం గడఁగి దంతితురంగరథోత్కరంబులం
దునుముచు సత్వరస్ఫురణఁ దోఁచిన నీపెనుమాఁక పాయ [3]వి
చ్చి నిలిచి చూచు చుండె నవిశ్చేష్టితు లైరి బలాధినాథులున్. 63

వ. పాంచాల యాదవ పాండ్య కేకయ మాత్స్యప్రముఖమహానీయసైన్యంబులతో న ట్లురవడించిన నయ్యుధిష్ఠిరుం డనుమహావాయువునకు జయద్రథుం డద్రియపోలె నడ్డపడియె నని చెప్పుటయు విస్మితుం డగుచు వైచిత్రవీర్యుం డతని కి ట్లనియె.

చ. తనయునిమీఁదికూరిమి నుదగ్రత సేనలతోడఁ బాండునం

1. తలంకె దిందు సౌబల. 2. నూఁకుకొన. 3. విచ్చిన నలిఁ జొచ్చి రప్పు డవిశ్చేష్టితు.

దనుల రయంబుమై నడరఁ దా నొకరుండ భుజాబలంబు నే
వునఁ గుదియించెనే యతఁడ పో కురుసేనకు మేటి సింధురా
జున కది యేమహాతపముసొంపున సత్త్రతి సంభవించెనో. 65

వ. అనినవిని సూతసూనుఁ డపుత్త్రనవపతికి ట్లనుఁ బాండుసుతు లరణ్యంబున నున్ననాఁ
డతండు ద్రౌపదికతంబున భీమసేనుచేత భంగపడి సంతప్తచిత్తుండై చిత్తజారాతి
నారాధించిన నతనికరిష్ఠనిష్ఠాతిశయంబునకు భక్తవశ్యుండగు నప్పరమేశ్వరుండు
ప్రీతుండై పొడసూపిన జయద్రథుండును గౌంతేయుల నివారించునట్లుగా వరం
బొసంగవలయునని విన్నవించిన నద్దేవుండు[1] (*సవ్యసాచినిఁ దక్కఁ దక్కిననలువురు)
పాండవులు నీచేత నివారితులగుదురొక్కదివసంబునం గలుగుఁ గాక యని పలికి
యంతర్హితుం డయ్యె నది కారణంబుగాఁ గట్టి గౌరవం బారథికవరునకు దొర
కొనియెఁ దత్పరాక్రమంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 66

సీ. సింధుదేశోద్భవస్థిరవాహనంబులఁ, బూనినయరదంబుపొలుపు మిగుల
రత్నమయోగ్రవరాహధ్వజంబు న,భస్స్థలిఁ జాచలఁ బ్రభల మెఱయ
సాంద్రచంద్రాతపసదృశమై యుజ్జ్వల,చ్ఛత్త్రచామరములచాయ నిగుడ
వజ్రముక్తాఫలవజ్రకిరణావళి,కలితభూషణములు వెలుఁగుచుండఁ

తే. జిత్తమున వరగర్వంబు సిగురులొత్తఁ, బాండుపుత్త్రులదుర్దాంతబాహుబలము
మొనలపెల్లును సరకుగాఁ గొనక యేచి, యార్చి వారికి నీయల్లుఁ డడ్డపడియె.

వ. ఇవ్విధంబున నడ్డపడి సాత్యకిని సాయకత్రయంబునను భీమసేనుని బాణాష్టకం
బునను ధృష్టద్యుమ్నుని నిరువదియమ్ములను విరాటుని శిఖండిని బదిపదితూపు
లను బాంచాలపతి నేడింటను ద్రౌపదేయులం బదియేనింటను గేకయుల నిరువ
దేనింటను ధర్మసూను సప్తతిశరంబులను నేసి యాసేన నానాస్త్రంబులం గప్పి
నప్పు డప్పాండవాగ్రజుం డతనికోదండంబు దుండంబులు సేసిన నాసైంధవుం
డొండువింట నంటలుం బోనిమార్గణమ్ము లమ్మనుజపతిమీఁదను దదనుచరుల
యంగంబులందును బరఁగించినం బవనతనయుండు దలకడచి రభసంబున. 68

క. భల్లములు మూఁట గొడుగును, విల్లును బడగయును ద్రుంప వేఱొకవిలు నీ
యల్లుఁడు గొని భీముగొడుగు, విల్లును బడగయును ద్రుంచి విరథుం జేసెన్.

వ. ఇట్లు వికలసాధనుం డై. 70

సీ. అనిలసుతుండు సాత్యకితేరిమీఁదికి, నరిగిన నీసేన యార్చుటయును
సైంధవుపై వారిసైనికోత్తము లనే,కాస్త్రముల్ పఱపిన నతఁడు వాని
మరలింప ము న్నభిమన్యుచేఁ గూలిన,రథదంతిహయభటరాజికతన
నతివిషమం బైన యానేల నవిహత,గతి నరదంబులు [2]గ్రందు పఱపి

ఆ. వారు సేసి రాహవము దాని కోర్చి యం,దఱును దమక తమక తనిసి వెనుక

1. * ఇది కొన్నిటఁ గానిపింపదు. 2. గ్రందఁ బఱపి.

మగుడం గోల్తలు జేసి పరువిభుండు గురుపుత్త్రకృపకర్ణకృతవర్మబృహద్బలసాబల
సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునబ్బునం గొండొక పెద్ద
యనక పిడుగుచందంబునం గర్జిలి యాటోపించిన నయ్యారదంబులతండంబులు లేట
మొగంబు వడియె నట్టియెడ. 87

— దుర్యోధనపుత్త్రుం డగులక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట. —

చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ డా కినఁ జూచి యమ్మలం
బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱ రాజుఁ గాంచి యం
బుదములు గొండపై నడరునట్టులిక నన్నరుపట్టి నందఱుం
బొదువ నతండు ఘోరశరభూరినిమారమువం దెరల్చుచున్. 88

క. కదిసినలక్ష్మణునిం బలి, కొఱపును సింగంపుఁగొదమ [1]గొదగొనులీలం
బొదువుగతిఁ గిట్టి మోదము, పదమునెలర్పంగ నిందుఁడుమమిఁడు గడిమిన్.

చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొక యమ్మున నొవ్వ నేసి నీ
వెటఁగియెటింగి నకా దొఁదరి యెక్కడఁ బోవఁగ వచ్చు నంచు నే
డ్తెఱఁ దలఁ గుండలస్ఫురితకీలితలతో నిల డొల్ల నేసె నం
దఱుఁ బతియుం గనుంగొనఁగ దైన్యరవంబు సెలంగ నేసలన్. 90

తే. మిడుక మిడుక నిత్తెఱఁగునఁ గొడుకుఁ దునిమి
యక్కుమారుండు మెఱయుట నడలుఁ గనలుఁ
గడలుకొనుమదితోడ నీకొడుకు వీని
నొంపుఁ డందఱుఁ బైపడి చంపుఁ డనుడు. 91

క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు, నతనిసుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును భా
సితశరములు గురియుచు న, చ్యుతునల్లునిఁ బొదివి రొక్కరయమ్మడిఁ బెలుచన్.

క. అతఁ డందఱవిశిఖంబులు, వితథమ్ములు సేసి వారి వెగడుపఱిచి యు
ద్ధతి సైంధవుపొదుసేన, కతిరయమునఁ దేరు నడపునాసమయమునన్. 93

వ. నిషాదులుఁ గళింగులు గజబృందంబులతో నడ్డపడిన నయ్యతిరథసింహుండు దరు
వాయి గొని తునుమాడ నెప్పటియోధవీరు లెయిది పెక్కుఁబోతు లొక్కుపు
లిం జట్టు ముట్టినచందంబునం బొదివి పెనంగ నాజయద్రథుండును బాండవబలం
బులం ద్రోచి రానీక రథసాతిశయఘోరంబుగాఁ బోరు చుండె నక్కుమారుం
డు గురుం బంచాశద్బాణంబులను గృతవర్మ నశీతిసాయకంబులను గురుతనయు
దశవిశిఖంబులను గర్ణు నొక్కబలునారసంబునను స్రుక్కించి కృపుని విరథుం జేసి
బృహద్బలుమేన ముప్పదినారసంబులు నాటించి వారలకు బానటయయి కదిసిన
సైనికులం బెక్కుతెఱంగులతూపులఁ జిక్కువఱిచి యుక్కనం గ్రోధలిప్తబ్రుం
దారకు లనురాజులను రూపడంచె నప్పుడు శారద్వతుండు దేరాయితంబు సేసి

1. గొదగొని లీలం.

కొని కడంగి తోడియేవురం గూడుకొని యాక్రీడికొడుకుమీఁద మార్గణవరంప
రలు వఱఁగింపం బెరిఁగినదర్పంబునం గసిమసంగి యతండు నొప్పింపం బెఱవారు
బీఱువోవ బృహద్బలుండు బిట్టు గవిసి నిశితశరంబులు సిగిడించిన నన్నరనంద
నుండు. 94

ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధించుచుం
గోప మెలర్ప ఖేటకముఁ గ్రూరకృపాణము గొంచుఁ దేరు సా
టోపత డిగ్గి వే కవియునడుం బటుభల్లహతిం గృతాంతసే
వాపరుఁ జేసె హృత్పుటముఁ గ్రచ్చి బృహద్బలు భూరిదోర్బలున్. 95

వ. ఇట్లింద్రపౌత్త్రుండు గోసలేంద్రునిం దెగఁ జూచినఁ జూచి యేచి తదీయబంధు
భూపతులు లొక్కమొగి నురవసించిన నతండు వారలయేపు మాపి కర్ణుండు డాసినం
గర్ణోపాంతంబు గర్ణికానారాచంబుల నొప్పించె నయ్యిరువురు నొండొరులమే
నులు నెత్తురుల జొత్తిల్లం జేసిన సంధ్యాసమయసూర్యబింబప్రతిబింబంబులుం
బోలెఁ బొలిచి రాసమయంబున సూతనందనునాయంకు లార్వురు గర్వంబునఁద
న్నుం గడిసినం గవ్వడికొడుకు చిత్రవధవిహారంబు సంఘపునప్పుడు కుంభసంభవ
ప్రభృతిరథికవరులశరంబులు మగిడించుచు వారిపైఁ దూపులు నిగిడించు చునికి
యద్భుతం బయ్యె నట్టియెడ. 96

తే. మగధపతిసూనుఁ డైనయశ్మంతకుండు
బాలుఁ డయ్యును బ్రౌఢదోర్బలము మెఱయుఁ
దాఁకుటయు సూతుతలయు రథ్యములతలలు
నతనితలతోన యభిమన్యుఁ డవనిఁ గూల్చె. 97

వ. ఇట్లు పూర్వవైరంబు దలంచి తలపడినమాగధకుమారు నవలీల నేలం గలిపి సింహ
నాదంబు సేసినం దత్సంరంభంబు సైరింపం జాలక దుశ్శాసనసూనుండు సరథ
సంబుగాఁ గవిసి ఘోటకంబుల నంబకచతుష్టయంబునను సారథి నొక్కనారసం
బునను దదీయతనువు పదిబాణంబులను బెలుచ నొప్పించినం జంచదరుణ
కమలచారువిలోచనుం డగుచు సౌభద్రుం డతనిం బ్రదీప్తసప్తనారాచనిపాతపీడితుం
జేసి డగ్గఱి. 98

ఉ. ఇంతకు మున్న నీజనకుఁ డెంతయు నోటఱి పాఱె నీవు నా
పొంతకు వచ్చి తింక నెట వోనగు నంచొకదొడ్డనారసం
బెంతయు బెట్టిదంపువడి నేయుడు ద్రోణసుతుండు దాని నిం
తింతలు సెక్కులై యిలపయిం దొరఁగన్ వెస నేసె నేసినన్. 99

తే. అతనిదిక్కును జూడక యతఁడు రయము
మెఱసి నీపౌత్త్రిచాపంబు నఱికి సూతుఁ
గూర్చి యాఱమ్ము లురమునఁ గ్రుచ్చుటయును

నొంచు దేటిపై కబ్బాలుఁ ద్రుంచె నధిప. 100

వ. అంత నపరాహ్ణంబయ్యె నాసమయంబున శత్రుంజయుండును జంద్రకేతుండును సువర్చసుండును సూర్యభాసుండును మేఘవేగుండును మొత్తంబై తాఁకిన ధనంజయతనయుండు మేటిమగ లగునమ్మహీశులమేనులు నానాస్త్రంబుల ననేకఖండంబులు గావించి గాంధారపతి సేరినం గ్రూరనారాచజాలంబుల జర్జరితశరీరుం జేసి దుర్యోధను దెసకు నడరుటయు సంగరపతి గురుచార్యున కిట్లనియె. 101

క. చండగతి వీరరథికుఁ, డెండుచు నేతెంచి రాజుఁ జేరెడు సౌభ
ద్రుం డిట్టులు నీ కూరక, యుండెద నను ప్రతివిధాన మొనరింపుతగన్. 102

క. అని పలికి పలికి నడ్డము, ననుఁగుయు సుతుఁ డచటియోధచయముం గలయం
గనుఁగొని యభిమన్యుఁడు నర్జునుఁడును నని నొక్కరూప చూడఁ దలఁపన్.

వ. చూడం జిన్నవాఁడు గాని యలంతులం బోయెడువాఁడు గాఁడు మన మందఱముం గూడికొని యొక్క పెట్ట యక్కుమారుపై నురవడింప వలయు ననిపురికొలిపి బరవసంబు సేసె నప్పు డప్పాండుపౌత్త్రుబాణంబులం బీడితుండై సూతపుత్త్రుండు కుంభసంభవు నాలోకించి నాదెస నూఁదఁబడి వీఁడు నొప్పించె నిలువం దగునెల వగుట నసమ్ము డింపక [1]యాలఁ గలఁచుకొనియున్నవాఁడ గాండీవిఁ గలనం గదిసి యెఱుంగుదుము కాదె యతనిచే నింత బెట్టిదంబు గాదని చెప్పిన విని యల్లన నగి యతం డతని కిట్లనియె. 104

సీ. కవచధారణ మనఘునవిద్య గవ్వాడి, కే నెఱింగించితి నితఁడు దాని
నేర్చుట నీకని యెట్టిన నొప్పింప, శక్యంబు గాదు వంచన గుణంబు
నఱకంగఁ జాపంబు విఱుగ నేయఁగఁ ఘోట, కములఁ జంపఁగ సూతుఁ గనుమఁ జేయ
నగుఁ జాలుదేని నీ వట్లు సేయుము చేత, ధను వుండ నవ్వీరుఁ జెనయ వశమె

ఆ. దేవతలకు నైనఁ గావున నొక్కఁడై, విల్లు ద్రుంచి తలిమి విరథుఁ జేసి
చూచికొంద మలవు చొప్పనఁ దెగునె యీ, రథికవరుని పటుపరాక్రమంబు.

కర్ణుఁడు మొదలగుయోధులు వంచనచే నభిమన్యుని విరథుఁ జేయుట.

చ. అన విని సూతసూనుఁడు భయంబెదఁ గూరినవాఁడపోలెనై
వెనుక కొదింగి యారథికవీరుపిఱిందికిఁ జట్టి వచ్చి వం
చనకు సహాయులై యచటిసైనికు లన్నరపుత్త్రు బిట్టు మా
ర్కొని పెనఁగంగఁ [2]జేరి యలఘుప్రదరంబున విల్లు ద్రుంచినన్. 106

వ. ఆలోన. 107

క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను, సరభసముగఁ గృపుఁడు నంపె సారథి నమ్మో
నరసుతుఁ డనాయుధుండును, విరథుండును నగుట నూచి వెఱ పేది వడిన్. 108

క. శకుని కృతవర్మ శల బాహ్లిక గురుసుతు లాదిగా ననేకు లడరి య

1. యాలు-మ్రక్కు-గఱచుకొని. 2. జేసి యలఘు: జేతియలఘు.

స్త్రకలాపంబుల శస్త్ర,ప్రకరంబుల నొంచి చిక్కువఱచి యలఁచినన్. 109

క. వాలును బలకయుఁ గొని య,వ్వాలుఁగు రథము మీఁద నగ్రభాగంబున కు
న్మీలితధృతిసారుం డై, లీల నెగసి పోయె మండలీభూతగతిన్. 110

క. తనవిద్యకలిమి వినతా,తనయునిభంగిం జరింపఁ దమతమకై దెం
పున నుఱుకు నతనితలంపున, మనయోధులు భయము గొనిరి మనుజాధీశా.

చ. ఎడ గని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁ డ
ప్పుడు శకలంబులై పలకఁ భూమిపయిం దొరఁగంగఁ జేసె న
క్కడువడిఁ గర్ణుఁ డాశిను వక్రుఁడగతిందన తేరిమీఁద నొ
ప్పెడుఘనచక్రముం గొని యుపేంద్రునిలీల నటించుచాప్పునన్. 112

వ. సంరంభవిజృంభితుం డై. 113

సీ. నెత్తుట జొత్తిల్లి నెఱసినయుఱుకు నుగ్రం బైనవదనంబుకాంతి పరఁగఁ
గౌరవసైనికోత్కరమున కతిభయ,దం బగుసింహనాదంబు సెలఁగ
నింగికి నిగుడురథాంగరోచులు మణి,కంకణద్యుతులతోఁ గలసి వెలుఁగ
సిల్లి మూపినగంధసింధురం బనురేఖ, దలఁపించుపటుగతి చెలువు మిగులఁ

తే. కుంభసంభవుఁ డున్నదిక్కునకుఁ గవిసి, యుద్ధపటుసేనఁ జించి చెండాడునక్కు
మారవరుమేనియొప్పునుమగతనంబుఁ, జలము బలముఁ గీర్తించె నిర్జరగణంబు.

వ. అట్టియెడ. 115

తే. శకునికృతవర్మకృపకర్ణశల్యముఖ్యు, లైనయోధులు పెక్కండ్రఖిలదిశలఁ
బొదివియతనికరంబునఁ బొలుచుచక్ర, మలఁతితునియలుగా నేసి రాగ్రహమున.

వ. ఏసిన నతండు రయంబున. 117

క. గద గొని యశ్వత్థామం, గదియుడు దంభోళికోధమునకైపడి మెఱుఁగుల్
వొదలించుదానిఁ గని కడ, బెదరి యతఁడు రథము డిగ్గి పిఱిఁదికిఁ జనియెన్.

వ. సుభద్రాతనయుం డతనిరథ్యంబులను సారథినిం జదియ మోఁది మనజోదుల యమ్ముల నేదు వెఱిగిన చండంబున సౌబలుని దెసకు నడచి యాతనికి నడ్డపడిన గాంధారుల సప్తవింశతిరథికులం బొరిగొనుటయుం బురికొని తమ్ము మార్కొనిన వసాతీయులం బదుండ్ర నేనుంగులతోడన పీనుంగులఁ గావించి యందంద తఱిమిన కేకయసప్తకంబు రథసహితంబుగా నగ్గలిక నుగ్గు సేసి వస్సి తూఁగాడుచుఁ దొలంగినయోధుల నుల్లసం బాడుచు నఱిమినవారి నుఱుమాడుచు వీరవ్రతంబు ధీరత్వనిష్ఠం జలుపుచుండె. 119

ఉ. ఆసమయంబునం గడఁగి యాయితమైనరథంబుతోడ దౌ
శ్శాసని రా నతం డదరి సారథి జంపి హయంబులం బడం
ద్రేసిన నాతఁ డల్గి గద వేకొని యుద్ధతిఁ దేరు డిగ్గ ను
ద్భాసితమూర్తులం బొలిచె భ్రాతృకుమారయుగం బుదాత్తమై. 120

అభిమన్యుదుశ్శాసనసుతు లిరువురుఁ జచ్చుట.

తే. ఇవ్విధంబునఁ గడిసి నరేంద్రముఖ్య, నీదుమనుమలు నూవుఱ్ఱనెమ్మనముల
కద్భుతంబును శోకంబు నావహిల్ల, లావు వెరవును మెఱయఁ బ్రాలంబు నెఱయు.

ఉ. ఒండొరు [1]మీఱఁడికోపమున నుగ్రతఁ బోరి రుదగ్రులై గదల్
మండఁగ నెత్తురుల్ సెదర మాంసము పిండిగ నెంపనుగ్గు లౌం
డొంక ధరిత్రిపైఁ దొరఁగ నొప్పెకుమేనులు వ్రాల వానిలో
నుండక ప్రాణముల్ [2]వెడలె నుబ్బునఁ గ్రాలఁగ దేవకామినుల్. 122

వ. ఇత్తెఱంగున. 123

చ. వనగజ మంబుజాకర మువారణఁ జొచ్చి కలంచి యాడఁగా
మనమునఁ గొంకు లేక కృప మాలినబోయులు ముట్టి చంపుచా
డ్పున భవదీయసేనఁ బొరివుచ్చఁగఁ జుట్టును ముట్టి పార్థనం
దను నలయించి నిర్దయవిధంబునఁ జంపి రనేకసైనికుల్. 124

వ. అట్టియెడ. 125

సీ. జగము లన్నియును దేజంబున వెలిఁగించి, యపరాద్రి సేరినతపనుమాడ్కిఁ
దఱ చైనకానలు దరికొని నివ్వఱుగాఁ, జేసి యాఱినదవశిఖివిధమున
గగనంబుతో రాయు [3]కరడులు గలజలం, [4]బివురఁ బొఱినమహార్ణవముకరణి
నున్నతగతి సెడి యుర్విపైఁ గదు విన్న, నై పడి యున్నసుధాంశుభంగి

తే. బీరమునఁ దమవారికిఁ బెంపొనర్చి
యరుల సమయించి వన మెఱి యనువు దప్పి
తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁగగుచుఁ బొలిచె
మహితమూర్తిశోభితుఁ డభిమన్యుఁ డధిప. 126

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యెఱ్ఱనింగి తెఱంగుననుండె నక్కమూ
రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె సితాయుధఖండభూషణో
దాత్తమణిప్రతానములు తారలచందము నొంది యందమై
యత్తఱి నుల్లసిల్లె వసుధాధిప చూపఱపిండుచూడ్కికిన్. 127

సీ. కరికళేబరములు ధరణీధరములుఁ దు,రంగగాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములుఁ గౌక్షేయక,క్షురికాదిశస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రశిరములు రుచిరప్రవాళముల్, ప్రేవులపోగులు ఫేనతతులు
నెత్తురువెల్లువ నీరులు భూషణ,స్తోమాస్థిచయముల్ తుమురు లిసుక

ఆ. గాఁగ నంబురాశికరణి సంగ్రామభూ,భాగ మొప్పు మిగుల భవ్యయోగ
నిద్ర నున్నవిష్ణునికిఁ బాటి యగుచు శో,భిల్లె నమ్మురారియల్లుఁ డందు 128

వ. అబ్బాలుండు. 129

1. మీఱుకోపముల 2. వెడలె. 3. కరడులు_కడలులు. 4. బివిరి పొడఱినయర్ణవము.

తే. మహితలావణ్యమున సుకుమారమైన, యంగమును బూర్ణచంద్రనిభాననంబు
[1]గ్రొత్తపెంపునఁ దనరంగఁ [2]గొమరుమిగిలి. చెన్నొందలకట్టునవడిఁ ద్రెయ్యున్నఁ జూచి.

క. నీసైనికు లెంతయు సంతోసిల్లుచు నార్చి రపుడు దుఃఖితులై కుం
తీసుతులవారు దీనద, శాసంగతులై రి బాష్పజలములు దొరఁగన్. 131

క. నెఱి దప్పం బడి పెల్లుగ, నొఱలెడి సరివారి కెరఁగియుల యభిమన్యుం
డఱిముఱిఁ బడుటకు వగ మదిఁ, బఱిగొన నిల పెలుచ నడచుభంగిఁ జెలంగెన్.

వ. ఆసమయంబున. 133

క. పెక్కండ్రు గూడి యిమ్మెయి, నొక్కనిఁ జంపుట యధర్మ మోహో యని న
ల్దిక్కులను బెద్దయెలుఁగున, నక్కజముగ భూతసంచయంబులు వలికెన్. 134

వ. ఇట్లు శౌర్యసారసంపాదితరౌద్రుండైన సౌభద్రుండు పడుటయు వారిబలంబులు
విచ్చవడి భండనంబు దక్కి తొలఁగిన ధర్మపుత్త్రుండు ప్రబలయోధవీరలోకంబు
నాలోకించి యిట్లనియె. 135

సీ. పూర్వబలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి, రథరాజిఁ గలఁచి తురంగములను
ద్రుంచి పదాతులఁ దునుమాడి పెక్కండ్రు, సైనికప్రవరుల సమయఁ జూచి
మూఁకల విరియించి వీఁక నాచార్యాది, యోధుల నెల్లను నొక్కఁడ దనకు
వెలిచి వియచ్చరుల్ వినుతింప నాకంబు, చూఱ గొన్నట్టియర్జునతనూజుఁ

ఆ. జూచి మనకు నేల శోకింప వైరుల, గండడంచి గెలుపు గండ మచిత
భంగిఁ బ్రొద్దుకొలఁది పరికించి మనసైన్యపతుల మగలు మొలమి దలకొనంగ.

వ. అని పలికి పరవసంబు సేసి సేనలం బురికొల్పికొని యుపష్టంభవిజృంభితుండయి
నిలిచెఁ బదంపడి యరుణకిరణుం డపరమహీధరంబు మౌళికి సరసీరుహశేఖరంబై
చెలువారం దదనంతరంబ రిత్తచొట్లును నెత్తుటేర్లును జొత్తిల్లుచున్నట్లుండెఁ బిండుగట్టి
పిశాచనిశాచరులు నలిరేఁగి రక్తపానంబును మాంసఖాదనంబునుం జేయుచు
మోదంబునం బొందుచు నాడుచుం బాడుచుండు కలకలంబునను గుణప
భక్షణవ్యగ్రవిహంగసముదయతుములంబునను [3]బలలఖాదనసంరంభశివానివహ
కోలాహలంబునను బరమభీలం బైనసంధ్యాకాలంబు నిరూపించి నిజశిబిరంబు
లకు నుభయబలంబులుం బోయె నప్పుడు నీకొడుకు లుబ్బునం గొమరు మిగిలి
యరిగిరి కౌంతేయులు సిన్నఁబోవునాననంబులతో శోకసంతప్తచిత్తులయి చని
రివ్విధంబున ధర్మతనయుండు దనని కేతనంబున కరిగి యచట నిఖిలపరిజనంబులుం
దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులైయున్నసమయంబునం దమ్మౌని
దెసకూరిమి నారం గూరినవగ పెంపున ధైర్యంబు సొంపఱి వివర్ణవదనుం డగుచు
నిట్లనియె. 137

1. గ్రొత్త-పెనుపఁగ-పెంపున. 2. గొమరు-మిగుల-మిగలు. 3. బలలశబళసంరంభ.

—❀ అభిమన్యుమరణమునకు ధర్మరాజు దుఃఖించుట. ❀—

మ. గురుశారద్వతముఖ్యయోధపరిసంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మాసైన్యము దానిఁ జొచ్చి ననుఁ బ్రీతుం జేయఁగాఁ బూని యొ
క్కరుఁడుం గోవులలోను జొచ్చుబలుసింగంబుం బోల్కి నా పట్టు సొ
చ్చి రయంబు బార ననేకవీరశిరముల్ సెండాడె నుద్దండుఁడై. 138

క. ఈసును రోసముఁ గలడు, శ్మానము నొప్పించి పఱచి చతురంగములన్
గాసిలఁ జేయుచు నట్లుల్లాసముతో మెలఁగఁగాఁ దలంచె యొరులకున్. 139

తే. కొడుకుఁ బొడగాన కర్జునుఁ డడిగె నేని, వానితో నింక నేమనువాఁడ వారికి
నతనిగారాబుచెలియలి కధికదుఃఖ, మైన చేసితి [1]వగవంగ నేమి గలదు. 140

క. బాలుఁడు సుకుమారుఁడు నై, కాలమునకుఁ జొచ్చి యెఱుఁగఁడనక మొనసారం
బాలుఁడు పోడు మని పనిచితి, నేలా నన్నాన దోస మెఱుఁగఁగ నిచ్చున్.

క. కుడువను గట్టను బూయను, దొడువను బోఁ బనిచి కాక తొలుత మొనసారం
గొడుకుం బనుచుట యెవ్వాఁడుఁ, గడఁగునె నాయట్టిపాపకర్ముఁడు దక్కన్. 142

తే. వానితోడిద లోకమై యేను బోవ, నైతిఁ బోఁ గన్నఁ బుత్త్రశోకాతురత్వ
మున నితాంతవివర్ణతఁ బొందుచుండుఁ, జూడకుండెడివాఁడ నర్జును మొగంబు.

ఉ. వాసవునంతవానికిని వచ్చినయాపద దీర్పఁ గాలకే
యాసురులట్టిబల్పగఱ నైనను వ్రేల్మిడిఁ ద్రుంచు నాజి న
వ్వాసవి [2]యాత్మజుండు పగవారలచే హతుఁడైనదుర్దశం
జేసి యలంతఁ జెప్పఁగఁ జేసె విధాత్రని నేమి సెప్పుదున్. 144

చ. కొడుకు వధించి రన్నఁ గుఱుకోటిని నెట్టన యుల్గి రూపు మా
పెడున కడంకఁ బార్థుఁ [3]డెదఁ బేర్చినశోకము నార్పఁ జాలునే
పుడమిధనంబు నాకము విభూతియుఁ జేరినయేని నల్లన
వ్వెడునభిమన్యునెమ్మొగముఁ జేసె యగుంపాలను బోల నేర్చునే. 145

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించుచున్నసమయమునం గృష్ణద్వై
పాయనమునీంద్రుం డయ్యెడకు విజయంచేయుటయు నవ్విభుండు ప్రత్యుత్థానంబు
సేసి దండప్రణామం బాచరించి యాసనవిన్యాసప్రముఖపూజావిశేషంబుల
నారాధించి యమ్మహాత్మునితో ని ట్లనియె. 146

సీ. పరసేన భేదింపఁ బనిచితి నేను సౌభద్రుని వాఁడు నబ్బలము సొచ్చె
వెనుక నేమును జొచ్చ చనఁగ సైంధవుఁడు మ, మ్మాఁగినఁ దోడ్పడ ననువు దప్పె
నప్పుడు పెక్కండ్రు రథ్యాఁడి నవ్వీరుఁ, బొదివిన నాఱడిఁ బోయె నట్లు
సుకుమారమూర్తిఁ బుత్త్రకు నొంటిమైఁ బిన్న పాపని నలుగురపాలు వడఁగ

ఆ. బనిచి తాను బ్రదుకుపాపాత్ముఁ డెందును, గలఁడె విపులశోకజలధి మునిఁగి

1. వనరంగ. 2. నాత్మజుఁడు-కాత్మజుండు. 3. డది • పేర్చిన.

క. మునినాథునకు మృత్యుదేవతా ప్రభవం, బని యిందుకు శోకమునకు నది యెట్లొకొ త
జ్జననంబుం దత్ప్రభావము, వినఁ దలంచెద సుచితమేని వినిపింపు తగన్. 159

—✿ నారదుండు అకంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱింగించుట. ✿—

వ. అనిన విని యమ్మహాత్ముండు కరుణాయత్తచిత్తుండై యతనికి ట్లనుబంధుమరణ శోకం బుడుపం జాలెడుమృత్యుప్రకారకథ వినుట మేలు నీ వవధానపరుండ వై వినుము సెప్పెదం బ్రజాపతి ప్రజల సృజియించి పదంపడి సంహారంబు లేమిం జేసి భూమికిం దదీయభారంబు దుర్భరం బగుటయు ననుసంధించి చింతాక్రాంతుం డై తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటం బడిన నతనియింద్రియం బులవలన మహాజ్వాలనంబు జనియించి యెల్లదిక్కులం బరఁగి చరాచరాత్మకం బైనభూతవ్రాతంబు దహింపం గడంగుటయు భువనహితార్థంబుగా భవుండు సని కమలభవు శరణు సొచ్చినం బ్రజ్వరిల్లు చున్నయమ్మహానుభావుం డద్దేవు నాలో కించి యాదరభరితుం డై. 160

క. నీకోరిక యప్రతిహత, మేకార్యము గోరి వచ్చి తెఱిఁగింపు మమే
యాకార కామహర యది, సేకొని యాత్మణము యేను జేసెద ననుడున్. 161

ఆ. అభవుఁ డిట్టు లనియె నఖిలసృష్టిక్రియాకర్త వగుట నీవ కలుగఁ జేయఁ
గలిగిభూతకోటి యలమిఁ బొందఁగఁ గోప, మిత్రిరూపుమాపనేల యిపుడు.

వ. నాకుంగా లోకంబులం గరుణాలోకంబున నాదరింపు మనిన విని యంబుజాస నుండు నాయందుఁ గోపంబును గామంబును లేవు వినుము ప్రజాభారపీడితయైన భూమిదేవి దనడప్పి యెఱింగించినం దదీయహితంబు సేయుంబూని సంహారంబు గావించువాఁడ నై దానికి నుపాయంబు విచారించి యెద్దియుం గాన నైతి నది గారణంబుగా నన్నుఁ గ్రోధంబు వొందె ననవుడు భూతనాథుండు. 163

చ. అనఘవిచార నీ వరయ మున్నుఁ దగం గడు నిష్ఠ లోకపా
లన మొనరింతుఁగాన యునస్థలం బయి నీ దగునల్క లోకము
న్మను మిడి కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁ గృప వుట్టి చెప్పెదం
జనునె మహోగ్రకోపవివశత్వము నీకుఁ ద్రిలోకనాయకా. 164

వ. చరాచరంబు లన్నియు నొక్కపెట్ట భస్మీభూతంబులు సేయనేల ధరణీభారంబు వాయుటకై యుచితసంహారంబు గలుగునట్లుగ నొండుదెఱంగు దలంపుము కోపం బుపసంహరింపు మివ్వరంబు నా కొసంగు మనవుడు నిహతపావకశిఖుం డైనయాశంకరుపలుకులకు నతం డియ్యకొని తడంబిన నయ్యనలం బాఱుట యును భువనంబులు ప్రమోదంబు నొంది యాశంకరశతానందుల నభినందించె నట్లు క్రోధోపశమనం బాచరించునసమయంబున. 165

సీ. కమలాసనునియింద్రియముల రక్తాస్యయు, నసితాంగియును నరుణాంబరయును

నగునింతి జనియించి | యల్లన నగుచుఁ గెం,జాయ రంజిల్లులోచనము లలర
నాజగన్నాథుల | నలపోక వోలెఁ గ,న్గొని దక్షిణమునకుఁ | జన నజుండు [పఁ
మెలవుతో మృత్యువ | మృత్యువ యెటవోయె,ద్రావబుమూఱుసాంత్వనముతోఁ
తే. బిలిచి సంహారబుద్ధి నా | కొలయఁ బొడము, కనలునం దుద్భవించితి | గాననీవు
దొడరి వాసి లే కెల్ల జంతువుల సంహ,రింపు నాపంపునను నీకుఁ బెంపు గలుగు.
వ. అనిన విని మృత్యుదేవత దుఃఖిత యయినం గన్నీరు దొరంగ నయ్యశ్రుబిందువులు పద్మజుండు పాణిపుటంబులం బట్టి లోకహితార్థంబుగా ననేకభంగుల ననునయించిన నక్కాంత గాడ్పున నల్లాడుతీఁగ తెఱంగున జలించి యంజలి ఘటించి యవ్విరించి కిట్లనియె. 167
తే. నీవు సృజియించితివి నన్ను | దేవదేవ, యేను క్రూరకర్మమునకు నెట్టు లోర్తు
బంధుమరణశోకార్తులై పరవశప్రజలు,వివిధభంగుల మొఱలిడఁగ | వినఁగఁ జాల.
వ. ఈయధర్మంబునకు వెఱతు నీవు నామీఁదఁ గృప సేయు మిట్లు నన్నుం బనుపక తపశ్చరణంబునకుం బనుప వలయు నిక్కారణం బిమ్ము భవదాజ్ఞ వడసి ధేనుకాశ్రమంబునకుం జనియెద నని పలికినం బరమేష్ఠి యన్నీరజాక్షి నిరీక్షించి.
సీ. వినుఁ బ్రజాసంహారమునకు నైకల్పించి,నాఁడఁ గావుననీమనంబునందుఁ
బొడమువిచారంబు | నుడిగింపు మిట్లు గాఁ,గలయది యైనయక్కార్యమునకు
నన్యథాత్వం బేల | యగుఁ బ్రజాసంహరణము ననిందితసమయముగఁ జేయు
మీ వవశ్యంబును | నావుడుఁ గడు భయం,బున నప్పటికి నియ్యకొని మృగాక్షి
తే. నలువవదనంబు సూచుచు | నిలిచె నతఁడు
ప్రీతుఁడై లోకములఁ గృపఁ బెంపుతోడ
దృష్టిఁ గనుఁగొన నవి పరితుష్టిఁ బొందె
జంద్రమౌళియుఁ దనయిచ్చఁ | జనియెఁ బ్రీతి. 170
వ. మృత్యుదేవియుం బరమేష్ఠికిం బ్రణమిల్లి. 171
తే. అచటు వాసి రయంబున | నరిగి ధేను
కాశ్రమంబున నియమంబు | లాచరించి
నంద కౌశికి యనియెడునదులఁ బెక్కు
వ్రతము లొనరించి మఱియుఁ దీర్థముల నెల్ల. 172
వ. అద్దేవు నుద్దేశించి పెద్దకాలం బనేకవిధంబుల దుష్కరంబు లగుతపంబులు సేయుచుం బోయి హిమశైలశిఖరంబునసంయతాత్మయై యున్నఁ జతురాననుం డమ్మానినికిం బొడసూపి మృత్యువ నీ వత్యంతనిష్ఠురనియమంబు లేల యనుష్ఠించెద వనిన నయ్యంగన సమాధానంబున నున్న ప్రజల మొదలు నులిచి చంపం జాల నీవనికిం బంపకు మధర్మభయంబున నిన్నాశ్రయించెద నార్తనైన నాకు శరణంబ వగు మని ప్రణమిల్లిన నతం డిట్లనియె. 173

ఆ. ఇంతి నీ కధర్మ మేల యయ్యెడు నాడు, పనుపు సేయ నిన్నుఁ బరమధర్మ
మొందు విమలకీర్తియును జెందునట్లుగా, వరము లిత్తు మేను హరుఁడు నీకు.

వ. ఏ మనుసంధించినపనికి నీకు భయం బేల చతుర్విధభూతకోట్ల నుపసంహరింపు మనిన నత్తన్వి దేవా దేవరయాజ్ఞ దలమోచి చేయుదానం గాక యొక్క విన్నపం బవధరింపుము లోభంబును క్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింప వలయు నవ్వుడు నతం డట్ల యయ్యెడు మది యునుం గాక నీయశ్రుబిందువు లెన్ని యన్నియు రోగంబు లై జనంబులం జావం జేయంగలయవి దానం జేసి యధర్మంబు నిన్నుం బొరయ నేరదు ప్రాణి ప్రాణహరణంబు నీకుం బరమధర్మం బగు భవదీయశుభం బేను గోరెద నీవు ధర్మస్వరూపంబ వీవిశ్వంబునకు నీశ్వరి వట్లు గావునఁ బ్రాణసంయమనంబు భవదధీనంబు సర్వజీవులయెడం గామరోషంబు లుడిగి జీవంబుల నాకర్షింపుము తత్ప్రకారంబు ధర్మతత్త్వంబు నీకు భయం బేమి మిథ్యావర్తనుల నధర్మంబ సమయించుఁ బొమ్మనిన నమ్మానిని శాపభీతిని దన్ను నధర్మంబు వొందదనుమాటను దన్నియోగం బంగీకరించె నవ్విరించివచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహానిం జేయ నామృత్యుదేవత ప్రాణాపహారిణి యగుటం బ్రాణంబులు దేహంబులం బాసి దేవాదిభావంబులం బొందుచు మగుడ మనుష్యత్వంబు నొందుచుండు. 175

తే. భీమనాదుండు భీముఁ దుర్ద్దాముఁ డప్ర
తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డొడలు
మనుపఁ జెఱుపంగ నోడయుండు ననుట మగుడ
నరుగుదెంచుట వింత గా దతని కెందు. 176

క. నరు లమరు లగుదు రమరులు, నరు లగుదురు గాన నీదునందనునకు భూ
వర వగవ నేల యతనికిఁ, జిరవీరస్వర్గసుఖము సేకుఱి యుండున్. 177

క. అగణితదుఃఖాత్మక మి,జ్జగ మాతఁడు దీనిఁ దొఱఁగి సౌఖ్యాత్మక మై
వగ చెంతలఁ జేరని యా,జ్జగమునఁ బుణ్యాత్మపురుషసంగతి వడసెన్. 178

వ. నీకు వగవం బని లేదు బ్రహ్మకల్పితం బైనయీనిశ్చయంబు నిరూపించి ధీరులు దెగినవారలకు వగవ రని చెప్పిన నారదునకు నయ్యకంపనుం డిట్లనియె. 179

క. మునినాథ నీవు సెప్పఁగ, ననఘం బగునీసమంచితాఖ్యానం బే
విని గతశోకుఁడ నైతిని, మనము ప్రియం బందె నతిసమాధానమునన్. 180

వ. అనుచు వినతుం డగుటయు నమ్ముని దన దైవయశోకవనంబునకుం జనియె నని పలికి పారాశర్యుండు. 181

క. ఈయితిహాసం బాయువు, శ్రీయును నారోగ్యమును విశిష్టగుణంబుం
జేయు జనములకు జగతీ,నాయక వ్రాసినఁ బఠించినం దగ వినినన్. 182

వ. అభిమన్యుండును భండనంబునం బిఱుసనక శరశరాసనాదివివిధాయుధంబులం బరబలంబుల బకలువఱచి చిరవీరస్వర్గసౌఖ్యంబును బ్రఖ్యాతియుం బడసె నీకు నడలం బని లే దని చెప్పిన విని ధర్మతనయుండు దనమనంబున నుత్తమక్షత్త్రధర్మంబు తెఱం గెట్టిద యగుట దలపోసియు శూరులు పుణ్యలోకంబున సుఖంబుండుటయుం దెలిసియు నెవ్వగ విడిచి వెండియు వేదవ్యాసమునీశ్వరుతో ని ట్లనియె. 183

ఆ. ముని ప్రసిద్ధిఁ బొంది చనినభూపాలక,శ్రేష్ఠు లెవ్విధమునఁ జేసిరొక్కొ
క్రతువు లవ్విశిష్టసత్కర్మజాతముఁ దెలి,యంగఁ జెప్పి నన్ను నాదరింపు. 184

వ. అనిన విని యమ్మనుజపతితలంపు గనుంగొని కృష్ణద్వైపాయనుండు నీ వి ట్లడుగుట నీకొడుకు దొంటిమహారాజులఁ బుట్టినవాఁడు గావున నక్కుమారునకు వారలకుం బుణ్యగతితారతమ్యం బెట్టిదియో యని [1]యరయుట గానోపునని యూహించెద ననవుడు నతండు మీదివ్యచిత్తంబున నవధరించినదానిం గాదన నెట్లు వచ్చు నవ్వానిని విన వలతు నానతీయుండు. 185

చ. అనుటయు నమ్మునిప్రవరుఁ డాతని కి ట్లను నధ్వరప్రవ
ర్తనులుఁ దపఃప్రదీప్తులును దానసమగ్రు లుదాత్తశీలురుం
జనియెడునట్టిచోటు లొక[2]సంపదయే రణశూరకోటి క
ర్జునసుతుఁ డత్యుదాత్త మగునచ్చోట సుఖస్థితి నుండు భూవరా. 186

వ. అది య ట్లుండె మహాత్ములయినమహీపతులవరిష్ఠకర్మానుష్ఠానంబుల తెఱం గెఱుంగుట మేలు కాదె యంతలంతలు మానుసులు మడిసిరి గాని పుడమి నిత్యులై నిలువం బడ రది వినుటయు [3]నీమనోరోగశమనంబు సేయుం జెప్పెద నాకర్ణింపుము. 187

వేదవ్యాసమునీంద్రుడు ధర్మరాజునకు సువర్ణష్ఠీవిచరిత్రంబు సెప్పుట.

క. జనపాలక సృంజయుఁ డను,మనుజేంద్రుఁడు పుణ్యమూర్తి మహిమాస్పదుఁ డి
వ్వనధివలయములోనియు,వని నొక్కఁడ యేలు దుర్నివారస్ఫురణన్. 188

వ. సంతానార్థి యయి సంతతంబును భూసురపూజనంబులు సేయుచుండు నానరపతికి నారదుండు సఖుం డగుట నతనిపాలికిఁ బలుమాఱు నరుగుదెంచుచుండు నొక్కనాఁడు విప్రవరులతిప్రయత్నంబునం గూడికొని యమ్మునివరునితో నిమ్మహీపతికోర్కి దీర్ప వలదే యని చెప్పిన. 189

క. అతఁ డతనితోడ భవదీప్సిత మెయ్యది నాకు నేల చెప్ప వనుడు సం
చితగుణుఁడు రూపసియు నగు,సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా.

వ. అక్కుమారుండును మూత్రపురీషలాశ్రుస్వేదంబులు సువర్ణంబు లగునట్టివాఁడు గావలయు ననిన నమ్మహీపతికి నమ్మహాత్ముం డవ్వరం బిచ్చె నాసృంజ

1. యరయుటకుం గానోపు. 2. సంప్రతియే. 3. నీమనశ్శోకోపశమనంబు

యుండు నత్తేజస్సంతతనయుం బడసి సువర్ణష్ఠీవి యను పే రిడి ప్రియంబునం బెను
చుచు వాని వలనం గనకం బనుదినంబు నుత్తరోత్తరాభివృద్ధి యగుచుండ సమృద్ధి
నొంది శయనాసనసదన ప్రాకార ప్రభృతి సకలవస్తువులును గాంచనమయంబులు
గా వించికొని యసమానమహిమాసంపన్నంబునం బ్రకాశుం డై. 191

క. విలసిల్లుచు నుండఁగ మ్రుచ్చిలి పట్టి కుమారు నొరఁ ✽ జీర దుడిమి వెం
గలు లగుక్రూరులు గొందఱు, వెలువడఁ గొనిపోయి యొక్క ✽ విపినములోనన్.

ఆ. కనకపుఁ బ్రచ్చి యొడలు ✽ గలయంగఁ జల్లించి, పాపి పాపి చూచి ✽ పసిఁడి గాన
కచట శవము వైచి ✽ యరుగుచునుండి త, త్కర్మఫలముఁ దమ్ముఁ ✽ గలఁచుటయును.

వ. ఆపాపాత్ములు వనములోనం గలహించి యొండొరుల వధియించి యందఱు నధో
గతిం జెందిరి సృంజయుండును గొడుకుం గానక వెదకి తత్కళేబరంబు గని పర
లోకక్రియలు నిర్వర్తించి శోకంబునం బలవించుచున్న నన్నరేంద్రుకడకు
నారదుం డరుగుదెంచి యతనిచేత నర్చితుం డై. 194

క. జననాథ యిట్లు శోకంబునఁ గుందినఁ దనువు విడిచి ✽ పోదె యసుఖు న
చ్చినవారలు వత్తురె యే, ర్చిన జెలిమిం జేసి హితము ✽ సెప్పెద నీకున్. 195

— షోడశరాజచరిత్రము. —

వ. అవధానాయత్తం బగుచిత్తంబుతో విను మని యి ట్లనియె. 196

సీ. సంవర్తుఁ డను మహా ✽ సంయమి దేవతా, గురుతోడి యీసున ✽ నరుగుదెంచి
పూని యుపద్రష్ట ✽ యై నడపంగ హి, మాచలపార్శ్వంబు ✽ నందు శక్ర
వరుణప్రభృతు లైన ✽ సురలు మహామునీం, ద్రులును సహాయు లై ✽ మెలఁగుచుండ
శాలాప్రముఖభవ్య ✽ సాధనంబులు గన, కమయంబులుగ వస్త్ర ✽ కాంచనాజ్య

ఆ. దధిపయఃఫలాది ✽ తర్పణద్రవ్యస, మృద్ధి సకలజనులు ✽ మెచ్చఁ బెక్కు
లధ్వరములు సేసె ✽ నట్టిమరుత్తుండు, నిత్యపదవి నుండ ✽ నేర్చెనయ్య. 197

సీ. సన్మార్గమున రాజ్య ✽ సంపద నొంది భూ, సురపూజ లొనరించి ✽ సువ్రతముల
బృందారకులఁ బ్రీతిఁ ✽ బొందించెఁ దన కర్థిఁ, బర్జన్యుఁ డేఁటేటఁ ✽ బసిఁడివాన
కనకమయము లైన ✽ కర్కటఝషనక్ర, కూర్మచయముతోడఁ ✽ గురియుచుండ
నయ్యర్థ మెల్ల ధ ✽ నార్థుల కిచ్చుచు, గురుజాంగలంబునఁ ✽ బరమనిష్ఠ

ఆ. నశ్వమేధముఖము ✽ లైన రాజార్హయ, జ్ఞములు పెక్కు సేసె ✽ సకలజనులఁ
బొగడునట్టిపాట ✽ నెగడె సుహోత్రుఁ డ, వ్విభుఁడు దెగియె నన ✽ వినమె యధిప.

సీ. కాంచనాలంకార ✽ కాంతంబు లై రూఢి, కెక్కినగజములు ✽ పెక్కువేలు
జవసత్త్వరూపాది ✽ సకలగుణములఁ బెం, పెసఁగినహయము ల ✽ నేకలక్ష
లమలసువర్ణమ ✽ యము లగుకొమ్ములం, గొమరారుపసువులు ✽ కోటు లూర్జి
తాంగకవిలసద ✽ జావికంబు గణ, నాతీతములు గన్య ✽ లప్రమేయ

ఆ. లమితరత్నవిరచి ✽ తాభరణంబు ల, నల్పములు మహీసు ✽ రావళులకు

నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు సంగుఁ, డతఁడు నన్యలోకగతుఁడు గాఁడె.
సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దన, రథము చరింప సర్వాత్ము లనఁగ
వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ, బ్రజల నొప్పింపని పరమపుణ్య
కర్మంబునకు మెచ్చి గౌరవంబునఁ దన, కతిముదమున ఫాలాక్షుఁ డొసఁగ
నశ్వమేధములు జాహ్నవివహాంత శిష్టజనాకీర్ణములుగఁ బెక్కాచరించెఁ
ఆ. దారకములు వృష్టిధారలు లెక్కింప, వచ్చుఁ గాని యతని యిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు సన్నుతిపాత్రమా, శిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు.
సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి, పంపున నరిగిన పెంపుకలిమి
సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొనర్చి, నమర్త్యలోక పావనవిభూతి
త్రైలోక్యకంటకు దశముఖు బంధుయుక్తంబుగాఁ జంపిన కలితనమ్ర
బాలురమరణంబు వారిల్ల కుండంగఁ, జేసి యత్యంతచిత్రమహిమ
ఆ. గలిగి యశ్వమేధములు పదున్నగా నసె, కాధ్వరము లొనర్చి యఖిలజనులఁ
దల్లివోలె నరసి దశరథరాముండు, గాలవశత నొందెఁ గాదె యధిప. 201
సీ. పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ, నవని భాగీరథి యనఁగఁ బఱపి
శతక్రతు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి, యప్రతిహతముగ నశ్వమేధ
యాగంబు లొనరించునప్పుడు వేయువే, లపదంబులందుఁ గన్యల నలంకృ
తలఁ జేసి యునిచి రథంబురథంబున, కిభములు నూఱునూఱు[1] జేసి యేనుఁ
తే. గేనుఁగునకు గుఱ్ఱములు వేయేసి పాటి, హయము హయమునకట్లు గోచయము నర్చి
భూరిభూరియుతంబుగ భూసురులకు, నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె. 202
సీ. అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగు గంధర్వులు హృద్యవాదన మొనర్ప
నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు, నై వినోదింపంగ నమరగణము
బహువిధాలంకారభంగుల విన్నాణములు సూప దివ్యమునులు నుతింప
మనుజలోకం బెల్లఁ గనకాన్నవస్త్రభూ, షణదానములఁ దృప్తి సనఁగ నశ్వ
ఆ. మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని, శతతమాధ్వరమున నతఁడు హయము
నాసపడిన నిచ్చె నాదిలీపునిఁ జూపు, మా ధరిత్రి నిపుడు మనుజనాథ. 203
సీ. జనన మాదిగఁ బాకశాసనుకరమునఁ, బ్రభవించు నేయును బాలుఁ ద్రావి
ద్వాదశదినము లాతఁడు గారవింపంగ, [2]వర్ధిల్లి పండ్రెండుసంవత్సరముల
ప్రాయము నై రాజ్యసంప్రాప్తికి నేతెంచి, యర్కుని యుదయంబు నస్తమయము
నగుపట్టు పొలిమేర యైనమహాక్షేత్ర, మంతయు నొక్కండ యనుభవించి
ఆ. యన్నపర్వతముల నాజ్యనదుల విప్ర, భోజనము లొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ, డింద నిలిచెనే నరేంద్రముఖ్య.
సీ. అనిమిషాసురయుద్ధమున నసురావళి, సమయించి వర్ణాశ్రమముల నేర్ప

1. తేర్చి. 2 వర్ధించి

రించి భూమి యలంకరించె నగ్నిష్టోమ,హయమేధ వాజపేయాతిరాత్ర
పౌండరీకము లనఁ § బరఁగినయధ్వరం,బు లనేకములు సేసి § భూసురులకు
నఖిలభూములఁ గల§యర్థంబు లెల్లను, దన కని యేమియు § నునుప కిచ్చె
ఆ. శుక్రునల్లుఁ డనఁగ § శోభిల్లుతనయుండు, ధర్మతత్త్వ మార్జి§తముగ నియమ
నిష్ఠుఁ డై యయాతి § నెగడె శాశ్వతుఁ డయ్యు,నే నృపాల యమ్మ§హీశ్వరుండు.
సీ. ఓర్వక పెక్కండ్రు § నుర్వీశు లొక్కటఁ, బై నెత్తి వచ్చిన § భండనమున
వారిహేతిచ్ఛత్ర§వాహనధ్వజములు, నఱికిన నడునడు § నడఁకి వార
లభయంబు వేఁడిన § నందఱఁ గృపఁ గాచి, యేలె నీపెన్నేల § యెల్లఁ దాన
కొని యధ్వరములు పెక్కు§లొనర్చి వేడుకఁ, బాయసమ్ములు సపూ§పములు మోద
ఆ. కములు లోను గాఁగఁ § గలవంటకములు మ,హీసురావళులకుఁ § బ్రీతిఁ జేసి
దక్షిణలుగ మణివి§తానంబు లిచ్చిన,యంబరీషుఁ డేమి § యయ్యెఁ జెపుము 206
సీ. లక్షభార్యల నుపలాలించి యొక్కొక్క, వెలఁదికి వేవు§రు వేవు రాత్మ
జులుగాఁగఁబడిగొ§లలఘుమహార్తులఁ గాంచె,వారును దోర్బలో§జ్జ్వలులునార్య
చరితులు నై పేర్చి § తురగమేధంబు లం,దఱు బహుదక్షిణో§దాత్తభంగిఁ
జేయుచుఁ దినపంవు § సేసి వర్తింపంగఁ, దానును విశ్రు§తాధ్వరము లొప్పఁ
తే. బెంపు సొంపును సువ్ర§తసంపదయును
నిర్మలశ్రద్ధయును గర్మ§నిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి § నెగడె నతఁడు
వడయఁ జాలెనె యెన్నఁడుం § జెడనియొడలు. 207
సీ. అధికతపంబున § వగ్ని నారాధించి, ప్రత్యక్ష మగుటయు § బ్రహ్మచర్య
వృత్తంబుదమమును § వేదవిత్త్వము నహిం,సయుఁబాత్రదానంబు§శమమువరము
గాఁ గోరికొని వేది§శాస్థలి మణికన,కాత్మక యై ముప్ప§దాఱుయోజ
నముల దైర్ఘ్యము నంత § కమరువిస్తారంబుఁ, గలుగంగ నొనరించి § క్రతువుసేసి
తే. విప్రతతులకు దాని న§తిప్రియముగ
నిచ్చి తనపేర గయ నుతి § కెక్కె వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁ డై § నెగడె గయుఁడు
భూవరోత్తమ యతఁ డెందుఁ § బోయెఁ జెపుమ. 208
సీ. ఇరువది వేవురు § పరిణతపాచకు, లభ్యాగతులకును § నతిథులకును
బాటించి క్రొత్తగాఁ § బవలును రేలును, వలయునన్నము లిడి § వెలసెఁ బశువు
లర్థి నుత్తమగతి § కై తాము చనుదేర, విలసించు నమరులు § వేడ్కతోడఁ
బాడనూపి కడుపారఁ § గుడువ హవిర్భాగ,ములు పెట్టునిర్విఘ్న§మున మహోద్భ
తే. తముగ నొనరించె సత్త్రియా§గము దమత్స,వంబుగొనియాడ వచ్చిన§వార లెల్లఁ
ప్రకటపుణ్యాత్ముఁ డననొప్పె§రంతిదేవుఁ,డవ్విభునకును వలసె లో§కాంతరంబు.

సీ. శరభసింహవ్యాఘ్రసత్త్వచయంబుల, నేడిక లెట్లట్ల యెక్కియాడి
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున, దమియింపఁగా సర్వదమననామ
మిడిరె నమ్మునిపదంపడి మహారాజ్యపదస్థుఁడై కాళిందితటమునందు
భాగీరథీతీరభాగంబునను సరస్వతీసమీపంబున వాజిమేధ
తే. రాజసూయాదివివిధాధ్వరము లొనర్చి, కనకనిర్మితకరితురంగమరథంబు
లనవృశప్రీతి విప్రుల కొసఁగె భరతుఁ, డన్నరేంద్రచంద్రుండు నీకన్నవాఁడ.
సీ. మిట్టుఁ బల్లంబునై మెలఁగంగఁ దసరథ, ప్రముఖవాహనములఁ బఱప ననువు
గా నున్నమేదినిఁ గడు సమస్థలి గాఁగ, వెరవున నొనరించి విస్తృతముగఁ
దనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప, మైనయవ్వసుమతి నమరగణముఁ
బనిచి దోహదములు బహురత్నములుఁ బిదికించి జగంబుఁ బోషించెఁ బృథుఁడు
తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల, సకలధాత్రియు బ్రాహ్మణసమితి కిచ్చె
నమ్మహానుభావునకు ననతులయశము, గాక సుస్థిర మయ్యె నేకాయ మనఘ.
సీ. బ్రహ్మవిద్వేషంబు వరికించి కోపించి యుపధేయుఁడై సహస్రబాహుఁ
బరిమార్చి నృపతులఁ దరమిడి తునుమాడె, నిరువదియొక్కమా రెల్లచోట
నందఱియేలెడునన్నిభూములుఁ దాన, యేలె ధర్మోజ్జ్వలపాలనమున
రాజయోగ్యములు ధరాసురార్హంబులు, నగునధ్వరములు పెక్కాచరించెఁ
ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యనుపేరఁ, జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యుఁ
డినమె యమ్మహాత్ముఁడును బరిలోపవిభ్రాంతి గలిగె నేని బ్రదుక లేఁడు. 212
చ. నలుమడి నీకు నమ్మనుజనాయకు లేమిటఁ జూడ వచ్చినం
దలఁప భవత్సుతుండును సుదాత్తుఁడు వారలకంటె నెందునుం
గలయది దీని కేల యధికం బగు నెవ్వగ నింత నొవ్వ ని
త్తెలివి మనంబునం జొనుపు ధీరతసారత గూర్పు నేర్పునన్. 213
వ. అని నారదుండు. 214
ఆ. ఆయువును బుణ్యమును జిరశ్రీయుఁ జేయఁ, జాలు షోడశరాజన్యచరిత మిట్లు
సెప్ప నేర్పడఁగా విని సృంజయుండు, పాండవాగ్రజ యేమియుఁ బలుకకుండె
చ. పలుకక యున్నయద్ధరణిపాలుఁ గనుంగొని యమ్మునీంద్రుఁ డేఁ
దెలియఁగఁ జెప్పినంతయు నతిస్థిరమై భవదీయబుద్ధియం
దొలసెనొ బూదిలోనఁ గ్రమమొందఁగ వేల్చిన నేయివోలె ని
ష్ఫల మయి పోయెనో యనుడుఁ బ్రాంజలి యై తగ నాతఁ డిట్లనున్. 216
తే. పుత్రశోకాపహంబును బుణ్యతమము, నైనయాఖ్యానమున నాదుమానసంబు
కలఁక యంతయుఁ బాసె నికల్మషుండ, నైతి నీ దయఁ జేసి సంయమివరేణ్య.
వ. అనిన విని యత్తపోధనుండు ప్రీతుండై నీకెద్ది వలయు నడుగు మిచ్చెద ననుట
యు సృంజయుండు దేవా నీవు ప్రసన్నుండ వగుటం తకంటె మిక్కిలి వలయునది

యెయ్యది భవత్ప్రసాదభాజనంబు లయినవారికి దుర్లభంబు లగువస్తువులుం గలవే యనుటయు నమ్మునివరుండు 218

క. మ్రుచ్చులమూఢత్వమునం, జచ్చి నరకవాసమునకుఁ జనినతనయు నేఁ
దెచ్చెద మగుడఁగ నే నీ. కిచ్చెద వగ వుడుగు మింక నేనియు నధిపా. 219

వ. అని చెప్పిన. 220

క. దేవముని యిమ్మెయిం దగు,దీవన యిచ్చుటయు నరుగుదెంచె సువర్ణ
ష్ఠీవి గడు నద్భుతంబుగ, నావిభుఁడు ప్రమోదసంభృతాత్ముం డయ్యెన్. 221

వ. ఇవ్విధంబున నత్తపస్వి యిచ్చినయక్కుమారుని సృంజయుం డత్రుశితుఁగావించి వివాహంబొనరించి యతండు యాగంబులఁ ద్యాగంబుల భోగంబులం దనమనంబు నకుఁ బ్రియంబు సేయుచు సంతానవంతుండై సెగడిన నతం డక్కాలసంతోషం బునం బొదలె నిట్లు సువర్ణష్ఠీవి యశీతిశతాబ్దంబును నకృతవివాహుండును నయా గకర్తయు నత్యాగవిదితుండును నభోగభాగియు నసంతానవంతుండును నగున మెయింబున నమయుట కారణంబుగా నన్నారదుండు కారుణ్యంబునం గ్రమ్మఱ వానిం గలిగించె నది యట్లుండె నవ్విశేషంబు లన్నియు సంపన్నంబు లయి శౌర్యంబున శత్రులధైర్యంబు దూలించి మేలిమివడసి నాకలోకసౌఖ్యంబునం బొం దినవాసవపౌత్రునకు వగచుట వివేకంబు తెరవు గాదు విను మీలోకంబు దుఃఖ బహుళం బగుటయుఁ దపోదానాద్యనుష్ఠానంబుల మానవులు సురలోకసుఖంబు సాధింపం జూచుట సుప్రసిద్ధంబు గాదె నీవయ్యర్జుననందనుఁ డిట్టిపుణ్యపరులకుం బడయ నరిది యగుపదంబున నునికి దెలియుటకును భావనంబులైనపలువురు భూపతుల వృత్తాంతంబులు వినుటకును ఫలం బయినపరిజ్ఞానంబున సమాధానసు స్థిరుండ వై యుండుము పోయి వచ్చెద నని పలికి పారాశర్యుం డంతర్ధానంబు సే యుటయు ధర్మసూనుం డుపశమితశోకుం డయ్యె వివ్వచ్చుండు వచ్చినవానితో నే మనువాఁడ ననుతలంపు పుట్ట నూరకుండె నని సంజయుండు సెప్పుటయు.

తే. అతనితో ధృతరాష్ట్రుఁ డిట్లనియెఁ గ్రీడి, సంగరమున సంశప్తకసమితి నేమి
సేసెసుతువార్తయెవ్వరుసెప్పిరాతఁ,డట్లు దెగుటయెఱింగి యెట్లయ్యెఁ జెపుమ.

క. అనిన విని సూతసుతుఁ డి,ట్లనుఁ జేరడవులు దహించునవలముచందం
బున సంశప్తకసేనల, ననిమిషపతిసుతుఁడు దీవ్రుఁడై పొరివుచ్చెన్. 224

— ❀ అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట. ❀ —

వ. అట్లు మర్దించి మగుడునప్పుడు మాధవు నాలోకించి. 225

చ. కలయఁగ దుర్నిమిత్తములు గానఁగ నయ్యె మదీయచిత్తముం
గలఁగెడు మేను మ్రానుపడఁగాఁ దొడఁగెఁ గురుఁ డారయంగఁ గే
వలుఁడె నృపాలుఁ డేదెనకు వచ్చెనొ యన్న నతండు రాజుఁ డ
మ్ములుసుఖు లొందుమై నశుభమ్ముం గల దిప్డు దెలుంగ నయ్యెడున్. 226

వ. అని పలికి తదనంతరంబ యద్దామోదరధనంజయులు సంధ్యాసమయసముచిత
కరణీయంబు లాచరించి యరుగుదెంచి నిజశిబిరంబు సొత్తెంచి రది చిట్లినచిత్ర
రూపంబులు గలకుడ్యంబునుంబోలె నిష్ప్రకారు లైనజనులవలనం బాసతి
యున్నం దత్ప్రకారం బనుసంధించి యన్నరుండు నారాయణున కి ట్లనియె. 227
క. సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి - యరిగెద రది యే
మో నేఁడు వేణువీణా,గానస్వనములును వీటఁ - గలుగవు కృష్ణా. 228
క. ఈమేలు ప్రజ కొనర్చిన,యామహిమకు నెలవు గొంతియగ్రతనయుఁడో
భీముఁడొకొ తమ్ములఁగుఱ్ఱలొ,కొ హరి యెవ్వరొకొ తలఁపు - గొలఁదికి మీఱెన్.
ఆ. అలరుమొగముతోడ - నభిమన్యుఁ డేలొకో, యెదురు రాఁడు నాకు - నెట్టివార్త
చెవులు సోఁకునొక్కొ - చే వెట్టి కలఁచిన,భంగిఁ ద్రిప్పికొనఁ బొకడంగె మనసు.
క. పలుమాటల కిటు పలుమా,టలు పలుకనికృష్ణుతో నడలు మది మొలవం
బలుకుచు ధర్మసుతునివిడి,దల కరిగెను మోము వెల్లదనమునఁ గదురన్. 231
వ. ఇవ్విధంబున నరిగి యన్నరపతి బంధుమిత్త్రులును మాన్యరాజన్యులుం దానును
నొక్కయెడ నున్నం దత్ప్రదేశంబునకుం గేశవుండును దోడన చనం జని వా
రుమ్మలించి యునికియు వారలలోన సుభద్రానూనుం డేమియుం జూచి సవ్య
సాచి యడుగులు దొట్రువడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుంగొని
యెలుంగు రాల్పడ ని ట్లనియె. 232
క. ఆననములు వెలువెల్లం,గా నడ లొదవినది మీకుఁ - గానఁ [1]దడవ మీ
లో నభిమన్యుఁడు లేఁడే,మో నాకుం జెప్పఁ డేల - యూరక యుండన్. 233
క. ధనురాచార్యుఁడు దగఁ బ,న్నినపద్మవ్యూహ మొరులు - నేరరు చొర మం
చనుమానింపక తనిఁ జొరు, మనరు గదా మీ రుపాయ - మారసి వోవన్. 234
ఉ. అమ్మిన సొచ్చుచొప్పు దెలిసియున్ వినె నంతియ కాని యిమ్ములం
గ్రమ్మఱుభంగి వాఁడు వినఁ డాగానఁడు దీని నెఱుంగ కున్కిఁ బా
పమ్మునఁ బోయి మీరు సొరఁ - బంచిన నుక్కునఁ జొచ్చి యోధబృం
దమ్ములచేత వ్రగ్గఁడు గదా కురువీరులు సుట్టు ముట్టినన్. 235
మ. హరిమేనల్లుఁడు గొంతికూర్మిమనుమం - డస్మత్తనూజుండు సం
గరకేళీనిపుణుండు దివ్యశరశిక్షాశాలి యవ్వీరు నె
వ్వరొకో నేలకుఁ దెచ్చి రొక్కరునిచే - వాఁ డేల చిక్కుం బోరిం
బోరిఁ బెక్కండ్రురు విచ్చుచుం బొదువుచుం - బోరాట గ్లెం జుమీ. 236
క. గురులకు భక్తుఁ డుదారుఁడు, గరుణ గలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురం
ధరుఁడు [2]మొగమోడు నాసుర,వరపౌత్త్రుఁడు లేమి కోర్వ - వచ్చునె చెపుఁడా.
క. అన్నగుమోమును నత్తెలి,కన్నులు నవ్వొడఁదయురముఁ - గ న్నారంగాఁ

1. బడఁడు. 2. మొగ మోడు వే సుర,

గన్నను బ్రదుకుదుఁ గానక, యున్నను బ్రాణంబు లెట్లు ƒ లుండఁగ నేర్చున్.

సీ. హంసతూలికపాన్పుƒనందుఁ [1]బొందెడుమేను, కఠినంపునేలతోఁ ƒ గదిసె నేఁడు
గొడుగులనీడపై ƒనడరఁ జె న్నగుమోము, పొరిఁ బర్వుపెందూళి ƒ బ్రుంగె నేఁడు
లలనలు లీలమైఁ ƒ గొలువ నుండెడు భోగి, వఱళులలో నున్నƒవాఁడు నేఁడు
నానాజనములకు ƒ నాథుఁ డై శోభిల్లు,దొర యనాథత్వంబుఁ ƒ బొరసె నేఁడు

ఆ. వినయరతుఁడు హృదయƒవిదుఁడు సుభద్రగా, రాబుపట్టి సకలƒరాజు మాన
ధనుఁడు ద్విజరాజƒమనుమఁడు నాచెలి, కాఁడు ముద్దులాడు ƒ లేఁడు నేఁడు.

ఉ. అక్కట మందభాగ్యునకు ƒ నట్టిసనాథవరత్న మెవ్విధిన్
దక్కు విధాత నిర్దయుఁ డొƒహంబునుసే కడుమేలివస్తువుల్
పెక్కు దినంబు లుక్కి యరిƒబృందము పిల్చినఁ బోటుబంట నై
యక్కడ కేల పోయితి మƒహాగుణభూమణుఁ గోలుపోయితిన్. 240

వ. అనుచుఁ జదికిలంబడి ఫల్గునుండు. 241

ఉ. హా యను ధర్మరాజతనƒయా యను నన్నుఁ బాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁడు జనుƒనే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి నోవఁ దగƒవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రిƒయోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్. 242

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించి యుధిష్ఠిరునాననం బాలోకించి.

ఉ. పావని సేరి యుండఁడొ కొƒ పార్థతుఁ డచ్చట లేఁడె యెందుమైఁ
బోవఁగఁ బంచితే ద్రుపదుఁ ƒ బోరికి సాత్యకి రాక తక్కెనే
భూవర మత్స్యనాథుఁ డెట ƒ వోయెనొ డెప్పర మైన నీకునుం
గావఁగ రాక తక్కెనొ తెƒగం గత మేమి సుభద్రపట్టికిన్. 244

అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు సచ్చినవిధంబు నడుగుట.

క. పడుఁగాక యేమి పగఱం, గడిమి మెఱసి చంప నోంపఁ ƒ గనియెనె నృప నీ
కొడుకిట యట నూడక యొ,క్కుడుమగఁటిమి నుఱికి పేరు ƒ గొనియెనె పోరన్.

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి చింతించి, 246

చ. పలువురు సుట్టుముట్టికొని ƒ బాణకృపాణముఖాస్త్రశస్త్రసం
క్తులఁ గడు నొంపఁగాఁ దనకుఁ ƒ దోడ్పడువారలు లేక నా మదిం
[2]దలఁపఁడ యత్తఱిన్ రిపువƒధంబున కుద్యము తండ్రి యేను గొం
దలమునఁ బొంద కుండ నని ƒ తాఁ బలుమాఱును జీర కుండునే. 247

క. అక్కట తప్పఁ దలంచితి, నక్కొలఁదులవాఁడె కృష్ణƒనల్లుఁడు వీరా
స్త్రుక్కునె బాహాగర్వము, దక్కునె నాకొడుకు మిన్ను [3]దలపైఁ బడినన్. 248

ఆ. పిన్ననగవుతోడఁ ƒ జె న్నెసలారుసా, భద్రుమొగము నూడఁƒబడయ కున్న

1. బండెడుమేను. 2. దలఁప డే. 3. దన పైఁ బడినన్.

వాఁడ నామనంబు వ్రయ్యలై పోదిని, రాతఁ జేసినది యొక్కో తలంప. 249

క. పలువురు క్రూరత బాలునిఁ, జలముకొని వధించునపుడు శౌరిని సన్నుం
దలఁపరొకో మనముల వా,రలు దానికి [1]నేమి నీఁగ రా నెయ్యెడినో. 250

క. కటకట పేరినపెన్నె,త్తుట జొత్తిలి యున్నమేనితోఁ గొడుకు నేఁడ
కృటిఁ బడి యున్నాఁడో యు,చ్చాటు సూపెడునాడు లేఁడె సదా చెదవాసన్.

సీ. పడి యుండి వాఁ డిలఁ బొడిచినచందము, క్రియఁ దత్తలము వెలిఁగింపకున్నె
యే మని నాకోడలెల్ల బ్రేముడింతునో కో సుభద్ర పుత్త్రునిఁ జూడఁ బడక మగని-
బ౯ తురనిర్జించి మొగము పోటుబనొచ్చి, పొఁడనూపరాఁ దయ్యెఁ గొడుకునాకు
నడలునఁ దల్లడపడసీయెను ద్రౌపది, వంత మాన్పింప నెవ్వారికి నశమె

తే. యని యలంతమైఁ బలుమాట లాడుచుండి
తలఁచి మఱియును ధర్మనందనునియాన
నంబు వీక్షించి నిర్జరనాథతనయుఁ
డెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్లు లనియె. 252

వ. సంశప్తకసమితితోడం దమకించి పోరిపోరి కౌరవసైనికులకింహానాదంబులు వింటి
నప్పు డెలుంగెత్తి యాయుత్సాం డాడినమాటల నాక్రందించితి. 253

సీ. పెనఁగంగఁ జాలరు బీభత్సుతో మీరు, బాలుని నొక్కఁడుఁ బలువు రిట్లు
సంపితి రిది మీకు సంతోషకాలమే, యెత్తురు గా కార్య నేల చెవుడ
మాకికి నర్జునునకు నప్రియం బొనరించి, బ్రదుకంగ వచ్చునే భవ్యనకైన
నది యట్లు లుండె నీయఘికపాపముఫలం, బెట్లుచు జెలువక యేల తక్క-

ఆ. ననిమె నివ్విధమున నరిసేనయోధుల, వతఁడు వలుక వీనులార వినియుఁ
దెలియ నైతి వాసుదేవుండు [2]వినియెన, యని తలంచి వాసు[3]నంతగానక. 254

క. మనుజాధిప తగునమయం, బున నీ వెఱిఁగింపఁ గన్నుఁ బొరెవుచ్చనె వే
చనుదెంచి నీసుతుం బొది, వినమెడఁ దతూర్యరయోధవీరుల నెల్లన్. 255

క. అని పలికి మఱియుఁ గొడుకుం, బనవుచు శోకమున ముసుఁగుపెల్లునునిఁ దగం
దనకరములఁ బొమువుచు ని,ట్లను హరి చిత్తంబులోన నడలూనంగాన్. 256

చ. ఇటు దహనయ్య శోకులకు నెల్లను బోకడ యిట్ల కాదె యే
మిటికి నలందుర్ణ మొదలు మేకొని యాయుధజీవనంబు నూఁ
దుటయు నెఱుంగవే రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్త్రుఁ డె
కృటి దివిచూడక్కోల్ ప్రియమునకా కిది యప్రియ మేతలంపఁగాన్. 257

ఆ. ఎఱుఁగ వలయు దాని నెఱిఁగి కోవిదుఁ డగు, నట్టినీకు వగవ నగునె పార్థ
నీదువంత సూచి నీవార లందఱు, దీను లైరి వీరిఁ దేర్పవలదె. 258

వ. వీరలం జూచి తగుమాట లాడు మనిన నత్యంతశోకాక్రాంతస్వాంతుం డగుచు

---

1. నే మనంగ ♦ రాద; నేమి మెఱుఁగ ♦ రాద. 2. వినెనొనే. 3. నంత గొనన.

సుభద్రాకాంతుండు గద్గదకంఠంబుతోడం దోడంబుట్టువుల కి ట్లనియె. 259

చ. మనసిజమూర్తి యైన యభిమన్యుని మాటలు వీనులార నే
విన వలతుం దదీయస్మృతి వేడ్క నొనర్చినవారు గ్రక్కునం
జని తగ వానిఁ గాంచి సుఖసంగతి మైఁ జరియించునట్లుగా
ననిచెద నేటిపోరు దెలియం గలభంగి యు మీరు సెప్పుఁడా. 260

వ. అని పలికియును. 261

చ. అలవుఁ జలంబు శౌర్యమును శస్త్రమహత్త్వముఁ గల్గునిందఱుం
గలుగఁగ నెట్లు సచ్చు బలఘస్మరుచే నయినం బ్రచండదో
ర్బలవిభవాభిరాముఁడు సుభద్రసుతుం డిది యెన్నిభంగులం
దలఁచినఁ బోల దేమిటికి సతంబున నామన మిట్టు లయ్యెనో. 262

క. మిమ్మును పాంచాలురఁ గడు, నమ్మి చెడితి వానిరక్షణమ్మునఁ ప్రౌఢ
త్వ మిట్లు లేమి యెఱిఁగిన, నెమ్మెయిఁ గాచికొన నేరనే యబ్బాలున్. 263

క. రథవితతి వఱపి మీ రవి,రథముగఁ గవియంగ మిమ్ముఁ దాఁకి కలఁచి యే
రథికులు సమయించిరి యరి,మథనభుజావిభవు నక్కుమారోత్తమునిన్. 264

వ. అని యంతకంత కగ్గలించునమ్మలికంబునం గలంగి యంత నిలువక. 265

క. ఉక్కును శస్త్రబలము మీ, కెక్కుడియది సాల రైతి రిందఱు ననిన
య్యొక్కరుఁ గావఁగ మీ రీ,తక్కువ కోర్చితిరి మిమ్ముఁ దక్కన నేలా. 266

క. బలహీనులు సంగరభీ,తులు నగుమి మ్మెఱిఁగియెఱిఁగి తొలఁగి తనూజుం
దలపఁక యొంటి మెలఁగు వెం,గలి నగునను దూఱుకొందుఁ గా కేమందున్.

తే. మానిసులవోలె నున్నార లేను లేని
తఱి మహాగుణశాలి నాతనయుఁ గాచి
కొనఁ గడంగర సింగారములకుఁ గాక
మఱువులును గైదువులు మీకు మానమునకె. 268

వ. అని భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగువారం గ్రోధశోకంబులు
మనంబునఁ బెనంగొనం గన్నీరొలుక నూరకున్న నెల్లవారు నతనికి మాఱు
వలుకను దేఱి చూడను వెఱచి యుండి రప్పు డచ్యుతుం డొక్కరుండు నను
నయాలాపంబులం దేర్చుచుండం బాండవాగ్రజుండు కుపితాఖండలనిభుం డగు
నాసవ్యసాచితో సాంత్వనస్వరంబున ని ట్లనియె. 269

—•• ధర్మరా జర్జునున కభిమన్యుండు సచ్చినవిధంబు సెప్పుట. ••—

సీ. అనఘ సంశప్తకహననంబునకు నీవు, ననిన నొడ్డన మేర్పఱకొని కడంగి
నడచి ద్రోణునిఁ దలపడితి మప్పీరుమో, హార మేము సొరఁజాలమైతి మనఁగ
నేల తద్బాణార్చు లేర్చిన నక్కడఁ, దేఱి చూడను లేక త్రిప్పికొంటి
మమ్మొన భేదింప నభిమన్యుఁ డోపుఁ బో, మ్మని యొకతలఁపు నా కపుడు పుట్టె

ఆ. వానిఁ బిలిచి నీవు వాకిలిఁ బుచ్చు మఁ,దఱిమి మొగ్గరంబు దఱియఁజొచ్చు
దము వడిని భవత్ప్రథంబున నముడు నం,భోధి [1]సొచ్చు రత్నపాల్కిఁజొచ్చి. 270

క. నీయుపదేశముఁ దనచే,దోయిటఁ బలుపుఁ దోడు గాఁగ ద్రోణుఁ గడచి వే
పోయి మొనఁ జొచ్చి సైన్యము,పాయవడఁగఁ గలఁగఁ జెదరఁ బఱవఁగఁ జేసెన్.

క. కని కుంభజముఖ్యులు నా,నిన పోదుపఁగ నేమిః జొచ్చి నిరతిశయరయం
బున వానికిఁ దోడ్పుటకుఁ, జనఁ జన మూకడ్డపడియె సైంధవుఁడు వడిన్.

వ. అతండు రుద్రవరానుభావంబునం జేసి యక్షుద్రబలుం డగుట నే మతని మిగులం
జాలక చిక్కి తిమ్మాసౌభద్రుం జుట్టు ముట్టి గురుకర్ణకృతవర్మకృపగురుపుత్త్రాది
యోధవీరులు పెక్కండ్రు సిక్కువఱుపం జేవ సెడక వాఁడు బలంబు మెఱయఁ జ
లంబు నెఱయ నారాధేయప్రముఖులం బఱపియు బృహద్బలలక్ష్మణప్రభృతులగు
రాజుల రాజకుమారులఁ బలువురఁ జంపియు సొంపారెం బడంపడి పదాతియు గదా
పాణియునై రథాంగపాణియల్లుండు మాఁగాఁడుచుం బోరాడునెడ దుశ్శాసనతన
యుండు దాఁకి వానిచే విరథుండై తానును గద గొని పెనుచం దలపడియె న
త్తెఱంగున నైనగ హారణంబున వారిరువురుం బరస్పరనిహతులై పడి దివ్యాధంబున
నక్కుమారుండు దనతండ్రులకును మామలకును రూఢి యగురణక్రీడం గీర్తి
పరిస్ఫూర్తియు నాకలోకసుఖంబునుం జేకొనియె నని చెప్పుటయు. 273

క. తెల్లముగ సుతుపడుట విని, జల్లని డెందంబు సెదర సంధులు ప్రిదులం
దల్లడ మగ్గలమై మూ,ర్ఛిల్లె నరుఁడు బంధు లెల్లఁ జేష్టలు దక్కన్. 274

వ. ఇట్లు పరవశుండైనఁ గృష్ణయుధిష్ఠిరులు గరతలంబుల నెత్తి నొక్కింత సేపునకు
సేద దేఱి సైంధవుం దలంచి యతండు. 275

ఆ. అవుడు గఱచి యెఱ్ఱనగు నాననంబుతోఁ,బొమలు ముడిచి చెమట వొడమ మేను
కంప మొందఁ గనలు గదిరినకటికిన, వ్వానక మొనఁగ నన్న కిట్టు లనియె.

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురా
జు నపక్యంబును నెల్లి సంపుదు భయత్రస్తుండై నినుం జొచ్చినన్
వనజాక్షున్ శరణంబు వేఁడినను గర్వాంబేది నన్నుం దగం
గనినం బోరు దొఱంగి పోయిన నెఱుంగం గాని సత్యవ్రతా. 277

క. బాలధ్వంసకు నాదు,శ్శీలుం గాచుటకు నన్నుఁ జెనకిన నత్త్ర
జ్వాలలఁ గౌరవయోధులఁ,దూలించుచు వానిఁ గవియుదుం బటులగతిన్. 278

ఆ. ఇట్లు సేయనైతినేని గురుద్రోహి,గతికి బ్రహ్మఘాతిగతికి మద్య
పానరతునిగతికి మానార్హ్యజనవర,వాదిగతికిఁ బోవు వాఁడ నధిప. 279

వ. మఱియు నొక్కప్రతిన యవధరింపుము. 280

చ. అనిమిషదైత్యకింపురుషు లాదిగ నెవ్వరు వచ్చి కాచినం

1. 'సొమ్ముగరుపొల్కి' అని మూఁ వ్రాఁతప్రతులు.

శా. ఆగ్నేయాస్త్రము ద్రోణుఁ డేసిన సముద్యజ్జ్వాలికాభీలికా
దిగ్దగ్ధం బయ్యె నభంబు వారుణశరావిర్భావనుం జేసెఁ గ్రో
ధాగ్నిస్ఫూర్తి వెలుంగ నాతనివరుం డబ్బాణముల్ వ్రాసని
ర్విఘ్నవ్యూహచరంబులై తొడరి పోరం జొచ్చె నొండొంటితోన్. 138

క. ఘోరంబు గాఁగ హాహా,కారము సెలఁగంగ బలయుగంబును దయ్యం
బోరి పెడఁబాసి శాంతము, లై రెండును నిలిచె నస్త్రహోత్రము లధిపా. 139

వ. ఆసమయంబున ధర్మజభీమనకులసహదేవులు కైకేయపుత్రకు బాసట యై తఱిమిన ధృష్టద్యుమ్నప్రముఖరథికవరులుం దలకడచి భారద్వాజుం డాఁకఁటయు దుశ్శాసనుండును నిల్చికొని మనదిక్కు రాజకుమారవర్గంబు వారలతోఁ దలపడిన నుభయబలంబులుం బురికొని యోహాహరిసాహారిం బెనంగు చుండె నప్పు డక్కడ. 140

క. నరుఁడు దన తేరు వోయెడు, తెరువున నైనంత సేనఁ దివ్యాస్త్రములన్
ఘోరఁ గూల్పంగ నయ్యెడ న,య్యరదముఁ గృష్ణుండు వడువుగఁ బఱపుచు నుండెన్.

వ. ఇవ్విధంబున రౌద్రరసంబు దలకొత్త దర్పంబున సైంధవుం డున్నదిక్కునకుం బోవం బోవ. 142

విందానువిందు లర్జునుచేత మృతిఁ బొందుట.

క. విందానువిందు లేక,స్యందనగతు లై కడంగి సైన్యంబులుఁ దా
రుం దెప్పదెరల నాసం,క్రందననందనునిమీఁదఁ గవిసిరి గడిమిన్. 143

వ. ఇట్లవంతీశ్వరు లురవడించి. 144

చ. హరులపయిన్ మురారిపయి నాతనిమేనను బాణవర్షముల్
గురిసి రతండు వారి నతిఘోరశరంబుల నొంప ధీరతం
దెరలక వారుఁ దద్రథముఁ దేల్చిరి తూపులవెల్లి నల్గియ
య్యురుపురవిందులుం దునిమి యేపున నూఁకలపెల్లగించుచున్. 145

క. తోడన కడువేగంబునఁ, గ్రీడి తురంగముల సూతుఁ గేతనమును మ
న్నాశించ[1] విందునితల యిలపై డొల్లఁగ నేసెఁ దీవ్రభల్లప్రహతిన్. 146

వ. ఇట్లు దల దునుముటయు బలుగాలిం[2]గూలు లతరువుపోలికిం బడినయగ్రజు నాలోకించి యనువిందుం డలుకయు నుమ్మలికంబు నుల్లంబునం బెనఁగొనఁ గద గొని సంరంభంబున. 147

చ. అరదము డిగ్గి తీవ్రగమనాతిశయంబునఁ గిట్టి బాహువి
స్ఫురణ దలిర్ప దానవనిషూదనుఫాలము వ్రేసి మూర్ఛ ను
ద్ధురరభసం బెలర్ప గదఁ ద్రుంచి పదంబులు బాహుశాఖలున్
శిరమును ద్రుంచి వాని బలిఁ జేసె ధనంజయుఁ డాజిభూమికిన్. 148

ఆ. దొరలు వడిన సేనఁ దూలక యుబ్బిరుఁ, జుట్టుముట్టుటయును బెట్టుగవియ

1. నున్నంత సేన. 2. దూలుతరువు.

కాలుచిచ్చు దలపోయఁగ[1] గాసిల నీఱుగఁ, జేయుపగిదిఁ దోఁపఁ । జేసె నతఁడు.

వ. ఇవ్విధంబున. 150

సీ. అచ్చోటు గదలి విశ్వప్రచ్ఛుండు సనఁజన, నతనిమైవాఁడును । హయచయంబు
దప్పిఁదము నతనికి । నప్పుడు సైంధవుఁ, డున్నెడ దూర మై । యుండుటయును
గని సంతసము నొంది । కౌరవయోధులు, సింహనాదంబులు । సేసి తఱుము
సారథికోత్తముం । డచ్యుతుఁ జూచి రథ్యాశ్వముల మేనుల । నలుఁగు లుండ

తే. నురవడింపవు విరిఁ । ననకు గొనక
వీని నిప్పుడ యమ్ములు । విడిచి తడవు
మనుడుఁ నతఁ డిది వోలున । యనుఁడు దేవ
డిగ్గి సారించెఁ గ్రీడి గాండీవగుణంబు 151

చ. ఎడ గని యుబ్బలంబు గదు । నేత్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రము
ల్గడువడిఁ గుప్పఁగూరగఁ జక్రలంబునఁ బైఁ దొరఁగింప నేచి క
వ్వడి వివిధోజ్జ్వలాస్త్రముల । నాని వెసన్ మడిఁచి తాఁకు పె
ల్లడరఁగఁ జేసె మింటికలయంత శుభ: [2]జట్టులు గట్టుమంటలన్. 152

వ. ఇత్తెఱంగున. 153

క. లావును వెరవును మెఱయఁగ, నీవిరులు పాండుపుత్త్రుని బొదివినచో
నావీరునియక్కజ మగు,లావు వెరవుఁ గరతలామలక మై తోఁచెన్. 154

వ. అట్టియెడఁ జతురంగంబులు. 155

క. నొచ్చినఁ జచ్చినఁ దెరలిన, విచ్చిన నయ్యెడ నూచి । విసువక పైపైఁ
జొచ్చినఁ గడుఁ గ్రిక్కిఱిసిన, నచ్చట మనసేనలోన । నార్పులు వెసలెన్. 156

వ. అఫల్గునుండు పాదచారి యై యునికిం దేఁకువ సెడియును గెలుపున కాసపడి యును నిట్లు గ్రమ్మిన కౌరవసైన్యంబు పొంగినసముద్రంబుపోలిక యగుటకుం దగినతరంగంబులచందంబున నిగుడుశరపరంపరలవలనను ఘోషంబు చాడ్పునం జెలంగుతూర్యనాదంబులవలనను వివిధసత్త్వంబులవిధంబున నుల్లసిల్లుమాతంగతురంగసుభటస్యందనసందోహంబులవలనను జలియింపక చెలియలికట్టయుం బోలె నవి నిలువరించి యవ్విక్రమకుతూహలి విజృంభించిన. 157

సీ. పటుభల్లనికరంబు । పరఁగినఁ బఱియ లై, యుఱవఱ లయ్యెడుస్యందనములును
నానార్ధచంద్రబాణవ్రాత మడరినఁ, దునియ లై మేదినిఁ । దొరఁగుకరులు
శాతనారాచపుంజంబులు నిగిడినఁ, గుములై కూలెడుఘోటకములు
వివిధాస్త్రతతులు వర్షించినఁ గండ లై వడఁ, దఱిగిన ఖ్లుంఠితపదాతిచయము

తే. నగుచు బీభత్సరౌద్ర[3]మయహాద్భుతములు

---

1. గాన నీఱుగఁ జేయుపగిదిఁ దోఁపఁ జేసె ♦ నిగిడె నతఁడు. 2. జట్టలు-జావలు _ గట్టమంటలన్. 3. భయానకములు.

మూర్తిమంతంబులుగ మనసు మొనలు రక్త
మాంసమేదోస్థిమస్తిష్కమయతఁ జూడ
ఘోరరూపంబులై [1]పరిక్షోభ మొందె. 158

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుఁగొని నవ్వుచున్న కవ్వడిం గనుంగొని కమల
నాభుం డను. 159

క. పెటిలితి నలుఁగులు మేనులు, నెఱిఁ బడ నెల్లెడలఁ గలయ నివిరితి హారులి
త్తఱి నీళులు ద్రావక తెప్పిఱ వెట్లోకొ శత్రుసైన్యభీకరమూర్తీ. 160

క. వెన్న మనుఁగఁ దివియఁగ లేఁ, కన్నను ద్రావఁ దగునీళు లాదవినహయముల్
నిన్ను గెలిపించు నవవృషుఁ, గన్నుల నగి యజ్ఞునంకఁ గల వివె యనుచున్.

మ. ధర దివ్యాస్త్రమహతిం బగిల్చి కొల నుత్పాదించి వేడ్కానికి
స్సరజాలంబుల రెల్లు గట్టు మనసైన్యంబుల్ వెఱం బొందె న
చ్చెరు వందెఁ సురసంఘముల్ హరి నుతింగాంచెం బొంగి యుప్పొస్థ భూ
వర మున్నిట్టివి సూడరుఁ విసరు నెవ్వారుం ద్రిలోకంబులన్. 162

తే. హర్ష మందస్మితముతోడ నమ్మురారి
యవుడ హయముల మొయి వెట్టునట్లు సేసి
[2]తటిమి నీళులు ద్రావించి తడవి మగుడఁ
దెచ్చె మనయోధు లెల్లను బిచ్చలింప. 163

వ. ఇట్లు సేద దేర్చి. 164

క. మును దివ్యాస్త్రబలంబున, జనియించిననీరితోన సంభూతంబై
రొయునరినఖాణము మేపెన్, [3]దనివ్వ నసం దురగములకు దర్ప మెలర్పన్. 165

వ. మేపి కట్టాయితం బయి మనమూఁకలనడుమం బఱంతులపిండులోనం గ్రాలెడు
విలాసియుంబోలె విలసిల్లుచు నమ్మహానీయరథ్యంబులం బూన్చినఁ బాండవ
మధ్యముం డారథం బల్లన మొక్కనాలిడవున దుర్యోధనుం డనతిదూరవర్తియై
వారలం గని వేగంబున వచ్చుచుండె వార లక్కడఁ జూడ రయ్యవసరంబున
నచ్చటిభూవల్లభు లెల్ల వెల్లనైన మొగంబులతోడ వెఱఁ గంది డెందంబులు
గుందుచుండం దమలో నిట్లనిరి. 166

మ. చతురంగంబులఁ ద్రొక్కిపెట్ట వివిధాస్త్రజ్వాలలం గప్పఁగా
నతివేగంబున [4]మ్రింగెఁ గ్రోలె ఘనమార్గయుక్ రూ పడంగించె నా
నితఁ డన్నింటిని రిత్త పుచ్చుచు మదం బేపార నిర్మూ రణ
క్షితియుం బీనుఁగుఁ పెంటఁ జేసెఁ జెనయం జిట్టాడఁగా శక్యమే. 167

సీ. కురుసేనపైఁ బడ్డ సరకు సేయక మంచు, విరియించుభానునిక్రమెరవు మెఱసి
యిది నడుగల నని యించుక గొంకక, తనఘోటకంబులఁ దడవఁ బనివి

1. భయక్షోభ. 2. ఖడఁగి. 3. దనిభ్రుగ నతురగ. 4. మ్రింగఁగ్రోలి.

కోల నక్కజంబుగ నలుఁగుల మొన ఘటించి యుమ్మల దాని కిల్లు గట్టి
సారథి లీల నశ్వములకార్యము దీర్చ, నంతకు నవ్వుచు నవుల నిలిచి

ఆ. గారవమునఁ దాను గానివాఁడును బోలె, నరద మెక్కి నింక నడ్డపడఁగ
నలవియే పురారి కైనను వీనిచేఁ, జచ్చువాఁడు గాక సైంధవుండు. 168

వ. అనుచు నీయోధవీరు లందఱును బెండువడి యుండిరి గాని యందు నొకం డేని యు నక్కున మాఱొక్కనువాఁడు లేఁడయ్యె నట్లు గోపాలదేవుండును గ్రీడియు బాలక్రీడావిధంబుగా విహరించి యనాయాసగమనవిలాసంబు మెఱయం జనిచని ప్రొద్దు వాలుట గనుంగొని పాంచజన్యదేవదత్తంబు లొత్తి రయంబు గైకొని యరిగి రాచక్కటిం గొండఱు నరపతు లొండొరులం బురికొల్పికొని యడ్డపడి [1]తప్పులు వెట్టి బెట్టు పెనంగి సముద్రంబు సొచ్చిన యేఱులం బోలె నడంగి రట్లు సైన్యంబు గడచి బలితంపువల ద్రచ్చికొని వెలువడినమహామత్స్యంబులును రాహుముఖంబు వెడలిన చంద్రార్కులుం బోలెఁ బొలిచి యట వోవు చుండ నయ్యెడ సైనికులు సింధురాజుపని సాలించి తొలంగిరి త్రెఱంగున దుస్తరంబులగు బహుళబలంబుల నిస్తరించి యయ్యిరువురుం దల లెత్తిచూచి తమలో ని ట్లనిరి.

ఆ. వీఁడె సైంధవుండు వీనిచుట్లను కృప, శల్య గురుతనూజ సోమదత్తి
కర్ణ కర్ణసుతులు గావలి యున్నారు, పోటుమగలు గాన పూఁచి పట్టి. 170

వ. అని పలికి వారలలో నాజయద్రథుం దవ్వుక చూచి వెండియు. 171

క. ఏ రేమి గ చెదరు తా, నేరూపున బ్రదుకు వీర లేల సురలు జా
భారియుఁ గాచినఁ దన్నును, బాఁటినఁదరి కాక నింగిఁ బడ నిచ్చెదమే. 172

క. అను పలుకులు నీయోధులుఁ, దనయులు విను చుండ ఘోరతరదుర్గము లె
ల్లను గడచి లాభదేశము, ననఁ జొచ్చినవణిజులట్ల సమ్మదలీలన్. 173

వ. ఒప్పినయప్పురుషసత్తములం గనుంగొని యారథికజనంబులు విస్మయంబునం దమలో ని ట్లనిరి. 174

తే. పెక్కునదు లీఁది వెడలుట పేర్చుదావ,శిఖలు గడచుట వారణాశీవిషముల
బారి దప్పుట గాదె కుంభజముఖోగ్ర,శూరయోధుల మిగిలి వచ్చుట దలంప.

వ. అనుచు నాకృష్ణుల నుపలక్షించి. 176

క. గురుముఖబహురథికశరో,త్కరములచే నైనక్రొత్తగంట్లను సుమనో
భరితనవకర్ణికార,స్ఫురితాచలయుగముభంగిఁ బొలిచిరి చూడన్. 177

క. అని యుగ్గించుచు సింధువి,భునిదెస విగతాశు లైరి భూవల్లభ యు
వ్వనజాక్షు లెఱ్ఱసెర లొ,ప్ప నతని వీక్షించి యార్చి పరవశ మలరన్. 178

— కవచధారణంబున దుర్యోధనుం డర్జునుతోఁ దలపడుట. —

వ. కడంగి రంతఁ గురుపతి గూడ వచ్చి కుంభసంభవకృతం బగుకవచంబుకతంబున

1. తప్పులువడ_తడవు పెనఁగి.

త్రములం దర నార్చి నిజశం, ఖము లొత్తిరి శార్ఙ్గధరుఁడు గాండీవధరుఁడున్. 191

చ. ఎలమిఁ జెలంగు కృష్ణులయహీనసమృద్ధిఁ జూచి శోకవి
హ్వలు లయి మానవేంద్రు లెడ నాసలు మానిమృగంబు భ్రాంతి ను
జ్జ్వలదవలంబులో నఁ జుఱుకుచందముగాఁ గొని నీదు యోధవీ
రు లకట చచ్చెఁ జచ్చెనని మ్రోయఁగ నాతఁడు వారి కిట్లనున్. 192

క. భయ మేటికి వినుఁడు ధనం, జయునిం గేశవుని నాదు శరకీలాసం
చయమున నేర్చెదఁ జేర్చెద, నయనానందంబు మీకొనర్చెదఁ గడిమిన్. 193

వ. అని పలికి పార్థుం గనుంగొని యవష్టంభంబున. 194

—దుర్యోధనుఁ డర్జునుం దలపడి యధిక్షేపించుట.—

చ. వినుము కిరీటి దివ్యశరవేదివి నాఁ జను దేను శేనిచో
టను మును సెల్లె నీకు నిచటం జన నిత్తునె యిప్డు నీబలం
బును వారి నేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి నీవు పాండురా
జునకు జనించితేనిఁ దగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్. 195

వ. అనుచుఁ గ్రూరంబు లగు మూఁడు నారాచంబుల నన్నరు నేసి శరచతుష్టయం
బున హయంబుల నొప్పించి పదిబాణంబులు పద్మనాభునురంబునం గ్రుచ్చి
మునికోల యొక్కకోలం దునిమిన గినిసి క్రీడి యాతనిపైఁ జతుర్దశనిశిత
ప్రదరంబులు వరఁగించిన నవి యమ్మహీపతి మైమఱువు దాఁకి మిట్టిపడుటయుం
జూచి తొమ్మిదిదూపులతోడఁ బంచాశుగంబులు నిగిడించిన నవియు నిష్ఫలంబు
లగుటయు నిరువదెనిమిదిబాణంబు లడరించెన వ్వాలమ్ములు నమ్మయిన వమ్మైన
విషాదంబున వాసుదేవుండు వాసవి కిట్లనియె. 196

క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది గా దమ్ము లెడలె గాండీవము లా
వు నీభుజములశక్తియు, మిన్నక పోఁ జిత్ర మిది యమిత్రధ్వంసీ 197

ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు నాకర్షణ, గాఢతయును బాణగతియుఁ దొంటి
యట్లొ యొండుభంగి వైనె తోఁచెనో నాకు, నున్నరూపు సెప్పవన్న పార్థ. 198

చ. పిడుగులయట్లు తాఁకి రిపుబృందములం దెగటార్చు నాజి నె
వ్వాడు భవదీయదివ్యశరపుంజము [1]లొక్కట నిప్డు పొల్లు వో
యెడు నిది నీవు నిమ్మతివిహీనపుజంతువు నేమి సేట్లకుం
జెడుటకు నొక్క విస్మయము సెందెదు డెంద మలంతఁ బొందెడున్. 199

వ. అని యిట్లు దన్ను నిందించుకొనుచు గోవిందుం డడిగినం బురందరనందనుం
డతని కిట్లనియె నిది యొక్కకవచధారణంబు మున్ను ద్రోణుఁ డొక్కరుండ
యెఱుంగుఁ బదంపడి నాకు నెఱింగించె నిప్పుడు సుయోధనుండును నెఱుంగు
తెఱంగు గావించెం గావలయు నిమ్మయి మైమఱువు త్రిలోకంబుల కభేద్యంబగుట

1. లక్కట యిప్డు.

వ. ఇత్తెఱంగున. 212

క. మును సంకటపడి సూర్యతేజుఁ, గనుఁగొని మెచ్చుటకుఁ బిదప × గాండీవి మొఱసెం
బొనుఁగువడి యుండి తను గాంచిన పుంఖముఖానలంబు పొల్చెం బృథివీశా. 313

వ. అయ్యవసరంబున సింధురాజరక్షణం బైనసబలంబు సంక్షోభసహితం బగుటయుఁ గౌ
రవాంబునం బొదలి శంఖభేరీపణవాదిక్వాణనమేదురసింహనాదభరితరోదసీకుహరం
బయ్యె నచ్చిడమునిపనుట నవలోకించి. 214

క. మందస్మితసుందరవద, నేందు లగుచు హరియు నరుఁడు × నెత్తైఱఁ బ్రియముల్
డెందములం బొంద భవన్నందనుపై నరవడింపిస్రం గని కెడఁకన్. 215

— వృషసేనుండు లోనగుసేనముఖ్యులు రథికు లొక్కపెట్ట యుద్ధముపైఁ గవియుట. —

క. వారలఁ బొదువ నడచుబలా, తేరులు నొయ్యన తత్కురు × దీప్తకటురథా
టారు లగుచు సేనమునుస్ఫీయులు వడిమిరి నితాంతవేగోజ్జ్వలు లై. 216

వ. వా రెవ్వ రెవ్వ రంటేని. 217

క. దండిమగ లైనవృషసే, నుండును శల్యుండు సైంధవుండును గృపుఁడును క
ర్ణుండు గురునందనుండు శల్యుండును భూరిశ్రవుఁడు × నుర్వీనాథా. 218

వ. అందఱు నొక్కమొగం బై. 219

క. తన దైనప్రతిన నెఱవుటకును ముఖ్యోపాయ మది యగుట నట్లు సుయో
ధనుఁ బరిమార్పఁ గడఁగుఫల్గునుఁ దలపడి రాత్మశంఖఘోషంబులతోన్.

క. అట్టియెడ దేవదత్తము, బట్టొత్తె నరుండు పెక్కువిడుగులుబ్రాంతక్
బెట్టు వఱచుతన్నినదము, పుట్టించెను దిగులు నీదుసేనకుసేసన్. 231

తే. చెవులు బీఁటలువాఱంగఁ × జెలఁగునమ్మ, హారవమ్మున కులుకక × యతనిమీఁద
విభుఁడుఁ గర్ణాదులును శరవృష్టి గురిసి, రడరి సైంధవుదిక్కున × కడ్డపడుచు.

వ. ఆసమయంబున నశ్వత్థామ యుబ్బిడెబ్బదిమూఁడుమార్గణంబుల మురవైరిని భల్ల
త్రయంబునం బార్థుని నైదుశరంబులం దురంగంబులం గేతువు నేసిన నవ్వాసవి
యతని నూఱింటను గర్ణుని బదింటను వృషసేనుని మూఁటను నొప్పించి
యొక్కక త్రివాతియమ్మున శల్యుచాపంబు ముష్టికిం ద్రుంచిన. 223

సీ. వేగంబ వేఱొక్కవిలు గొని మద్రేశుఁ, డతనిపైఁ దొమ్మిదియమ్ము లేయ
ముప్పదిరెంటను × మూఁట నేనింటను, బదియింట నఱువదిబాణములను
గర్ణభూరిశ్రవఃకర్ణనందనకృప, గురుపుత్త్రు లేసి రన్నరుని మఱియు
నాతనిమీఁద దివ్యాస్త్రంబు లైదు గోవిందుమై నప్రతిమవిశిఖములును

తే. ద్రౌణి నిగిడించె నట్టిసందడి జయద్రథుండు వారలమఱుఁగున × నుండి పఱపె
సరభసముగఁ ద్రిసప్తతిసాయకంబు, లమ్మహాబాహుదెసఁ గౌరవాధినాథ.

వ. ఇట్లు పెక్కండ్రొక్కపెట్ట పెల్లేసినం గినుక నూనిననవ్వు రౌద్రరసంబు
నలంకరింప. 225

క. వడి రాధేయుని నాతని,కొడుకును బంక్రంట నూఁటఁ గ్రుదియించుచుఁ గ
వ్వడి యొకబాణంబున నొక్కొకటయుఁ దునిమెఁ గర్ణకోదండంబున్.
ఆ. తునిమి తోన యతనిఁ గ్రొవ్విరిసమ్ముల, సుక్కుఁ జేసి సూఁటఁ గ సోమదత్త
తనయు నేనిమిదింట ద్రౌణిని నిరువదే,సింటఁ గృపుని నొంచి నిలువరించె.
వ. మఱియు నిరువదిమూఁడగువాలమ్ముల లక్ష్మణకుమారునిఁ గ్రుచ్చి నిట్లాపఱ
తోడను గ్రందుకయ్యంబు సేయునప్పుడంబున నొక్కొక్కమఱి వానిపిఱుంద
[1]నోర వాఱం ద్రోఁచి జయద్రథునేయం దీటుకొన్నం దమకంబున నెదనెద నఱిమి
ఱిం దద్రథంబు వెనుక నతఁడు వాఱ విడిచినవిశిఖంబులు నూఱు గల పవ్వాడు
భూరిశ్రవుండు వాసుదేవునిచేతిమునికోల నొకకోలం దునిమి కదిసి క్రీడిమేనం
ద్రిసప్తతిశరంబులు పఱంగించె నక్కిరీటి నారును నొక్కటిగా గ్రూరనారాచం
బులు గుప్పించి నొప్పించిన. 228

శా. కోపాటోపమహోగ్రమూర్తి యగుచుం గోదండటంకారలీ
లాపూర్ణంబుగ భూనభోంతర మతం డమ్మ్యాధులన్ బాణజా
లాపాతంబునఁ దూల నేసి చటులవ్యాపారఘోరానిలా
క్షేపక్షోభితవారివాహచయభంగిం జూపె నే పారఁగాన్. 229

వ. అట్లు విచ్చియుం గూడికొని మూఁకలం గూర్చికొని యొండొరులంబురికొల్పికొని
క. అరథికు లొక్కమొగిన, వీరునిపైఁగవియుటయును విస్ఫురితశరా
సారమతఁడు నిగిడించిన, వారిబలము లెల్లరక్త[2]వారిం దేలెన్. 231
వ. ఇత్తెఱంగున నందఱలుచుం బాండవుల భవదీయసైనికలోకంబు నొక్క పెనంగె
ననిన విని యప్పుడేమి యయ్యెనని చాలంబులతో నెవ్వరెవ్వరికిని కంబులు మొఱసి
యుండె నని యాంబికేయుం డడిగిన సంజయుం డిట్లనియె. 332
సీ. ప్రస్ఫురద్వానరపతియును సింహలాంగూలంబు నుజ్జ్వలగోవృషంబు
వారణకక్ష్యయు భూరిమయూరంబు,నీలయుఁ గాంచనసింధురంబు
రత్నయూపంబును రజతవరాహంబు, సుద్దీప్యమానమహోరగంబుఁ
గేతనంబుల నొప్పఁ గ్రీడికి నాచార్య,సుతునకుఁ గృపునకు సూతజునకు
తే. నతనినందనునకును మద్రావనీశ్వ,రునకు శలునకు భూరిశ్రవునకు సైంధ
వునకు రారాజునకు నిట్లొదవ రిమెరయఁ,బవిసితంబులునభము నసంగ్రభలునిగుడ
క. మనతొమ్మిదిసిడములకం,టెను నుజ్జ్వల మగుచు నొక్కటియ పెక్కెయెం
దును దానతోఁచు నయ్యర్జును సిడము మహోగ్రతం గురుక్షితినాథా. 234
తే. అనుడు నమ్మేదినీశుఁడు ట్లనియె నట్లు, క్రీడి విస్మయావహరణక్రీడ సలుప
గురునిదర్పంబుచే నాఁకగొనినధర్మ,సూనుసైన్యంబు లెట్లయ్యెనూతతనయ.
వ. అనుటయు సంజయుం డతని కిట్లనియె. 236

1. నరవాఱం. 2. వారిధిఁ.

క. అయ్యెడ ఖేచరులకు వెఱఁ, గయ్యెడుచందమున నట్టియవసరమున బ
లద్వయము గురునిబలముతోఁ, నయ్యె యుధిష్ఠిరబలోచ్ఛ్రయంబున కధిపా. 237

వ. ఆసంకులసమరంబున బృహత్క్షత్రుని క్షేమధూర్తియు ధృష్టకేతుని వీరధన్వుం
డును నకులుని వికర్ణుండును సహదేవుని దుర్ముఖుండును సాత్యకిని వ్యాఘ్ర
దత్తుండును దలపడిరి శల్యుండు సేనాముఖంబునకు వచ్చుచుం బోవుచున్నవాఁ
డగుట నుచితంబుమెయి నచ్చటియనికిం జొచ్చి ద్రౌపదేయులం దాఁకె భీమ
సేనుని నలంబుసుండును ధర్మనందను నాచార్యుండును మార్కొని రప్పు డ
య్యుధిష్ఠిరుండు. 238

ధర్మరాజు ద్రోణునితో యుద్ధము చేసి యోడిపోవుట.

క. గురుమెయిఁ దొమ్మిది సునిశిత,శరముల నినుచుటయు నతఁడు సక్రోధుం డై
యిరువదియేనిట నాతని,యురస్స్థలము నొంచి పొదివె నుగ్రాస్త్రములన్.

క. రథమును నశ్వమ్ముల సా,రథిఁ దన్నును గప్పుశరపరంపర లెల్లన్
వృథ సేసెం గరలఘుతా,ప్రథితుం డగుధర్మసుతుఁడు బాణౌఘములన్. 240

చ. అలిగి గురుండు ధర్మజుశరాసన మేడ్తెఱఁ ద్రుంచి పెక్కు ల
మ్ముల సతురంగసూతముగ ముంచె రథం బది యెల్లఁ జూచి సే
న లతఁడు వేర్చె నిమ్మనుజనాథుఁడు నచ్చునొ యోడి పాఱునో
బలిమిఁ దొఱంగి పట్టువడి పాడఱి పోవునొ యంచు నున్నెడన్. 241

క. ఒండొకవిలు గొని ధర్మసు,తుం డాసిబిడాస్త్రసంతతులు రయముమెయిన్
ఖండించి తీవ్రరశ్మిల, మండెడుఘనశక్తి వైచె మార్తురు దలఁకన్. 242

సీ. శక్తి యాచార్యునిశక్తి మాయించుఁ బొ,మ్మని చూప లెల్లను నట్టులెత్తి
రకుంభసంభవుఁ డపుడు బ్రహ్మాస్త్రప్ర,యోగంబు సేసిన నుగ్రభంగి
నయ్యస్త్ర మాశక్తి నద్భుతంబుగ నేలఁ, గలిపి యుధిష్ఠిరు వలను నిగుడ
నమ్మహీవిభుఁడు బ్రహ్మాస్త్రంబునన యది, యడఁగునట్లుగఁ జేసి యతనిమేన

తే. నైదుదూపులు నాటిశరాసనంబు, దునుమ గద గొని వైచె నుద్ధురత నతఁడు
పతియు గద వైవఁ దత్సన్నిపాతజాత, చటులపావకజ్వాలలు చదల నిగుడ.

వ. ద్రోణుండు గోపించి. 244

తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁగూల్చి
ధనువుఁ గేతువుఁ దునుమాడి తనువు నొంప
నాతఁ డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండు నై యూర కుండె నధిప. 245

క. కనుఁగొని గురుఁ డవ్విభు నే,యను బొడువను జేతులాడ [1]కట పార్శ్వములం
దనచూడ్కిఁ బడినహయరథ,మనుజద్విపసముదయముల మడియించె వెసన్.

1. కపార్శ్వములం.

క. పోనీఁడు పోదువుఁ గుంతీసూనుని గురుఁ డనుచు నుండఁ ౹ జూపఱగముల
మ్మానవపతి యతిరయమునఁ, దా నెక్కెఁ బాఱి కిన్నరతమ్ముని రథమున్. 247

వ. ఇట్లు పాండవాగ్రజుండు సహదేవునిరథం బెక్కి తొలంగం దోలుకొని పోయె నట్టియెడ. 248

తే. క్షేమధూర్తి బృహత్క్షత్త్రు ౹ శితశరముల
నొంచి విలు ద్రుంప నొండుధనువు రయంబు
వఱలఁ గొని హయసారథిధ్వజయుతముగ
నతనిమస్తక మిలఁ గూల్చి ౹ యార్చె నతఁడు. 249

చ. కడువడి వీరధన్వుఁడు ద్రిగర్తులు వొంగఁగ ధృష్టకేతువిల్
నడిమికిఁ ద్రుంచినన్ మొగము ఱనం దళుకొత్తెడుకెంపుసొంపుతోఁ
జిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనశక్తి నాతఁ డా
క్కడుమద మొప్ప నాన్నృపతిఁ ౹ గూలఁగ వైచె సురల్ నుతింపఁగాన్. 250

వ. సహదేవుండును మగిడి వచ్చి దుర్ముఖునిం దలపడి దోర్విలాసంబు మెఱయం బోరి పోరి. 251

ఉ. కేతువుఁ గూల్చి రథ్యముల ౹ గీటడఁగించి శరాసనంబుతో
సూతునికంఠముం దునిమి ౹ స్రుక్కఁగ నంగము బాణవంచక
స్ఫ్యాతము సేయ నీదుతనయుం డరిగెన్ నిరమిత్రు తేరిపై
శాతలసంభ్రముం డయి రయంబునఁ బాండవసైన్య ముబ్బఁగాన్. 252

వ. అంత నిలువక. 253

తే. తఱిమి సహదేవుఁ డాత్రిగర్తక్షితీశ
తనయుఁ డగునిరమిత్రునిఁ ౹ దునిమి యొప్పె
ఖరునితలఁ ద్రెవ్వ నేసి రాఘవుఁడు మెఱయు
తెఱఁగు దోఁప నీసేనకు ౹ వెఱపు గదుర. 254

క. నకులునిఁ దాఁకి వికర్ణుం, డొకపరి యైనను బెనంగ ౹ నోపక తిరిగెన్
సకలబలముఁ జూడఁగ రాతికిఁ బైకొని యుద్ధరి తగరు ౹ దెరలినమాడ్కిన్. 255

తే. వ్యాఘ్రదత్తుండు సాత్యకిశస్త్రవృష్టి, [2]ముంచె ముంచిన నతఁడు కోపించిసూతుఁ
జదిపి హయములఁ బొరిగొని చటులవృత్తిఁ, జంపె నమ్మగధక్షితీశ్వరకుమారు.

వ. శల్యుండును ద్రౌపదీపుత్త్రుల నేవుర నైదేసి బాణంబుల నేసి మఱియును మార్గణ
నికరంబులు నిగిడింపం జలింపక వారాసౌమదత్తి నొక్కమ్మున జుట్టుముట్టిన
నతం డందఱ కన్నిరూపు లై యేపునం బెనంగు చుండు. 257

చ. హరిసుతసూతి మావుల బలకాంతిగసూనుఁడు చాపమున్ యుధి
ష్ఠిరతనయుండు కేతువుఁ గడిందిమగంటిమిఁ ద్రుంప సూతునిం

---

1. రయమున, గొనుచుహయరథయూతకేతుయుతముగ. 2. ముంచు [illegible]

బాఁగొఁగ యేర్చి నెఱి నకారయ ప్రక్కఁ గిమ్మెయిఁ జిక్కి వడ్డఁ జె
చ్చెర నహాపసందనుఁడు సేసె శిరంబును మేను వేఱుగాన్. 258

సీ. వెస మాతులీయుఁ డలంబుసుఁడునుఁ బోరుచోఁ, బద్దాన వేంద్రుని ప్రయుంపబలువు
చేత నతండు మూర్ఛిల్లి యాలోన నఁ, దెలిసి కాటుకకొండ ప్రపొలువు గెలుచు
నాతని మేను పెల్లలరిన మోఁదువ్వు, తెఱఁగుగాఁ జేసిన నుఱికి వాఁడు
మాయావిలాసోగ్రతాయుంబు గైకొని, యఖిలదిక్కులఁ దోఁచి నిఖిలబలము

తే. నఱిపి నెత్తురుటేరులు వఱపి భీమ, సేన మాయన్న బకుని నాలేనిచోట
నట్లు సేసితి గాక కీర్తియలవ్వుఁ జలము, నింక మెఱయంగ వచ్చునె యేనుగలుగ.

తే. అనిన విని కెంపు గనుఁగవ నడరఁ గినిసి
యుజ్జ్వలత్వష్ట్రబాణ ప్రయోగమునఁ బ్ర
భంజనాత్మజుఁ డమ్మాయ పాయఁ జేసి
[1]తఱిమి యేసి యారక్కసుఁ బఱపె నధిప. 260

వ. ఇవ్విధంబున మనదిక్కునఁ జేయుం గలదొరలచావును నోటమియుం జూచి మూఁకలు గలంగినం గుంభసంభవుండు రోషసంరక్తలోచనుం డయి తలకడచి సాత్యకిప్రముఖపాండవపక్షవీరులఁ గ్రూరనారాచనిచయంబుల నిలువరించి నెఱయం బొలిచి నిలిచి మెఱయుచుండెను. 261

చ. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే
త్తెఱ నడ తేరఁ గాంచి చనుదెంచి యలంబుసుఁ డమ్మహాసురుం
గుఱియుగఁ జేసె శాతశరకోటికి నడ్డము సొచ్చి సాత్యకిం
బిఱిఁదికిఁ ద్రోచి యద్దనుజు భీమతనూజుఁడు ముంచె నమ్ములన్. 262

అలంబుసుఁడు ఘటోత్కచునితో యుద్ధము సేసి చచ్చుట.

తే. భూరిచక్రంబు వెస నలంబుసుఁడు వైవఁ
బెలుచ గద వైచి పొడి సేసె భీమసుతుఁడు
కడుఁదురులు గవిసి కఱచుకరణి యయ్యె
మూఁక నత్తునియలు వెసఁ దాఁకునపుడు. 263

క. ఆచక్రం బట్లయిన ని,శాచరపతి వివిధశక్తిజాలము వఱపం
జూచి ఘటోత్కచుఁ డది వ,మ్మై చెడ నర్ధేందుశరచయం బడరించెన్. 264

వ. ఇట్లు దొడంగి యయ్యిరువురు దానవేశ్వరులును. 265

మ. బహుహేతిప్రకరంబులన్ బహువిధోపాయంబులన్ విస్ఫుర
ద్బహుమాయాకృతరూపజాలముల ఘోరదుర్వీరసంరూఢిమై
మహిఁ యల్లాడఁగఁ బోరఁ బాండుతనయుల్ మాత్సర్యధుర్యాత్ములై
సహితోద్యోగత నయ్యలంబుసు శరచ్ఛన్నాంగునిం జేసినన్. 266

1. బల్లిదుండగు రక్కసుఁ.

నేటులు వసి మూఁడునారసంబుల నతని నొప్పించె నయ్యాదవవీరుండు పంచాశ
త్ప్రాణంబుల నొంచిన ధనుర్ధరుం బొమ్మిడియమ్ము లెమ్మలం గీలించి. 270

క. మఱియును శరశతము మెయిఁ, గఱికొలిపిన వృష్ణివరుఁడు । గినియఁగ శై కే
యఱి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయు లుబ్బు । మిగిలి నరేంద్రా.

వ. అప్పుడు వినియును గనియును ధర్మతనయుండు ధృష్టద్యుమ్నాదియోధవరుల
నాలోకించి. 272

ఆ. పులుఁగుఁ ద్రాటఁ బట్టి । యలయించి యాడించు, బాలునట్లుపోలె । బాణగురుఁడు
గడఁగి కృష్ణునను జుఁ గారించుచున్నవాఁ, డతనిఁ బొదువుఁ డితని । కడ్డపడుఁడు

వ. భీమసేనపురస్సరులై కవిసియుం దనచుం దానును దఱుముటయు నాసైనికోత్త
ములు సాత్యకి గడచి యాచార్యుం గదిసిన. 274

క. విండులఁ గనిన ట్లాతఁడు, మందస్మితుఁడై యెదిర్చి । మార్గణజాల
స్పందితులఁ జేసె వారల, నందఱ కద్భుతము రోమహర్షణ మయ్యెన్. 275

వ. అట్టియెడ. 276

క. ఇరువదియేవురు పాంచాలురు నూర్వురు కేకయులును । లూనాంగకులై
ధరఁ దొఱఁగిరి వెఱవిత్తము, కరినికరము రొంపిఁ బడినగతి నుండె నృపా.

వ. ఇట్లు ద్రోణుండు బరవసంబు సేసినం బాండవయోధులు పైఁబెట్టం జాలక సొలసి
యున్నసమయంబునం బాంచజన్యధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి
గాండీవగుణఘోషంబు గర్ణగోచరంబుగామికి మనంబు గలంగ నెలుంగు గుత్తు
కం దగుల సాత్యకితో ని ట్లనియె. 278

—✿ ధర్మరాజు సాత్యకి నర్జునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట. ✿—

ఉ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కుడయ్యె న
ద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత మ్రోయుచు నొడంగె నక్కటా
చిక్కెనొ కౌరవాధములచే నతఁ డియ్యెడ నీవ యొక్కఁడుం
దక్క నొరుండు దీర్పఁగ సమగ్రుఁడు బంధుఁడు లేఁడు వేఁడెదన్. 279

క. త్వరితముగఁ జనుము సఖుఁడు, గురుఁడుం గదా నీకు నర్జునుం డుపకృతిత
త్పరులై నెగడెదు నుత్తమ,పురుషులు వేచుటఁ జెఱి వచ్చు । భుజవీర్యనిధీ 280

చ. దురమున బంధుమిత్త్రులకుఁ । దోడ్పడు టెంతయు ధాత్రి యెల్ల భూ
సురులకు నర్థి నిచ్చుటయు । సూరిజనుల్ సుకృతంబు నన్నచో
సరియుఁగ జేసి చెప్పుదురు । శాశ్వతకీర్తియు నిన్ను నొందు నా
హరి నను నాసుహృజ్జనుల । నందఱఁ గాచుటఁ గీర్తిఁ గావవే 281

క. గురుపుత్త్రకర్ణమద్రేశ్వరకృపభూరిశ్రవసులు । శత్రుజనభయం
కరులు జయద్రథునకునై, నరుఁ బొదివిన నతఁడు నొచ్చె । నాకుం జూడన్. 282

క. ఆమోము నాభుజంబులు, నామేనుం గలదె కేశవానుజ యొచ్చో

నేమగలకు నమ్మారుతికి, నేమి దలంచునొకొ కృష్ణ యెయ్యది నుదిమా. 283

ఉ. ద్వైతవనంబునందు [1]గుణధన్యుఁడు గాండివి నాకుఁ జెప్పె ని
ర్ధూతవిరోధి సత్యకసుతుండు సహాయుఁడు గా జయింతుఁ బ్ర
ఖ్యాతిగ ధార్తరాష్ట్రబల మంతయు నే నని దానికిం దగం
బ్రీతి యొనర్పవే నరవరేణ్య రయంబునఁ బోవు వానికిన్. 284

క. హరి యొకఁడు నీ వొకండవుఁ, బరమాప్తులు గలిమి నరుఁడు భారవుఁబనికిం
బోర నలుకఁడు నీకూరిమి, పొరిపొచ్చెము గాక యుండఁ బోవఁగవలదే. 285

ఆ. పరమకరుణ నైన బంధుభావంబున, నైన భుజబలంబునతిశయమున
నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ, బోవఁ దగు మహానుభావ నీకు. 286

క. అతఁ డొకటి యైన నే నే,గతిఁ బోదుం జెప్పుమ యెల్లకార్యంబులలో
నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁ జేయు మనఘవిచారా.

క. అలఘుబలుఁడు శైనేయుఁడు, గలుగఁగఁ బాండవుల గెలువఁగా వచ్చునె వా
రల కతఁడు గోట యంత్రరి,పులు దానికిఁ దగఁగ నెఱపు భుజగర్వంబున్.

క. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు, గురుఁ డిరువుర యెడరు దీర్పఁ గోరి గురులకున్
గురుఁడ వగుసేన చేసెదఁ, బరమప్రార్థనము దీనిఁ బాటింపు తగన్. 289

క. కురుబలము సొచ్చి నీ దగు,శరములదర్పంబు చూపి చయ్యనఁ జని య
న్నరుఁ గైకొని నాయుల్లము,పరితాపము దీర్పవే నృపాలురు మెచ్చన్. 290

వ. అనిన విని సాత్యకి ధర్మనందనున కిట్లను నీవచనంబు లుచితంబు లేను నప్పార్థునకు రణంబునం బ్రాణంబులు దాఁప విశేషించి నీ వింత ప్రార్థించి పనుప నూరకుండుదు నే యతండు సైంధవవధార్థంబుగా నట నను నుండి కృష్ణుఁడు వినుచుండ నాతోఁ జెప్పిన తెఱంగు విన్నవించెద నవధరింపుము. 291

క. మనకు నిమిత్తము లెంతయు, ననుకూలము లయ్యె గెలుతు మాహవమున [2]నేఁ
జనియెదఁ బ్రతిజ్ఞ దీర్పఁగ, ననఘా ధర్మసుతు రక్ష కడగుము నీవున్. 292

క. విను సింధురాజువధయును, మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా
వున నే నొకపని నీ వొక,పని మేకొని చేయు టరయఁ బాడియ కాదే. 293

ఆ. ఏను నిలిచినట్ల కా నూఱడిల్లు నీ, వున్న నన్న రేశ్వరోత్తముండు
నిర్భరుండ వగుము నీవు నాడెన నాకు, హరి గలండు గలఁడె యచట నితఁడు.

వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవ వలయుఁ బరాక్రమధుర్యుం డగు నాచార్యు ప్రతిన యెఱుంగవె యని చెప్పిన నట్లకాక యని విన్నతనిచే నిక్షేపంబు గాఁ గైకొని యేను నీకడకుం జనుదెంచితి గురుండు ప్రతిన నెఱపునేని విజయుండు జయద్రథుం జంపుట యప్రయోజనంబ కాదే యది యట్లుండనిమ్ము నీచిత్తమున వలవని వెఱపు గట్టుకొనియెదవు కృష్ణసారథికం బగుజిష్ణురథం బప్రతిహతమనో

1. గుణవర్యుఁడు. 2. శేఁ.

రథం బగుట యెఱుంగ వలవదే యనుటయు నమ్మహీపతి యతని కిట్లనియె 295

క. అది యగు నైనను ననుఁ బెం, పొదవఁగఁ గాచికొని యిచట నుండుటకంటెన్
మది నధికం బై తోఁచిన, యది నీ వర్జునునిపాలి కరుగుము నాకున్. 296

క. కడువడి నీ వరుగఁగ వశ, మడియును నీవెనుక శీఘ్రమున నెఱుదుం గ
వ్వడి కుశలి యైన విజయుం, బొడఁగూడను మనకు దీని గొడఁబడు మనఘా

చ. ద్రుపదవిరాటకేకయులు దోర్బలధుర్యులు ద్రౌపదేయులు
గ్రపుబిరుదుల్ ఘటోత్కచుఁ డరాతివిదారి శిఖండి ధైర్యసా
రపరుషమూర్తి నంగరధురంధరు లిద్దెసఁ దక్కఁగల్గువా
రపరిమితుల్ గొనండు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁ బోరఁ జేరికిన్. 298

క. విను మాధృష్టద్యుమ్నుం, డనలంబునఁ గుంభభవవధార్థముగాఁ బు
ట్టినవాఁడు గాఁడె నాదెస, ననుమానం బేల యోర్చు నాతం డతనిన్. 299

వ. అనవుడు శినిపుంగవుం డొక్కింత చింతించి పార్థుపజ్జం బోవుట బంటుతనంబున
కూనంబు గా దితండునుం బెద్దయుం దఱిమి పలికెడుఁ బోదున కాక యని మనం
బున నిశ్చయించి యధిపతియాననం బాలోకించి. 300

సాత్యకి ధర్మరాజు వేఁడినచొప్పున నర్జునుకడకుఁ బోవ సమ్మతించుట.

క. భవదీయరక్ష యిమ్మెయి, సువిహిత మగునేని మేలు సొచ్చెద భేరీ
రవబృంహితహేషాభై, రవకౌరవసేనఁ గలఁగి క్రందుకొనంగన్. 301

శా. వైరం బాత్మల నిండి యుండ భుజగర్వంబుల్ దలిర్పంగ దు
ర్వారోత్సాహులు వీరె కొందఱు నృపుల్ రారాజుకార్యంబు వి
స్తారోదగ్రము సేయఁ బూని విలసత్సంరంభు లై పన్ని యు
న్నారీదట్టపుమూఁక లెట్టు లగునో నాకోలలం జూడుమీ. 302

క. ఈసేనల ఛేదించి భుజాసంపద వెలయఁ బార్థసాహాయ్యం బేఁ
జేసెద నీపం పనియెడు, భాసురదీపమున కన్యబలతమ మెదురే. 303

క. దవ్వని చూడకు మార్తుర, క్రొవ్వడఁచెద సింధువిభుని గూల్పఁ గడఁగునా
విన్వచ్చు మెచ్చు తెఱఁగున, నవ్వాచఁ గవిసెద మరుద్గణంబులు వొగడన్. 304

వ. రథ్యంబులదగ యుడుపను సారథిదప్పియుం దీర్పను రథంబు సవిశేషసన్నాహంబు
సేయను వలయు ననినం బ్రీతి నొంది యప్పాండవాగ్రజుండు పనుపం దద్జ్ఞులైన
పరిచారకు లత్తురంగంబుల నీరికిం దిగిచి ఖాణం బెత్తి తడవి దారుకానుజుం డగు
నాసూతు నుపయుక్తాహారం జేయుటయు వాఁడును విశిష్టాయుధసమేతంబుగా
నయ్యరదంబు [1]సుకల్పితంబు సేసి సింహధ్వజంబు గ్రాలం దెచ్చె నంతకు మున్న

1. సవిశేషకల్పితంబు.

సాత్యకియుఁ గృతస్నానుం డై తాపోష్యాయనమధుపానంబున నెలమిఁ బొంది యమ్మహీపతిపాదంబులకుం బ్రణతుం డైనం గౌఁగిలించికొని యతండు దీవించినం బెండ్లికిఁ బోవులీలం దేరెక్కి యెక్కిడినవిల్లును మెచ్చువచ్చునమ్ములును దొడలపైఁ బెట్టికొని కదలి చనుసమయంబున భీమసేనుండును నగ్రజునకుం బ్రణామంబు సేసి తనతోడన రాఁ గదలినం గని శినిపుంగవుం డతని కిట్లనియె. 305

క. అక్కట రా వలవదు నా, [1]కెక్కటి యీసేన దఱిసి యేఁగుట భరమే
యిక్కడన నిలువు ద్రోణుని,యుక్కునఁ బతి కెడరు పుట్ట కుండఁగవలయున్.

వ. అనవుడు నతం డట్లు కాక యేను రాజరక్షణంబునకు నిలిచెద నీవు ప్రమత్తుండ వయి యరుగు మనిన వదనంబు వికసింప నీయట్టిపెనుఁబ్రాపు గలుగ నా కెదు రెవ్వరు సవ్యసాచి సైంధవుం దెగటార్చినం బేర్చినకౌతుకంబున వచ్చి నిన్నును మీయన్ననుం గౌఁగిలించుకొనియెద నని పలికి యవ్వీరుని నిలిపి లేళ్లగమిఁ గనుంగొను బెబ్బులియుం బోలె నీసేనం జూచుచు నడచె నని యిట్లు సంజయుండు సాత్యకిసంరంభంబు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన వేడ్క యుల్లంబున నివ్వటిల్లఁ బరంపవడి చెల్లినభండనంబువిధంబు వినిపింపు మనుటయు. 307

ఉ. నిర్మలచిత్తభృంగరమణీయవికస్వరపుండరీకతా
ధర్మనిరూఢ సంసరణతాపనివారణప్రగాఢస
త్కర్మఫలాకృతీ భువనతా[2]విభవప్రకృతీ తపఃక్రియా
కర్మఠసంయమీశ్వరసఖా సమతాసమవేతచిత్సుఖా. 308

క. పరిధానప్రావరణీకరణాదృతకృత్తివసనగజచర్మ సము
ద్ధురవాహనీకృతోజ్జ్వల,గరుడవృషభ పరమమోక్షకర దురితహరా. 309

మాలిని. నిరుపమగుణరాశీ నిర్గుణత్వప్రకాశీ
భరితభువనకార్యా భవ్యనైష్కర్మ్యధుర్యా
విరతనిరతభావ్యా విశ్వలోకైకసేవ్యా
స్ఫురితబహుశరీరా శుద్ధనైరూప్యసారా. 310

గద్యము ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 311



1. కెక్కడియీసేన–కెక్కడ నీసేన. 2. విభవత్ప్రకృతి.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము – చతుర్థాశ్వాసము.



క. శ్రీమత్స్వీయమహత్త్వసు
ధీమత్త్వప్రకటాత్త [1]దీపితభక్త
స్తోమారామవసంతా
వ్యామోహప్రశమకరణ హరిహరనాథా. 1

### సాత్యకి మొగ్గరంబు సొరం దొడంగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ధర్మపుత్త్రుండు పనుప సాత్యకి గడంగి, తనబలము దెస నడచుట విని నయాంబి
కేయుఁ డర్జునుఁ గలయు శైనేయుఁ బోవ, విడిచిరే మనవారని యడుగుటయును.

వ. సంజయుం డతని కిట్లను నట్లు మఱందిం బనిచి యుధిష్ఠిరుం డాచార్యువల నవలోకించి యాశినివరుపిఱుందన తఱిమె నప్పుడు ధృష్టద్యుమ్నుం డవష్టంభంబున నెలుం గెత్తి పురికొల్పఁ బాండవసైనికులు గవిసిన మనవారును మార్కొనిరి తదనంతరంబ. 4

క. తలలను గరముల వక్షస్స్థలముల జఘనములఁ దొడలఁ జరణంబుల న
య్యలఁ గప్పెడుసాత్యకికోలలఁ గౌరవకనీబలము [2]గలంగం బడియెన్. 5

క. విచ్చినమూఁకల కడ్డము, సొచ్చిన నేడ్వురు నృపాలశూరోత్తములం
బుచ్చె జముం గొలువఁగ వివ్వచ్చుమఱఁది పెఱనృపాలవర్గము దెరలన్. 6

సీ. ఆసమయంబున నతని మార్కొని కుంభభవుఁ డేడుదూపులు వఱపె మేన
నతఁ డత్త్రస్తహస్తుఁ జేసె నాతని, నగ్గురుఁ డాఱింట నశ్వములను
నూతు నాతని నొంచె నాతఁ డయ్యాచార్యు, నేపుమైఁ బదియును నేడునాఱు
నెనిమిదియును బదు నెనిమిదియును శాతశరముల నొప్పించి తురగచయము

ఆ. నాల్గుసాయకముల నడిఁకించి సారథి, నొక్కమార్గణమున నుబ్బడంచి
యార్చుటయును ద్రోణుఁ డలికి వాలమ్ముల, బొదివెఁ దద్రథంబు మదమెలర్ప.

వ. ఇట్లు బాణజాలంబులం గప్పి గురుండు సాత్యకి నుపలక్షించి. 8

---

1. దృఢతరభక్త. 2. తలంగం.

క. నాచేతిబలువు గని నీ,యాచార్యుం డోడి తొలఁగి ‡ యరిగెను నీవే
తోఁచి యట వోవువాఁడవు, నూచెదు గా కెట్లు నిన్ను ‡ స్రుక్కించెదనో. 9

క. అనవుడు ధర్మాత్మజుపను,పున నే గాండీవికడకుఁ ‡ బోయెద నన్నిం
తన నేటికిఁ దడ వయ్యెడు, ననుగ్రహము సేయు మర్హ ‡ మది పెద్దలకున్. 10

క. అని పలికి తొలఁగి పోవుట, మనమున నూహించి దైత్యమర్దనుతమ్ముం
డను సూతుతోడ ద్రోణుఁడు, మనలం బోనీక వెనుఁగు ‡ మాత్సర్యమునన్. 11

వ. తడసినఁగర్జంబు దప్పు నితనికి నోసరించి పోవవలయు నను మిదియెబాహ్లికబలం
బదె యంగసైన్యం బల్లదె దాక్షిణాత్యసేన వీనియం దొక్కసంమున వెతలుద
మివి గడంగి యడ్డపడిన నొప్పించి చిక్కువఱచి పోద మనిన నట్ల కాక యని
యద్దారుకానుజుండు ద్రోణునకుం దొలంగించి తేరు వోలం దీవ్ర బాణంబులు
గురియుచు నగ్గురుండు వెనుతవుల నయ్యాదవసింహుండు సింహవిక్రమంబున
నంగ చమూచ్ఛేదనంబు సేసి చనునెడఁ గృతవర్మ యాతనిం దాఁకె. 12

క. ఆతమ్ము లతని మేనం, దూఱంగా నేసి నాల్గు ‡ తురగాంగముఁ గ్
[1]గీఱించినఁ గని ద్రోణుం, డూఱక ధర్మజునిదెసకు ‡ నున్ముఖుఁ డయ్యెన్. 13

వ. అక్కడ మొగ మయ్యె నిక్కడ నేమఱక యుండె నప్పుడు. 14

క. కృతవర్మయెడల సాత్యకి, శితసాయకములు పదాఱు ‡ సెరివినఁ గోపో
ద్ధతి మెఱయఁగ బలుదూపుల, నతఁ డాతని నుచ్చిపోవునట్లుగ నేసెన్. 15

వ. వెండియు. 16

చ. విలు దునుమాడి వక్షమున ‡ వే పదియమ్ములు నాట నాతఁ డు
జ్జ్వలఘనశక్తి వైచి కృతవర్మునిబాహువు నొంచి ధైర్యని
శ్చలమతి నొండువిల్లు గొని ‡ సారథిఁ జంపిన నాతకృత్యముల్
వలనుగఁ బూని యారథికవర్యుఁడు నిల్చె నితాంతధీరతన్. 17

వ. నిలిచియు సాత్యకిదెసం దఱుమక భీమసేనపురస్సరం బైనబలంబున కడ్డపడ
నవ్విధంబున నతని బెట్టు వఱచి యాశైనేయుం డచటు గడచి చనియె ననిన
విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 18

చ. గురుకృతవర్మముఖ్యు లతిఘోరపరాక్రమశీలు రట్టియా
దొరలను సైన్యసాగరము ‡ దోర్బలసంపద గాసి సేసె న
న్నరుఁ డది గాక క్రమ్మఱ విరథం గడు విస్మయము మిట్లజయ్యుఁ డై
వెరవున లావునం బరిభవించుచు సాత్యకి యేపు నూపెనే. 19

మ. హరియుం బార్థుఁడు నట్లు నేర్పు గలబాహాశక్తిమైఁ జొచ్చుచో
దొరలుఁ సేనలుఁ బెల్లు గూలుటకు నాశ్యయోధనుం డెంతయా
తురతం బొందెనొ దంతిఘోటకపదాతతుల్ సాత్యకిస్ఫారదోస్

---

1. ఖాతించిన.

స్ఫురణ మ్రగ్గుట కెట్లు చూచు ననుజుల్ ¤ [1]శోకించిరో యక్కటా. 20

వ. అనవుడు సూతసూనుం డమ్మానవపతి కి ట్లనియె. 21

క. నీయవినయంబు పెంపున, నీయాపద సంభవించె ¤ నింక వగచినం
బాయునె యితరులక్రియ శో,కాయత్తుఁడ వగుట నీకు ¤ నర్హమె యధిపా. 22

వ. సుస్థిరుండ వై సమరప్రకారంబు వినుము సాత్యకి యత్తెఱంగునం జని కాంభోజ
సేనఁ జొచ్చిన నందలి మేటిమగలు దలపడి రట్టియెడం గుంభసంభవుండు. 23

క. కని కృతవర్మకు సారథి, నొనర్చి తనకృత్యమునకు ¤ నునిచి కడఁగి యా
శినివరు వెనుకొన ధర్మసు,తునిదొర లయ్యస్త్రగురుని ¤ దొడరఁ నడరినన్. 24

క. వారిఁ గృతవర్మ మార్కొని, దారుణశరశిఖల నేర్చి ¤ తల్లడపఱుపం
గా రయము గుంది నిలిచిరి, వా రొండొరుఁ జూచుచును వివర్ణాకృతు లై. 25

వ. ఇట్లు హార్దిక్యబలువిడి కోహటించినరథికులం బురికొలిపికొని వృకోదరుండు
సోదరపుత్త్రమిత్త్రసహితంబుగా నతనిపైఁ గవిసె నట్టిసమయంబున నయ్యనిల
జుండును ధృష్టద్యుమ్నుండును శరత్రయంబులను ధర్మనందనద్రుపదులు బాణ
పంచకంబులను హైడింబుం డేడమ్ములను మత్స్యపతి పదియేనింటను సహదేవుం
డిరువదేనింటను శిఖండి యిరువదింటను ద్రౌపదేయులు డెబ్బదిమూఁవులను నకు
లుండు సాయకశతంబునను నొక్కుమ్మడి నమ్మేటివిలుకానిం బొదివిన నతండు.

సీ. ఐదైదుశరముల ¤ నందఱ నుక్కించి, భీముని నేడింట ¤ బెట్టు వఱచి
ధనువుఁ గేతనమును ¤ దునిమి డెబ్బదిమూఁవు, లతిశయంబున నుర ¤ మాఁడ నేయ
సోలినయమ్మరుత్సుతుఁ జూచి యందఱు, నాకృతవర్మపై ¤ నడరి రంతఁ
దెలిసి వృకోదరుం ¤ డలఘుదారుణసము, జ్వాలశక్తి నాతని ¤ వైవ నతఁడు

తే. ముత్తునియఁ జేయ దొడ్డవి ¤ ల్లెత్తి యతని
యొడలు నెత్తురువఱ్ఱు సేయుటయు నాస
మీరనందనుఁ దక్కటిసవారి నొంచె
మూఁడుమూఁడమ్ము లేసి యుగ్రవ్యాడిమఁగఁడు. 27

తే. అందఱునుజుట్టుముట్టి తీవ్రాస్త్ర[2]జాల,కములఁ గృతవర్మ నొంప శిఖండి గదిసి
యాక్రమించిన విలుద్రుంచె నాతఁ డప్పు, డతనిచాపంబు దునిమె నుగ్రాసి వైచి.

క. ఆలోనన భోజపతిన్, వాలమ్ములఁ బొదివి రెల్లరవారలు దానం
దూలక తఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమముఖ్యరథికుల నొంచెన్. 29

వ. అప్పుడు. 30

ఉ. ఒండొకచాప మెత్తికొని ¤ యుగ్రత శాంతనవాంతకుండు వే
దండమువోలెఁ గిట్టిన నుదగ్రత సింహసభోపమస్ఫుర
త్కాండములం దెదంగము రథంబుపయిం బడ నేసె భోజనా

1. శోకించెనో. 2. సప్తకమునఁ.

ఘుం డది యాజికిం బోలఁగఁ గ్రోధ కయాంబున సూతుఁ డార్తుఁ డై. 31

వ. ఇట్లు శిఖండి గం దఱంగి పోయినం గని యుత్తమౌజశ్చేదికేకయాదిసైన్యంబులు బర
వసంబు సేసి యొరవఁగించిన నాకృతవర్మ యూర్మిభేదనస్ఫారనానాచవరంవరాప్రవా
హంబుల వాని నెల్లం గలంచెఁ దత్కాలకలాపాలించి సాత్యకి యట్లబ్బలంబులు
వికలంబు లగుట యాలోకించి విజయునకుం దోడ్పడం బనంపడి పోవఁగు రాజు
వలనారయవలయు నని యూహించి తనకు నడ్డపడినభారద్వాజునితోడిసమరంబు
సాలించి మరలి యరదంబు దోలుకొని యురుగుదెంచి కృతవర్మనిం దాఁకి
యేసిన నతండు కుం బోగ లేనిమంటచందంబున నుద్దీపించి నాయకజ్వాలలు సిగి
డించిన నవి మగిడించి యార్చి సేయుండు. 32

శా. భల్లం బొక్కట విల్లు ద్రుంచి రయ మొప్పన్ నాల్గిటన్ వాజులం
ద్రెళ్లన్ మెట్టుగ నేసి సూతుతల సవ్యాదీపైక బాణాహతిన్
డొల్లం జేసి యుదల్చి యి ట్లతనియాటోపంబు మాన్పించి యు
త్ఫుల్లాస్యుం డయి పోవ నడ్డపడినం ద్రుంచెం ద్రిగర్తావళిన్. 33

వ. ఇట్లు కృతవర్మ విరథుం డైన రథాంబునం బుచ్చికొని యొరవడించినపాండవ
సైన్యంబులం గని కుంభసంభవుం డాశినివరువిక్రమవిహారంబున కడ్డపడం
గడంగక యాసైన్యంబులసంరంభంబు దసవిజృంభణమున వారించి నిలిచె ని
త్తెఱంగునం ద్రిగర్తసేనఁ జిక్కువఱచి తటిమి చనునయ్యాదవరత్నంబు ప్రయత్నం
బునకు భంగంబు సేయ నుత్తుంగమాతంగంబును గొలిపి జలసంధుం డు మదాం
ధుం డయి మార్కొనుటయు. 34

—జలసంధుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.—

క. ప్రదరప్రవాహమున న,మ్మదవద్ద్విరదంబుపటుగ్రమున ముడిపి ముదం
బొదవిన సాత్యకి విలు ద్రెట్టు దునిమె నమ్మగధనాథుఁ డడు మహోగ్రుం డై. 35

తే. తునిమి నవ్వుచు నేఁబదిశరమావు లురము,నందు నాటిన శై నేయుఁ డలిగి బెట్టి
దంపువిలు గొని యాతనిశరధనువునఱికి, యుఱక యుఱువదియమ్ములుగ్రవఱపె మేన.

వ. దానికిం జలింపక జలసంధుండు. 37

చ. పటుగతి నాశినిప్రవరుశరబాహువు దోమరకీలితంబు సే
యుటయును గాక త్రుంచె ధనువు గ్రుక్కృపాణము వైచి యాతఁడు
త్కట మగునల్క నొండువిలు గైకొని వాని నికృత్తహస్తునిం
ద్రుటితశిరస్కునిం బ్రదరఘాతము నావలిఁ జేసి యార్చినన్. 38

క. పెలుకుటి యచ్చట మూఁకలు, గలఁగినఁ గని తనముఖంబు గయ్యంబునకున్
బలియురఁ గృతవర్మాదుల, నిలిపి గురుఁడు వచ్చి యాశినిప్రభుఁ దాఁకెన్. 39

వ. ఇవ్విధంబునం గడంగినకుంభసంభవుం జూచి యతనిప్రాపున దుర్మర్షణ దుస్సహ
వికర్ణ దుర్ముఖ దుశ్శాసన చిత్రసేన ప్రముఖు లగుకురుకుమారు లొక్కపెట్ట కవిసి

మిక్కుటం బగుతూర్యరవంబులతోఁ బెక్కుమ్మూఁకలు సాత్యకిం బొదువ నత్తుములం
బునకు దుర్యోధనుం డేతెంచి తమ్ములం గాసినం గనుంగొని గురుండు వారలతని
గోవుదు రనుబుద్ధిఁ బాండవసేనాముఖంబునకుం జనుదెంచిన నయ్యచ్యుతానుజుం
డారథికు లందఱు కన్నిరూపు లయి వారలశరాసారంబులు నివారించుచు నొకని
నొకని ననేకబాణజాలంబుల నొప్పించుచుండ నక్కౌరవేశ్వరుం డుద్దామగతిని
గవిసి వాలమ్ము లాతనితనువునం జొనిపిన నతండు. 40

క. నగుచు విలు దునిమి తీవ్రాశుగముల నొంచుటయు నీదుసుతు లెల్లను నా
మృగపతివిక్రముపైఁ దఱచుగ నిగిడించిరి ప్రదీప్తసునిశితశరముల్. 41

క. చిక్కువడక సాత్యకి యొక్కొక్కని నయిదయిదు దృఢమహోగ్రాస్త్రములన్
స్రుక్కించి యెనిమిదిటఁ జేరుక్కున నక్కురునృపాలు నొడలం గ్రుచ్చెన్. 42

ఉ. అంతటఁ బోక రత్నమయమైనభుజంగపతాకఁ గూల్చి య
త్యంతరయంబుమై ధనువు నశ్వచయంబును సూతు మేను నిం
తింతలు వ్రయ్యలై పడఁగ నేసిన బెగ్గిలి తేరు డిగ్గి భూ
కాంతుఁడు వాఱె సేన కలఁగం బడి మ్రోయ నతండు నవ్వఁగాన్. 43

వ. ఇట్లు వాఱి చిత్రసేనునరదం బెక్కె నక్కోలాహలం బాలించి కృతవర్మ దన
రథంబు రయంబున నద్దెసకుం బఱపం బనిచి యారవడి నరుగుదెంచినం గని శిని
పుంగవుండును నిజస్యందనంబు సమ్ముఖంబు సేయించె నయ్యిరువురుం గోఱవి
గోఱవిం దాఁకిన తెఱంగునం దలపడి యొండొరులపైఁ బ్రచండబాణంబులు వరఁ
గించుచు బోరునెడ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్రమించి. 44

తే. హయములను సూతు నొంచి శరాసనంబుఁ
ద్రుంచి మెఱుఁగులు [1]వెరిఁగినదొడ్డనార
సంబు మే నుచ్చి పో నేయఁ జచ్చినట్లు
మూర్ఛ వోయి మోఁకాళులు మోవఁ బడియె. 45

వ. ఇత్తెఱంగునం దేరివయిఁ గూలినకృతవర్మం దెగియెనకాఁ దలంచి ధనంజయుం
గలయం దమకించి సాత్యకి యక్కడఁ బోవ నాభోజపతి దెప్పిఱి సన్నద్ధుండై
మరలి చని యెప్పటినెలవున నిలిచి యనిలతనయప్రముఖుల కడ్డపడినం జూచి
యాచార్యుం డచ్చోటి కతనిం జాలించి శౌర్యధుర్యుం డగునాశినివరుం డట
సనుట సైరింపం జాలక రయంబున. 46

క. మగుడఁ జని యాఁగి నిశితము, లగునారాచములు మూఁట నతనినుదుట బె
ట్టుగ నాటినఁ ద్రిశిఖరయుత, నగముక్రియం బొలిచె నతఁడు నరవరముఖ్యా.

వ. ఆ రథికవరుండును గురునిపైఁ గ్రూరనారాచంబులు నిగిడించె నిట్లు దొడంగి
యయ్యిరువురు నొండొరులశరజాలంబులు వారించుచుఁ దురంగంబులయుంగం

1. గిఱిగొనుదొడ్డ

బుల రుధిరంబులు వూరించుచు సారథుల నొప్పించుచు మేనుల వాలమ్ములు
గుప్పించుచు నసదృశంబు లగుకరలాఘవంబులు సదృశంబులుగాఁ బోరునప్పుడు.

మ. ధనురాచార్యుఁడు కేశవానుజధనుర్దండంబు ద్రుంచెన్ గదం
గొని వైచెన్ వడి నాతఁ డగ్గురుఁ డెడం గ్రూరంపుభల్లంబునం
దునుమం గ్రక్కున నొండువిల్లు గొని యుద్యద్దోర్దర్పదుర్దాంతుఁడై
ఘనబాణంబుల నొంచె నించె నతఁ డాకాశంబు గర్జాధ్వనిన్. 49

ఆ. అలిగి గురుఁడు శక్తి నడరింప నది విధి,ప్రేరణమునఁ జేసి తేరు దాఁకెఁ
గాని యతనిఁ దాఁకఁ గానద యతఁడు త,ద్బాహుశాఖ నొంచెఁ బటుశరమున.

వ. నొంచినం గోపించి. 51

క. చాపాచార్యుఁడు సాత్యకి,చాపము దునుమాడి సూతు సమ్మూర్ఛితుఁగా
నేపారి యేయ రథ్య,వ్యాపారము దాన నడపి యతఁ డని సేసెన్. 52

వ. ఆలోన నతనిరథచోదకుండు డెలిసిన నెలమిం బొంది. 53

క. బలువిడి బహుభంగుల నుజ్జ్వలశరములఁ బోరిపోరి శైనేయుఁడు బె
ట్టిలఁ బడ సారథి నేసినఁ, దొలఁగంగాఁ బఱచె ద్రోణుతురగములు వెసన్. 54

ఆ. అచటిరాజలోక మగ్గురునరదంబు, ననినదిక్కు సనుచు సంభ్రమమున
నాఁగికొనుఁడు పట్టుఁడదలుపుఁడేయుఁ డ,శ్వములననఁ దెరలె సైన్యసమితి.

వ. ఇవ్విధంబున నిజరథంబు విఫలమనోరథం బై పోయిన నదియు పోకగాఁ బోయి
సన్నద్ధుం డై సముద్ధతం బైన పాంచాలబలంబుచేతం గలంగుతనమూఁకలం బురి
కొలిపికొని కుంభసంభవుం డవష్టంభవిజృంభణమున సేనాముఖంబునం బొలిచి
నిలిచె నిత్తెఱంగున ద్రోణకృతవర్మదుర్యోధనాదు లగుజెట్టిజోదుల బెట్టు వఱచి
చిఱున వ్రాలయు సాత్యకి సారథితో ని ట్లనియె. 56

క. ఇక్కడఁ గృష్ణుల తేజము, నక్కడఁ బవమాననందనాదిజనులపే
రుక్కును గెలిపించె మనలఁ, జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్. 57

వ. అని పలికి యర్జునుం డున్నదిక్కునకు రథంబు రయంబునం బఱపం బంచిన
వాఁడును నట్ల చేయ విమలాశ్వవేగంబునం జారుభీషణం బగునత్తేరు నీవారికి
దుర్నిరీక్ష్యం బై నభంబున భానురథంబు ననుచందంబున. 58

సుదర్శనుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. అరుగఁగ సుదర్శనుం డను,ధరణీపతి యడ్డపడి[1]యె దర్పమలర న
య్యరువురుఁ బెనంగుటయు న,చ్చెరువుం గావించె నచటిసేనల కెల్లన్. 59

వ. అట్టియెడ నమ్మహీనాథుండు. 60

క. పలుదునియలు సేయుచుఁ దూ,పులు దనదెసఁ జేరనీక పోర శినివరుం
డలిగి తురగముల సారథి, నిలఁ గూల్చి తదుత్తమాంగ మేత్తెఱ నఱకెన్. 61

1, యుద్దత్చెఁ బెలుచ నయ్యెరు.

వ. నఱికి నిజసారథిం జూచి. 62

క. గురుఁ డనుజలనిధి గడచితి, నొరులు దలంపంగ నాకు నులిగాలువ లీ
నరపతుల నరకఁ గొన నీ, వరవము సననిమ్ము నేఁటిరయమని కలయకుమీ 63

వ. అనవుడు వాఁడు నగుచు నీవిక్రమంబునకు నావెరవు సంగడంబు గాదె సంగరం
బున నేమి సేయుదు నెవ్వనిపైఁ దేరు నడపుదు ననిన విని శినివరుండు వివ్వచ్చు
చేతం జచ్చినకరితురగనరనికాయంబులతిట్టలు నూపి యజ్జాడం దేరువఱపుము దె
గాండీవగుణచండనాదంబు వీతెంచుచున్నయది నేఁడు పాండవమధ్యముం డిచ్చిన
ధనుర్విద్యావిలాసంబు మెఱయను బాండుసూనుల కేను జేయుభక్తిస్నేహంబులు
సెప్పను వలయు నాకడంక గని కురువిభుం డిరువురుఫల్గును లనుబుద్ధిఁ గలంగు
నట్లు సేసెద నని పలుకునవసరంబున నద్దెసం గాంభోజయవనసైన్యంబు లతని క
డ్డపడం గడంగిన నవ్వీరుండు గుణంబు సారించి యబ్బలంబువలనికిఁ దేరువఱపించి

క. నానాస్త్రంబులు ముంపర, వే నిగుడఁగ బడలువడినవీరభటులపై
నేనుంగుల గుఱ్ఱంబుల,పీనుంగులమీఁదఁ దేరు పెలుచం బఱపెన్. 65

వ. ఇవ్విధంబున వెండియుం గిరాతశకబర్బరపారదయవనప్రముఖమ్లేచ్ఛసేనల రూ
పడంచి నీమూఁకలు గలఁగం దఱిసి చిత్రవర్మంబు మైచాయగా నారాచంబులు
నఖంబులును విల్లు బలుమొగంబును నై బెబ్బులివోలెం బోవం బోవ దు
ర్యోధన దుశ్శాసన చిత్రసేన వివింశతి శకుని దుస్సహ దుర్ధర్షణ క్రథప్రభృతిరథిక
నికరంబు రభసంబునం బోకుపోకు మను నెలుంగులతోఁ బిఱిందిదెసం దఱిమినం
దత్కలకలంబు విని యుతండు సూతు నాలోకించి. 66

క. మందగతిఁ జనుము నావెను,కం దగిలెడుసైన్యజలధి గ్రిక్కఱ శోషిం
పం [1]దీవ్రశరార్చుల నం,దంద వడిం బఱపి నగుచు నరుగుద మనినన్. 67

క. అతఁ డట్ల చేయ నబ్బల, మతిరయమున నెయిది పొదువ నరిగి కరిచతు
శ్శతియు హయత్రిశతియు వసు,మతిఁ గూల్చెను శినివరుండు మద మెలరారన్.

వ. అంత నిలువక చలంబున నాసేన శైనేయుపై బెట్టు గిట్టి నట్టియెడ. 69

క. నరతురగద్విరదరథో,త్కరములలో నతనిశరము దాఁకనిరూపుం
బరికించియుఁ గానం ద,త్త్వరితత్వంబునకు వేఱ వర్ణన యేలా. 70

క. నరుబాహాస్ఫురణమునకు, సరి యగు నెక్కుడగుఁ గాని సాత్యకిభుజవి
స్ఫురణం బల్పము గాదని, సురనికురుంబంబు వొగడుచుం జూచె నృపా. 71

మ. కురుముఖ్యుండును దోడిసైనికులుఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం
గురియం బిన్నటినవ్వుతో నతఁడు దత్కోదండసూతాశ్వకే
తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై
వెరవుం జేవయు లావునుం దెలిపె నుర్వీనాథ యాసేనకున్. 72

1. దీవ్రతరశరార్చుల, నందఱ వడిఁ బఱపి.

క. కదిసి నరేంద్రుఁడు సూతుని, మదమును దురగములయుబ్బు మానిచి నిశిత
ప్రదరముల నతని యంగము, పొదివె శకునిద్రోహుఁ డుప్పొంగ భుజబల మలరన్. 73

వ. పొదివిన నొదవిన కోపంబునాటోపంబున. 74

మ. ధరణీనాథ మురాంతకానుజుఁడు గాంధారేశు చాపంబునుం
గురువంశాగ్రణి సూతుకంఠము నతిక్రూరాస్త్రపాతంబునం
గర మాశ్చర్యము గాఁగఁ ద్రుంచినఁ దురంగస్తోమ మా మేదినీ
శ్వరు తేరచ్చటు వాయ నీడ్చికొని చెచ్చెం బాఱె దుర్వారమై. 75

వ. ఇత్తెఱంగునం బాఱిన. 76

క. తమ్ములు దొరలును నేలటి, యమ్మనుజాధిపుని పజ్జ కరుగుటయును సై
న్యమ్ము వెఱచఱచి విచ్చిన, నెమ్మదిఁ దనయురుగుదెస శైనిప్రభుఁ డరిగెన్. 77

వ. అనిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 78

క. పులికిఁ బసులు వాఱినక్రియ, నలువురఁ జలమున సిగ్గువిడిచి యట్లొక్కనికో
ల్తలకోర్వక విఱిగినపు, త్త్రులనే మనవిందు నేను రోయకయుంకన్. 79

క. అనుడు నతఁ డవ్విభునికి, ట్లనునీవును నగ్రసుతుఁడు నవినయములు సే
సినఁ బాటిల్లిన యాపద, వినకుండఁగ వశమె మిగుదు విను తెలియంగాన్. 80

వ. అట్లుగా సిరైకోపించి నీకొడుకు పురికొల్ప నంబష్ఠ టంకణ పారద ప్రముఖ దేశం
బుల బలంబులు దుశ్శాసనపురస్సరంబుగా రయంబున నంజని సాత్యకిం జుట్టుముట్టిన
నాజెట్టిమగండు నిజభుజవిక్రమాటోపంబునకుం బాటవంబు దలకొల్పిన. 81

మ. విఱిగెం బెక్కురథంబు లొక్కమొగి నుర్విం గూలె శుండాలముల్
డఱచైరాలెఁ దురంగమావయవసంతానంబు లింతింతలై
కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబులై
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్ సురల్. 82

—దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి పాఱిపోవుట.—

క. రోషమున దుస్ససేనుఁడు, పాషాణప్రదరనిపుణ పార్వతికతతిన్
భీషణముగఁ గవియింప జి, గీషం బొదువ్వుటయుఁ జూడ్కి గెంపారంగాన్. 83

క. శినివరుఁ డారాలెల్లను, దునియలుగా నేయుమగిడి తొరఁగుచునవి వై
చినవారిన నొప్పింపఁగఁ, గనుకనిన మ్మూకఁ విచ్చెఁ గౌరవనాథా. 84

తే. విచ్చుటయు నంటఁదాఁకి యవ్వీరుఁ డంప
వెల్లిఁ దేల్చిన వగ డందివెల్లగిల్లి
యధిప దుశ్శాసనుఁడు మొదలైన యోధ
గణము లెల్లను ద్రోణునికడకుఁ బఱచె. 85

వ. ఇవ్విధంబునఁ దనచేరువకుం జనిన యాదుశ్శాసనునిం గనుంగొని మున్నుశైనేయు
చన్నదెసం బుట్టిన యకోలాహలం బాకర్ణించుచున్న యగ్గురుం డిట్లనియె, 86

క. ఏమి యువరాజ విభునకు, సేమమె సైంధవుని నేమి ƒ సేసె నరుఁడు నీ
కేమిటికి ట్రీరథిక,స్తోమముతో వితెగి తెందుఁ ƒ జొచ్చెద వింకన్. 87

క. అడుకులు దిన్న ట్లగునే, కడుపునఁ గుట్టి త్రినవుడుఁ ƒ గడుఁ బఱచితి నాఁ
డాడ తెలియఁగక పాండుసుతుల, నుడిగి మడుఁగవలసె నిప్పు ƒ డాకసాత్యకిచేన్.

వ. భీమార్జునులబారిం బడి యేమి గాఁ గలవాఁడ వని పలికి యులుక వోడమిన
నంత నిలువక. 89

చ. మఱచితె యాసభ౯ భువనసమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ
వఱచినపాటుఁ బాండవులఁ ƒ బల్కినపల్కులు నాఁటికొవ్వు నే
డెఱయును నెందుఁ బోయె కర్ణాధీరుల వారల నల్గఁ జేసి సి
గ్గఱి తుది నిట్లు లైతి తగు ƒ నక్కట తియ్యన గావె ప్రాణముల్. 90

ఆ. బ్రదుకఁ దలఁచితేనిఁ ƒ బాండునందనులకు, నింక నైనఁ బుడమి ƒ యిచ్చునట్లు
గాఁగ నన్నతోడఁ ƒ గార్యంబుఁ జెప్పు మ,వ్వెడఁగు భీష్మబుద్ధి ƒ వినక చెడితి.

వ. ఇట్లు సేయఁ జాలవైతేని. 92

క. ఎట వోవ వచ్చు నిను ముం,దట నిడుకొని పోర నున్నసగురాజుల నె
క్కటి దోలెడిసాత్యకి నీ, వట దఱుముదు గాక యొదుఁగ ƒ నగునే నీకున్. 93

క. అనుటయు నతండు వినియును, వినని చెవులు సేసి మగుడ ƒ విక్రమమునకు౯
గొనకొని యేమియుఁ బలుకక, చనియె శినిప్రవరు[1]పజ్జ ƒ సమరంబునకున్. 94

వ. తదనంతరంబ యాచార్యుం డవార్యదోర్వీర్యంబు మెఱయం దఱిమి మెఱుంగు
వాలమ్ముల వేఁడిమి నూపిన. 95

శా. పాంచాలక్ష్మావరిసూను సైన్యములు దర్పం బేదుచు౯ వీరకే
తుం డుగ్రంబునఁ దాఁకి యగ్గురుని సూతు న్నొంచి యేనమ్ము లు
ద్దండుం డై తన వాడ నేయుటయు నాతం డల్గి దీప్తోజ్జ్వల
చ్చండాస్త్రంబునఁ గూల్చె నాద్రుపదసంజాతు౯ మహోదగ్రతన్. 96

వ. ఇట్లువీరకేతుండు వడినం గినిసి యతనియన్నలుం దమ్ములు నగుచిత్రకేతుం
డునుసుధన్వుండును జిత్రవర్మయుఁ జిత్రరథుండును ద్రోణురథంబు బాణ
మయంబు సేసిన నతండు. 97

క. వారలరథ్యంబులద,త్సారథులం బొడవడంచి ƒ ధరఁ దొరఁగించె౯
వారిశిరంబులు పువ్వు ల,వారణమై యిడుల్చుగంధవహుఁడుం బోలెన్. 98

వ. అప్పు డాలోకించి ధృష్టద్యుమ్నుండు గెంజాయ రంజిల్లుకన్నులం గన్నీ రొలుకఁ
గవిసి కుంభసంభవునురంబునం గ్రూరనారాచంబులు సొనిపిన మనమూఁకలు
హాహాకారంబు లెసఁగ నతండు మూర్ఛిల్లిన నప్పాంచాలవరుండు. 99

తే. పలకయును వాలునుం గొని ƒ యులఘుజవము

---

1. వెనక ♦ సైన్యయుతుం డై. 2. దఱిమిగిలి చిత్ర,

మెఱయ నేలకు లంఘించి ॥ మెఱుఁగు మెఱచి
నట్లు నని తల గోయుట ॥ కప్పళించి
యెగిరె నగ్గురు తేరిపై ॥ కేపు మెఱయ. 100

వ. అంతటం దెలిసి యాచార్యుండు ధైర్యధురంధరుం డై యెమఱి గడయుఁ బడి
నప్పటికి సాధనంబు లగు జేనకోలం దితూపుల వఱని నొప్పించినం గడుఁగురులు
గఱచిన పెగడువడునట్లు మొగతిరిగి యాద్రుపదనందనుండు నిజస్యందనంబునకు
వచ్చి విల్లు గొని వెల్లేసిన. 101

క. గురుఁ డతనిసూతుఁ దునుముడుఁ, దురగములు రథంబు ననికిఁ ॥ ద్రోలఁగఁ జనువ నా
ధరణీసురోత్తముఁడు బం,ధుర పాండవసైన్యసమితిఁ ॥ దోలెం బెలుచన్. 102

క. కలశజుని తెంపుఁ బెంపును, బలిమియునుం జూచి యపుడు ॥ పాండునృపతనూ
జులదెస సైనికు లెవ్వరు, నలవు మెఱసి కడఁగఁ జాల ॥ రైరి నరేంద్రా. 103

వ. అట్టియెడ. 104

ఆ. అవ్విధమునఁ బల్కి ॥ యాచార్యుఁ డట పుచ్చ, సరిగి దున్నసేనుఁ ॥ డాశ్రిసి ప్ర
వీరుఁ దాఁకుటయును ॥ గౌరవపతి ద్రిగ,ర్తనిబలంబుఁ బనిచెఁ ॥ బోటువడఁగ.

వ. ఆసంశప్తకులలో దండిమగలు మూఁడువేలరథంబులవారు బెట్టు గిట్టిన నావృష్ణి
వీరుండు పంచశతముఖ్యరథికులం బంచత్వంబునొందించి పెఱచతురంగబలంబుల
నెత్తుట జొత్తిల్లం జేసిన నాత్రిగర్తసైన్యంబు దైన్యంబు నొంది ద్రోణుదెసకుం
బఱచెం బఱచినం బోవక యువరాజు శైనేయుతోడ నానానిశితశరంబుల
దురంబు సేయు నతండు. 106

దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడుట.

క. ధనువు దునిమి నవ్విన నీ,తనయుఁడు పటుశక్తి వైచెఁ ॥ దలఁకక యది వ
ల్లునియలుగఁ జేసె సాత్యకి, విను మాతం డతని నొండువిలు గొని నొంచెన్.

ఆ. అలిగి కృష్ణలమ్ముఁ ॥ డతనిచాపంబును, సూతుఁ దురగములను ॥ గేతనంబుఁ
దునిమి సొగయ నేసియును [1]భీమసేను ప్ర,తిజ్ఞ దలఁచి చంపఁ ॥ డెగక చనియె.

వ. అట ధర్మజభీమనకులసహదేవులు సాత్యకి సేనం దఱియం జొచ్చుట యెఱింగి
సైన్యంబులం బురికొల్పికొని ధృష్టద్యుమ్నాదియోధుల మున్నిడికొని తఱిమిన
మనవారును మూర్కొని పెనంగి రాశైనేయుండును నీసేన బడలువడం జేయుచు
మున్నిటం బెచుఁ జోఁ బఱచి పోవు తెఱంగునం బోవుచుండె నంత నక్కడఁ గవ్వడి
యును యుగాంతకాలరుద్రుని కైవడి రౌద్రరసమయమూర్తి యై తనయమ్ములు
మొనల బారిసమరు చుండె మోహారంబు మొగంబున గురుండునుం గాంతేయ
బలంబులం బోరిగొను చుండె నివ్విధంబున నమ్ముమ్మూరచేతను బ్రజాక్షయం బగు
చుండం గురుపతి భారద్వాజునాజి యరసిపోవ వచ్చి యచ్చటం బాండవసైనికుల

1. భీమసేనుప్రతిన దలఁచి చంపఁ డాత చనియె.

సంరంభంబుఁ జూచి యేచి యొక్కరుండును దలకడచి యమ్మెయిన వనజవనంబు సొచ్చు వారణంబునుంబోలెం దఱియం జొచ్చి భీమసేనుం బది బాణంబులను నకుల సహదేవద్రుపదవిరాటద్రౌపదేయుల సాయకత్రయంబులను గేకయు లేవురను శరద్వయంబులను ధృష్టద్యుమ్నుని నిరువదింటను శిఖండిని మూఁటను ధర్మనందనుని నైదుమూఁపులను నేసి మఱియు ననేకనరతురగద్విరదరథనికరంబులం బలు ప్రదరశతంబుల నొప్పించె నప్పుడు. 109

తే. అతనిచాపంబుఁ గుంతీసుతాగ్రజుండు, నఱకెఁ బెఱవారు పొదివిన నుఱక వారి
నెల్లఁ గుంభజుఁ డమ్ములఁ బెల్లఁ దేల్చి, యురవడించి యాసైన్యంబును బ్బడంచె.

వ. కౌరవపతియు మగిడి యాసైంధవుకడకుం జనియెఁ దదనంతరంబ కేకయమహీనాథుండు మార్కొని. 111

క. గురుఁ డెన్నిశరము లేసిన, నెరవున నన్నింటి నన్నివిశిఖంబులఁ దా
మరలిచి బ్రహ్మాస్త్రపరిస్ఫురణము సూపినఁ దదస్త్రమున నయడంచెన్. 112

క. మఱియు నతనిమెయి బాణము, లఱువది గిఱిగొలుప నాబృహత్క్షత్త్రుం డే
డ్తెఱ సూతు నొంప నాతం, డఱిముఱి నారాచతతుల నవ్విభుఁ బొదివెన్.

తే. చిక్కువడఁ జేసి చనుమఱ యొక్కదొడ్డ,నారసమ్మున బిట్టు నరవరుండు
డ్రెళ్ళశిశుపాలతనయుండు ధృష్టకేతుఁ, డమ్మహావీరుపై వీఁక నడరి యవుడు

క. పెనుమంట నుఱుకుశలభం,బునుబోలెం గవిసి కోల్పులిఁ గోల్క వ్రే
సినమాడ్కి నేసె నఱువది,సునిశితబాణముల నశ్వసూతయుతముగన్. 115

తే. బాణఘట్టనఁ గటకటంబడ గురుండు, విల్లు ద్రుంచిన నొండొకవింట నొంచె
నాతఁ డక్కుంభసంభవుఁ డతని విరథుఁ, జేసి యావిలు దునిమినఁ జేవ సెడక.

క. గద వైచిన నది ద్రోణుని, ప్రదరంబుల నడఁగఁ దోమరము శక్తియు బె
ట్టిదముగ నతఁ డడరించిన, మదమున నయ్యోధవరుఁడు మడియించె నెడన్.

వ. ఇట్లు వికలసాధనుం జేసి. 118

క. ఆలోనన మెఱుఁగారెడు,వాలికనారసము చేదివరుహృదయమునం
గీలించినఁ [1]బొడ వెగయుచు, నేలం బడి తన్నికొని చనియె జముకడకున్. 119

క. కని యాతనికొడుకు కడలుం, గనలుం బిరిగొనఁగ దన్నుఁ గవిసినఁ బొదివెన్
ధనురాచార్యుఁడు శీఘ్రం,బున బెబ్బులికొదమ లేడిఁ బొదివినమాడ్కిన్. 120

తే. పొదివి యవలీల నాతనిఁ బొలియఁ జేయ
సమదగతి మాఱుకొని జరాసంధతనయుఁ
డస్త్రగురు నొంచుటయు నతఁ డల్గి యతనిఁ
గూల్చెఁ దత్సైనికులు గనుంగొనుచు నుండ. 121

వ. అట్టియెడ వడముకి ధృష్టద్యుమ్నుండు విన నివ్విప్రవరుం డప్రతిహతశస్త్రవృందు

1. బొడవు సెగసి _ బోఁడిమి సెడి.

గాకేమి చూపునఁ దహించునట్లు తూపులవేఁడిమిం బగఱ రూపడంచుచున్నవాఁ
డనిన నాద్రుపదనందనుం డతని మార్కొనం గడంగునెడ నాతనిం దలకడచి.

ఆ. తత్త్రివర్మ గురుని ξ చాపంబు ద్రుంచిన, వేఱ యొక్కదొడ్డ ξ విల్లు రయము
మెఱయఁగొని యతండు ξ మెఱుఁగులు గిఱిగొను, నారసముల వాని ξ నాము వఱచె.

ఉ. అప్పుడు చేకితానుఁడు శ ξ తాశుగముల్ గురుమేన గ్రుచ్చి తే
రొప్పఱ సూతు నొంచి తుర ξ గోద్ధతి మాన్ప నతండు గన్నులన్
నిప్పులు రాలఁ దద్భుజము ξ నిష్ఠురబాణహతింబు సేసి వే
కప్పి శరాళి సూతుఁడు దెగన్ హయ లోటఱి గ్రెళ్లువాఱఁగాన్. 124

వ. ఇట్లు విరథుండై చేకితానుం డోటమి కోర్చి యమ్మొయిన తొలంగె నిత్తెఱంగున.

క. పెక్కండ్రు దొరలు దనపైఁ, రక్కున రాఁ బఱఁగ ద్రోణుఁ ξ డుద్ధతిఁ దోడ్తో
నెక్కఁగ నితఁడు కుమారుం, డొక్కొ యనఁగ ముదుకఁడయ్యు ξ నుగ్రత మెఱసెన్.

వ. ఆసమయంబునం బాంచాలపతి యాబ్రాహ్మణుండు వృషభంబులుం బోనిభూపా
లుర నెల్లను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాఁడు వారింపవలదే యని
కడంగి మొసలం బురికొలిపికొనుచు నక్కజం బగుకయ్యంబు సేయుచుండం
బాండవాగ్రజుం డాత్మగతంబున. 127

—•• ధర్మరాజు భీముని నర్జునకుఁ దోడ్పడఁ బుచ్చుట. ••—

ఉ. అర్జునుఁ డొంటి పోయె నని ξ యక్కడఁ బుచ్చితి బాహుసారవి
స్ఫూర్జితు సాత్యకిం బెలుచఁ ξ బోవుటయుం గనుఁగొంటి నిద్దఱున్
దుర్జయశత్రుసైన్యములఁ ξ దూండడి నేమయిరొక్కొ విక్రమో
పర్జితవైరి భీముఁడును ξ వారికిఁ దోడుగ నేఁగు నెట్లొకో. 128

క. తమ్మునిఁ దలంచి కృష్ణుని, తమ్ముఁ బనిచె నాతనిం బ ξ నంపఁడె తనచి
త్తమ్మునఁ దలఁపఁడ ధర్మజుఁ, డెమ్మెయివాఁ డొక్కనాఁ డె ξ యీయున్నజనుల్.

తే. పెక్కుచోటుల నెఱిఁగిన ξ యుక్కు లావు, గలుగునీతనిఁ బనుచుట ξ కలుక నేల
యితఁడు గలయ నయ్యిరువురఁ ξ గెలమి వచ్చుఁ, బనుతు నేనటు ξ శోకంబుఁ ξ బాయవలయు.

వ. అని బహువిధంబుల విచారించి నిశ్చయించి. 131

ఆ. భీముఁ జేర నరిగి ξ బీభత్సు నీతమ్ము
నని యెలుంగు గళముఁ ξ నందుఁ దగుల
నస్రు లొలుక మాట ξ యుట సెప్ప లేఁ డతఁ
డార్తి నూఁది యిట్టు ξ లనియె నతఁడు. 132

క. ఏము గలంగినయప్పుడు, నీమహిమయ మమ్ముఁ దేర్చు ξ నీకును గలఁగన్
భూమీశ తగునె యివ్విధ, మేమిటఁ బాటిల్లెఁ బనుపు ξ మేపని కైనన్. 133

చ. అనవుడు నాతఁ డిట్లనియె ξ నక్కడ నప్పుడు పాంచజన్యని
స్వనము వినంగ నైన నట ξ సాత్యకిఁ బుచ్చితి నేమి పుట్టెనో

యను[1]వెత నిష్ఠ యుద్దెస భీషణంబు[2] దిగంబడ నీవు వోయి పా
ర్థునిం గని సింహనాదమున । రోదసి నిండుము మూఁక నింపుగన్. 134

క. నీతమ్ముఁ గట్టు రూపసి, నీకెవ్వఁడు సకలసుగుణనిధి మద్భ్రాత్రం
డాతని కెడ రగునో యను, చేతోగతి పల్లటిల్లఁ । జేయుదె తాల్మిన్. 135

ఆ. అనిన భీముఁ డిట్టు । లనియెఁ దద్రథము రథ్యముల సారథిని శరాసనంబు
నెఱుఁగు నతని నొంది । యొత్తిగిన యది యనీ, కేల వగవ నిపుడ । యేను బోదు.

వ. దేవరయాజ్ఞఁ దల నిడికొని చని యాకృష్ణులఁ గృష్ణానుజుం గలసి యిక్కడ కెఱుక సేయుదు నని పలికి పాంచాలనందనుం గనుంగొని కుంభసంభవుబలిమియు నతని ప్రతిజ్ఞ తెఱంగును నెఱుంగుదు వేమఱ కుండుము నాకుం బోక గర్జంబు కాదు గా కున్న నేలినవానియానతి నడవ వలయు నన నప్పుడు నతండు. 137

క. వినుము భవత్సేనాపతి, తనువునఁ బ్రాణములు గలుగ । ధర్మజుదెసకుం
జనుదెంచువాఁ డెద్దియుఁ, దనమానము దక్కి యడుగు । మర్జునుకడకున్. 138

వ. అనిన ధృష్టద్యుమ్నుపలుకుల కూఱడిల్లి యనిలతనయుం డన్నచరణంబులకుం బ్రణతుండై యాలింగనంబును నాశీర్వాదంబునుం బడసియున్న యప్పుడు శౌరి శంఖవిరావంబు వీతెంచిన నవ్విభుం డవ్విధున కిట్లనియె. 139

క. విను పాంచజన్యపటునిస్వన మదె యది మఱఁది యొడను । సైరింపక కృ
ష్ణునికతము సేయురభసం, బని తలఁచెద నెద్దియు మొద్దియు । ధికరణమునన్.

వ. అనవుడు నవిశేషకల్పితం బగురథంబురవంబును దూర్యనినదంబును దనసింహనాదంబునుం జెలంగ విశోకునిసారథ్యసామర్థ్యంబున రథ్యంబులు నెఱయ మెఱయం గదలి గొనయంబు సారించి కురుబలంబు నవలోకించుచు నడరునవ్వాడముడిం దలపడి నీకొడుకులు నుశ్శల చిత్రసేన కుండభేది వివింశతి దుర్ముఖ దుస్సహులును వికర్ణశలవిందానువిందసుముఖ దీర్ఘబాహుసుదర్శన బృందారకులును సుహస్తసుషేణదీర్ఘలోచనాభయరౌద్రకర్మసుశర్మదుర్విమోచనులును వివిధవిశిఖంబులు వరఁగించుటయు లేశ్యగమింజూచి పొంగుసింగంబుచందంబునం జెలంగి యాశరంబులు వారించుచు వారిం గదిసి బృందారకుం దెగఁజూచి యభయరౌద్రకర్మసుర్విమోచను లనుమువ్వురను మూఁడువెడందతూపులం దునిమిన.

క. చలమునఁ బోవక పెనఁగిన, నల వేర్పడ నతఁడు విందు । ననువిందసుశ
ర్ములఁ జంపి సుదర్శను బె, ట్టిలఁ పైఁ బడి యవుడు సావ । నేసె నరేంద్రా. 142

క. పెఱవారు వెఱచి నలుగడఁ, బఱచిన వాయుసుతుఁ డార్చి । పఱపె రథం బా
తెఱపిన యరుగుట గని గురుఁ, డుఱక యతనిఁ దాఁకి కప్పె । నుగ్రాస్త్రములన్.

వ. ఇట్లు నిలువరించి నిటలంబున నారాచంబు నాటించి యక్కుంభసంభవుండు దనమనంబున వీఁడు విద్యచ్చునట్లు నన్ననుసరింపఁ గలవాఁ డని తలంచి యప్పవనతనయు నుద్దేశించి. 144

1. వెఱ. 2. బుడిపింపఁగ నీవు.

క. నను గెలిచి కాక నీ కే, మ్మనఁ బోఁగా నెట్లు వచ్చు ♦ మాను నీతమ్ముం
డను మతిఁ గై కాదే చోరఁ, గనియె ననుచు నడరెను గన్నుఁ♦గవఁ గెంపారన్.
క. నరుఁ డోకరథికనియమునఁ బుత్రిఁ, జొరఁ దలఁచున మాగధసేన ♦ సురబల మైనం
దెరలిచికొని విచ్చలవిడి, నరుగుం దనకంటెఁ జెడక ♦ నది యుల్లుండెన్. 146
చ. ప్రియములు పల్కి నిన్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడు సుమ్ము దు
ర్జయభుజశక్తినిర్మథితశత్రుఁడు భీముఁడు గాని నీవు దం
డ్రియు గురుఁడుం బ్రియుండ[1]వు నని ♦ ప్రీతి యొనర్చెదఁ బూని వైరికిన్
జయ మొనరింతు గాక యని ♦ సైతునె దర్పము సూపకుండునే. 147
వ. అని పలికి. 148
మ. గద సారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సొలింపి య
మ్మదుకం డుర్విఁకి దాఁటి పోయె నది రథస్మేల్ మింటఁ బర్వంగ బె
ట్టిద మై మ్రోయుచు వచ్చి బల్విడుగుఁ దాకుశ్కిం దాఁకుడున్ గుఱ్ఱముల్
సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వ్రాలిసెన్ ♦ సైన్యంబు భీతిల్లఁగాన్. 149
వ. అప్పు డమ్మేటి మగండు. 150
క. మనమునఁ గ దలిసి యుద్ధతిఁ, జనఁజన నీనందనులు వెసం దాఁకియు ను
బ్బినయతనివీఁక కోర్వక, కనుకని సిగ్గు సెడి పాఱఁగా గురుఁ డంతన్. 151
క. ఒండొక తే రెక్కి సము, ద్దండతఁ జని భీమసేనుఁ ♦ దాఁకి శరము లొం
డొండ నిగిడించి నొంచిన, గండడఁగక యతఁడు గనలు♦గదిరెను మదితోన్. 152
చ. అరదము డిగ్గి యప్పటుశరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరుఁ డయి వాని పైఁ గుఱియ ♦ వంచినమస్తక మొప్పఁ బోవుసుం
దరవృషభంబులీలఁ జని ♦ దర్ప మెలర్పఁగ నొక్కచే నొగల్
వెరవునఁ బట్టి తేరు ప్రజ ♦ విస్మయ మందఁగ వీచి వైచినన్. 153

— ✤ భీముఁడు ద్రోణాదిరథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁబోవుట. ✤ —

ఆ. నుగ్గునూచ మైన ♦ నగ్గురుఁ డొండొక యరద మెక్కి యల్ల ♦ నరిగె సేన
మొగమునకు రయంబు ♦ మిగుల విశోకుఁడుఁ, దేరభీముఁ డెక్కెఁ ♦ దేరు ప్రీతి.
వ. అవ్విధంబున ధనురాచార్యు బెట్టు వఱచి బిట్టు ననునాజెట్టిబిరుదున కెదుర్పం జాలక భోజబలంబును గాంభోజానీకంబును యవనాదిమ్లేచ్ఛసైన్యంబులును బసులు పులికిం బాఱు తెఱంగునం గలంగి పఱచె నట్లు ప్రతిహతగతిం బోయి సాత్యకిసమరోల్లాసంబు గనుంగొనుచు నట్లు కడచి యవ్వాఁడమడి దివ్యరథంబు మెఱయఁ గౌరవ్యయోధులతోడం బెనంగుసవ్యసాచిం జూచి సింహనాదంబు సేసిన నతనిం గనుంగొని ప్రియంబున నయ్యర్జునుండును హరియును గర్జారవంబుల గగనంబు నినిచి రమ్మహారావంబు లాకర్ణించి యుధిష్ఠిరుండు భీమసంజ్ఞాపనం

1. డు నని ప్రీతి_యొనర్చెదఁ...గాక నిను సైఁతునె_యొనర్చెద___మొనరింతుఁ గాకనిన.

బునకు సంతుష్టాంతరంగుం డై తనలోనన యతని నగ్గించి యన్నరనారాయణుల యెలుంగులు వినంగనుటకుం బొంగుచు నప్పార్థుండు దన ప్రతిజ్ఞ నెఱపి వచ్చి తన్నుం గౌఁగిలించుకొనుటం గోరుచుం గౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం దెగం బొలియుట దెలిసి యయినను దీరునకుం బుచ్చి యున్నవారి నైనం గాచికొనునొకో యని యూహించుచుఁ గయ్యంబు సేయుచుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 155

ఆ. ఇట్లు సింహనాద ౯ మిచ్చిన భీముని, మార్కొనంగ మగఁడు ౯ మనబలమునఁ గలిగెనే మదాత్మజులఁ గాల్పఁ బుట్టిన, చిచ్చు వాఁడు వానిఁ ౯ జెనయు టరిది.

చ. అనవుడు నాతఁ డిట్లు లను ౯ నమ్మనుజేంద్రున కప్డు కర్ణుఁ డ
య్యనిలతనూజు మార్కొని రయంబున వింశతిసాయకంబు లే
సిన నతఁ డేడుతొమ్మిదులు ౯ చెచ్చెర నేసి సిడం బొకంట నే
ఫునఁ [1]గుదియించె నారథిక౯పుంగవు లట్లు దొడంగి యుద్ధతిన్. 157

వ. తెనంగునెడ భీమసేనుండు. 158

క. సూతసుతువిల్లు ద్రుంచిన, నాతఁడు బలువింట నొంచె ౯ నతని వెన మరు
త్సూతి యదియుఁ ద్రుంచుచుఁ ద, త్సూతునిఁ దురగములఁ ద్రుంచె౯దుర్దమలీలన్.

ఆ. విరథుఁడై యతండు౯వృషసేనురథ మెక్కఁ, బాఱుటయును గలఁగఁ౯బాఱె సేన లట్టియెడ నృపాలుఁ ౯ డాచార్యుపాలికిఁ, జనియెఁ దేరు దోలి౯కొని రయమున.

దుర్యోధనుఁడు ద్రోణుని దూఱి నాడుట.

వ. చని యడిచిపాటు గదుర నతనితో ని ట్లనియె. 161

క. నరుఁడును సాత్యకియు వృకో,దరుఁడును మనసేనఁ గలఁచె౯దరు సైంధవుఁ జే
రిరి నీకుఁ దగునె నరునిం, జొరనిచ్చితయేని వారిఁ ౯ జొరనీ ననఘా. 162

క. సమరంబున నీ వోడుట, సముద్ర మింకుట జయించె ౯ సాత్యకి గురుఁ గ
య్యమున నని యెసఁగుజనవా,దము మేలుగఁ దలఁచితొక్కొ౯ధనురాచార్యా.

క. ఈభంగి నీ వడంగుట, మాభాగ్యము గాక యింక ౯ మాటలు వల దీ
క్షోభం బెట్టు లుడుగుఁ జెపు,మా భవదీయబలశౌర్య౯మతులకుఁదగఁగాన్. 164

చ. అనవుడు నాతఁ డిట్టు లను ౯ నక్కడ నిక్కడ నొక్కరూపునన్
మనమున నైనయాయెడరు ౯ మాన్పఁగ నోపినయంత మాన్పెద
న్వినుము విశిష్టకార్య మవ౯నీవర సైంధవుఁ గాచికోల య
ర్జునునకు నీకునుం గలిగె ౯ జూదము నాఁ డధికంపుటోడ్డుగాన్. 165

క. మును శకునిబుద్ధిమై గెలి,చినయది యస్థిరపుగెలుపు ౯ సెడ కీజూదం
బున వెడలఁబాటునూ వే, మనవెరవును లావుకలిమి ౯ మనుజాధీశా. 166

వ. కావున నీవు సుస్థిరోత్సాహుండ వై సాహాయ్యంబునకు నద్దెస నున్నకర్ణాదులం

1. నిగిడించె.

గొని కవ్వడి మొదలగునమ్మువ్వురకుంజాలి[1]సింధురాజరక్షణంబు నిర్వహింపు మీను సేనాముఖంబున నిలిచి తక్కినయందఱ నిలువరించుట మేలుపిత్తో వచ్చుట కర్జం బు గాదు పొమ్మనుటయు నతండు మరలి తన్నుం జూన పురికొలిపికొనుచు నట ననియె నప్పుడు యుధామన్యుండును నుత్తమౌజుండును మున్ను కృతవర్మచేత నివారితులై నరునితోడ నుఱుమునం జనక కెలని కుఱికి యుఱిముఱి మనమొన దె రల్చికొని బయలికి వెడలి కపిధ్వజగాంఢీవగుణరావంబులకతంబున నతనియున్న యెడ యుపలక్షించి తిరిగి వచ్చి బలువున మనబలంబు వాయం బాపికొని చొచ్చి విన్వచ్చుం జేర వచ్చుచున్నం గని యక్కురువిభుండు వారల వారింపం గడంగిన.

క. ఆయిరువురతో సజ్జన,నాయకునకు నయ్యె దారుణం బగురణ మం
దాయతనృపచాపము రో,షాయత్తత నుత్తమౌజుం డార్చుచుం దునిమెన్. 168

తే. తునిమి తోడన యురమున మూడు సునిశితాస్త్ర
చయము నిగిడింప రాజొండుచాప మెత్తి
యతనిహయముల సారథి నవనిం గూల్చె
నాతం డరిగె యుధామన్యునరదమునకు. 169

క. అరిగి తురగముల నూతుం, బొరిగొన విరథుం డయి నృపతి పొలివోవక యు
ద్ధురగతి గద గొని చని తత్తురగంబుల సారథిని జక్కుడుప్పలు సేసెన్. 170

తే. రథము డిగ్గి తొలంగి రాజ్రథికు లమ్మ, హీశుం డేతెంచి యెక్కి మద్రేశు తేరు
వారు నీయోధు లిరువుర బారినురి,యూరథము లెక్కి యర్జునుంజేరంజనిరి.

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లను మనవారెల్లం గర్ణుండు గొంతే యుల గెలుచు నని యాసపడుదు రాధర్మతనయుం డాతనియాటోపంబు దలంచి రేలెల్లను గన్ను మూయండు. 172

ఆ. అట్టిజెట్టి యనిలుపట్టిచే విరథుండై, పోయి పోయినట్ల పోయెం గాని
మరలి కయ్యమునకుం జొరం డెట్టు లాతని, తెఱంగు సెప్పునాకుం జేటపడంగ

చ. అనవుడు నాతం డిట్లు లను నన్నరనాథున కట్లు నూతనం
దనుం బొరివుచ్చి భీముండు మదంబున నర్జునుదిక్కు వోవంగాం
గని యతం డాయితం బయి తగం దనపే రెలుగెత్తి పిల్చె నా
ధ్వని విని యావృకోదరుం డుద్ధగ్రతిన్ మరలెన్ మహీశ్వరా. 174

వ. అట్లు దాకొని యుర్కప్రతాపు లగునయ్యిరువురు నొండొరుశరంబులు దూ లించుచుం దురంగంబులయుంగంబులం దూపులం గీలించుచు సారథుల బెట్టు వఱచుచుం జాపంబులు విఱుచుచు మైముఱుపు లఱుపుచు సేయుచు మేనులు నెత్తుట జొత్తిల్లం జేయుచు నొండొరులకు వేఁడిమి సూపి యేపునం బెనంగునెడ నయ్యనిలతనయుండు. 175

1. సింధురాజా ప్రాణంబులు, నిర్వ.

క. విలు దునుమ నేసి గుఱ్ఱం, బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం
బులఁ జెప్పఱిచిన నిగ్గతిఁ, గలఁగి పఱచి యొండురథముఁ గర్ణుం డెక్కెన్. 176

క. అన విని ధృతరాష్ట్రుం డి, ట్టను నమ్మినబంటు పిఱికి యై యిటు పఱవం
గని మందబుద్ధి దుర్యో, ధనుఁ డే మని తలఁచెనొకొ తనచిత్తమునన్. 177

వ. అది యట్లుండె నాకర్ణుసబింకంబు పిదప నెట్లయ్యె ననవుడు సంజయుం డతని
కిట్లనియె. 178

తే. ఆననంబునఁ గ్రోధమహానలంబు, భీషణముగ రాధేయుండు భీముదెసకు
మరలి యురవడిఁ గవియ నయ్యిరువురకును, మహాద్భుతంబగు సంగ్రామమయ్యె నధిప.

క. బలుడేగలకై వడి బె, బ్బులులపగిది మత్తకరులపోలిక దర్పో
జ్జ్వలసింహంబులచాడ్పున, నలవుఁ బలము మెఱయఁ బెనఁగి రారథికవరుల్.

క. పెనఁగు నెడం గర్ణునిది, క్కునఁ జతురంగములు బెట్టుగ నొత్తిల నాభీ
మునిమీఁదఁ గవిసి మంత్రిం, చినయట్టులు గూలె నతనిచేతిబలువునన్. 181

వ. అనవుడు నాంబికేయుండు. 182

క. తోడరెడుకోలఁదియె వానికి, వడముడిభుజవిక్రమంబు వారల మన మె
వ్వాడు వినమొ కర్ణువిసమే, యడిబీరపుఁదులువ గెలుచునె పాండవులన్.

ఉ. సూతసుతుండు పాండునృపసూనులఁ బోర జయించు నంచు గ
ర్వాతిశయంబునన్ మనసుదాంధుఁడు కృష్ణుఁ దృణీకరించి సం
ప్రీతిగ సంధి సేయఁడ యపేతకళంకులు వారు వారి కే
లా తగ వేది దైవము దలంచు రణంబునఁ జేటు సంజయా. 184

వ. తానును దమ్ములుం జెడుదు రింతియ [1]కాక (యొండు గలదే) యది యట్లుండె
భండనంబు తెఱంగు సెప్పు మనిన నమ్మనుజపతికి నాసూతసంభవుం డిట్లనియె.

చ. సమసినఁ సేన జూచి రభసంబునఁ గర్ణుఁడు భీముఁ గిట్టి ద
ర్పము సిగురొత్త ముప్పదిశరంబుల నొంచినఁ గెంపుసొంపు వ
క్త్రమునకు నొప్పు సేయఁగ నతండు వెసన్ విలుద్రుంచి సూతుప్రా
ణముఁ గొనినం జలం బెడఁ బెనంగొన వాహనచోదకుండు నై. 186

వ. అతండు శక్తి వైచిన. 187

క. ఎనిమిదితునియలుగా నది, దునిమి మరున్నందనుండు తొమ్మిదిశరముల్
తను వాడ నేయ బలువిలు, గొని యన్నియు కర్ణుఁ డేసెఁ గ్రూరాస్త్రంబుల్.

క. వాని నెడ నఱికె యప్పవ, మానతనూభవుఁడు నిశితమార్గణములు పై
పై నిగిడింపఁగ రాధా, సూనుండును సాయకముల [2]సోనలు గురిసెన్. 189

క. చెలఁగుపటుసింహనాదం, బులు ఱంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభం
బులక్రియ నొండొరులకు మా, ర్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలులై.

1. ఇది వ్రాతప్రతులఁ బెక్కింట లేదు. 2. సోనగఁ

ఉ. అత్తఱిఁ గర్ణువిల్లును హయంబులు నుగ్గుగ నేసి నెత్తురుల్
జొత్తిల మేన బాణములు సొన్పి మఱుత్సుతుఁ డార్చెనార్చినం
జిత్తము దల్లడిల్లఁ గురుసింహుఁడు దుర్జయుఁ బన్ప నాతఁ డ
త్యుత్తమసాహసప్రకటితోద్ధతి నాజిఁ గడంగఁ దాఁకినన్. 191

తే. బలము లచ్చెరు వంద నస్త్రంబు మెఱసి, సూతుఁ డనిలసుతుఁ దాఁకి విశిఖసాయ
కములనొప్పించి రథతురగములనొంచి, సూతునోనేసెఁ గ్రోధవిస్ఫూర్తినతఁడు.

క. తురగములతలలు సూతుని, శిరము నతనిమస్తకంబు శితశరమున్కా
స్ఫురణమున ధరణిమీఁదం, దొరఁగించెం గర్ణుఁ డేచ్చుఁ గనుఁగొనఁగాన్.

వ. ఆలోనన సూతసూనుండు రథంబు సన్నద్ధంబు సేసికొనినవాఁడు గుటు వప్పాండుతన
యుం దలపడియె నమ్మేటిమగలు కోపంబులు నాటోపంబులు బలంబులుఁ జలం
బులు శౌర్యంబులు ధైర్యంబులు మెఱయఁ దెఱఁగుసం బెనంగి రట్టియెడ. 194

మ. ఖరనారాచము భీమునతమున నాకర్ణుండు బాహాబలా
భరణుం డై నిగిడింప నుచ్చి చని భూభాగంబు నాటంగ నా
తురతం బొంద కతండు విస్ఫురగదం ద్రుంచెం దురంగంబులన్
ధరణిం గూల్చె ధనుర్విలాస మలరం దత్సూతుసిం గేతువున్. 195

మ. విరథుం డయ్యును రాధనందనుఁడు దోర్వీర్యం బవార్యంబుగా
శరజాలంబుల భీముఁ గప్పుట మహాశ్చర్యంబు గావించె భూ
వరుఁ డంతం దనతమ్ము నారథికుఁ గావం బంచె నామున్ముఖుం
డు రయం బారఁగఁ దాఁకె భీమునకు నాటోపంబు దీపింపఁగన్. 196

క. అయ్యంగరాజుతోడం, గయ్యము సేయుచును దుర్ముఖుప్రాణంబుల్
సయ్యనఁ దొమ్మిదియమ్ములఁ, గ్రయ్యక యయ్యక యుతంబు గొనియె నరేంద్రా 198

వ. ఇట్లు భవదాత్మజుండు పడుటయు.

ఉ. ఆతనిఁ జూచి కన్నుఁగవ నశ్రులు గ్రమ్మఁగ సూతసూతి శో
కాతురుఁ డై తదీయరథ మల్లన యెక్కఁగ భీమసేనుఁ డు
ద్ద్యోతితహేమభూషితచక్రశర్ధశమార్గణవిద్ధుఁ జేయుడు
న్నాతశరంబు లన్ని పెన నాటె నతండును దద్భుజంబులన్. 199

వ, దాన్నం గనలి యనిలతనయుండు. 200

ఆ. వాఁడినారసములు మూఁడు కర్ణునిఱొమ్ము, గాఁడ నేయ నాన గడచి నొవ్వ
భయముఁ గదురఁ జేయు రయమున నరదంబు, దోలికొని యతండు దొలఁగఁ బోటె.

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 202

క. విను పౌరుషము నిరర్థక, మనుమానము లేదు దైవ మధికంబు మఱు
త్తనయునిచే నారాధా, తనయుం డి ట్లగుట సెవ్విరోధంబునఁ దలఁపన్. 203

క. అ ట్లన నేల మహాబలు, పట్టికి సురఖచరధనుజపన్నగులును మా

క్రొట్ట రవిసఁ గర్ణాదుల, కెట్టు నిలువ వచ్చు వాని యెదురం దిరమై. 204

క. పాండవుల గెలుచు నాజి ని,తం డని యగ్గించు సూతతనయుని మత్తు
త్రుం డతఁడు భీము నేపున, గం డడఁగినఁ జూచి మనసు గందక యున్నె. 205

క. విసఁడె జరాసంధాదులఁ, దునుముట మనదుర్జయుండు దుర్ముఖుఁడును భీ
మునితోడఁ బెనగువారే, మని కర్ణునిఁ గావఁ బనిచె నబ్బాలకులన్. 206

క. పవనజుఁ డొక్కఁడె పాండవులును సాత్యకియు హరియు డాఁతురె యుగ్రా
హవమునఁ [1]బ్రాణము లావున, నవిజయ్యులు వారిఁ దొడర నగునే తనకున్.

చ. అని పలుమాట లాడుటయు నమ్మనుజేంద్రునితోడ నాతఁ డి
ట్లను విను మెత్తి క్రోలి యది యంగము నారటపెట్ట నన్యులం
గినిసినయట్లు మీఁదు పరికింపక యిమ్మెయి నీవు పాండునం
దనులకుఁ జెట్టవై హృదయతాపము వచ్చినఁ [2]బల్కె దొండులన్. 208

వ. ఊరక బవరంబు తెఱంగు వినుము నీతనయులు దుర్మర్షణుండును దుర్మదుండును
దుస్సహుండును విజయుండును విచిత్రుండును గర్ణునోటమి సయిరింపం జాలక
వడముడిం దొడరి తూపు లడరించినం జూచి యాసూతసూనుండు దానును
నతనిపయిం గవిసి యేసినఁ దద్విశిఖంబుల వారించుచు మారుతనందనుండు.

ఆ. ఏచి కురుకుమారు లేవురఁ దురగసా,రథులతోడఁ గూడ రయము మెఱయ
వసుధఁ గూల్చె మెఱుఁగువాలారుతూపులఁ, బాఱునిగుడఁ జేసి యద్భుతముగ

క. అనిఁ బడినరాచకొడుకులఁ, గని కర్ణుం డేటి బ్రతుకు గా బ్రదికెద నే
నని యింక నెన్నఁటికి [3]లా,వని భీముని నొంపవలదె యని తెం పెసఁగన్. 211

ఆ. కదిసి డెబ్బదేను కాండంబు లాతని,మేనఁ బఱపి యుబ్బు మిగిలి నవ్వ
నతఁడు నూటయేను శితవిశిఖంబుల, నతని నేసి చాపయష్టిఁ ద్రుంచె. 212

మ. రయ మారన్ బలువిల్లు పుచ్చుకొని యారాధాసుతుం డేయ దు
ర్జయుఁ డమ్మారుతి వొంగి సూతుని వెసం జానేసి విల్ ద్రుంచుచున్
హయసందోహము గూల్చి [4]హాస్యమునకున్ హాసంబు సేయన్ గద
న్భయదాకారత వైచె నాతఁ డది భగ్నం బయ్యె నాభీముచేన్. 213

వ. ఇట్లు గద ద్రుంచి పైపై నేయుపావనిబరవసంబునకుం దెరలక యొండుకోదం
డంబు గొని కర్ణుం డతనితనుత్రాణంబు దునియలు సేసి పెల్లేసిన నతండును
దదీయకంకటంబును భుజంబును భేదించె నిప్పరుసునఁ బాదచారి యై పెనంగు
నయ్యోధవరుం జూచి భూవరుండు సత్వరుం డై పనుపం జిత్రవిచిత్రచిత్రాక్ష
చారుచిత్రులును జిత్రధ్వజచిత్రాయుధచిత్రకర్ములును ధర్మపుత్రానుజుం దాఁకిన
నతండు మహావాతపతితభూరుహప్రతతిభంగి దోఁప నక్కుమారసప్తకంబును
రథసప్తిసారథిసహితంబుగాఁ బొడవడంగం జేసె నానందునఁ గల్పితస్యందనుం

1. బ్రాణంబులు విను, మవిజ. 2. కొడ్డఁ బల్కెదే. 3. రానన. 4. యాస్య...హాస్యంబు.

దై యానూతనందనుం డప్పాండునందనునిపై నురవడించిన. 214

క. అతిమతి నిరువురశరములు, తఱుచుగ నొండొరుల బెట్టు దాఁకిన నయ్యు
ద్ధము నెత్తుటఁ దోఁగి కడుఁ, బఱలిరి కల్పాంతనవదివాకరులక్రియన్. 215

క. అరదములు చిత్రగతులం, జరియింపఁగ ధైర్యములును శౌర్యంబులు ను
ద్ధురబాహావీర్యంబులు, సరియై మెఱయంగ నధికసంరంభములన్. 216

ఉ. ఒండొరుమీఁద సాయకము లొక్కమొగిం బఱఁగింతు రేపునై
నొండొరుబాణముల్ నఱకి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై
యొండొరుమేనులన్ శరము లుచ్చి చనన్ నిగిడింతు రిట్టులు
ద్దండతఁ బోరి రాఱనిమదంబుల నొండొరు మీఱునానఁగన్. 217

క. మరుదాత్మజుఁ డేచిన నన్నరుఁడు హరియు సంతసంబునం బొదలుదు రు
ద్ధురతం గర్ణుఁడు మిగిలినఁ, గర ముబ్బు విభుండు దమ్ముగమియుం దానున్.

తే. సూతనందనునకు నెడ సొచ్చి చొచ్చి, సమదుఁ డగుభీమసేనుచే జచ్చి చచ్చి
బలములఱుగనాకర్ణుండు దొలఁగిపోవఁ, [1]జూచుఁదెగిపోఁడుపడినసీసుతులఁజూచి.

వ. శోకంబునం గోపంబునం గర్ణువిక్రమాటోపంబు దీపించిన. 220

క. గొడుగునను వింటికొమ్మల, సిడమున నరదంబునందు సెల లవిసి జడన్
వడి నిగిడెడుచాడ్పున న,వ్వడముడిదెస నమ్ము లడరె వసుధాధీశా. 221

క. దానికి మనమున నించుక,యైనను దలఁకక సమీరణాత్మజుఁ డవి పై
రానీక నిలిపి యతనిం, దా నిరువదినారసములఁ దలరఁగఁ జేసెన్. 222

వ. అప్పుడు. 223

క. మనవారు వారివారలు, ననిలతనయువిక్రమంబు నగ్గింప సుయో
ధనుఁడు దనయొద్దియోధుల, ననుజులనుం గర్ణుఁ గావుఁ డని పనుచుటయున్.

భీమసేనుచేత శత్రుంజయాది కురుకుమారులు సచ్చుట.

వ. అప్పుడు శత్రుంజయుండును శత్రుసహుండును సుదేహుండును మదనుండును ద్రుముండును జిత్రబాహుండును వికర్ణుండును గర్ణరక్షణపరులై కడిమి వెలయఁ దలకడచి యొక్కట భీమసేనుం దాఁకి [2]ధరాధరంబు నంబుధారలం గప్పు జలధరంబులచందంబున నతని నతినిబిడశరపరంపరలం బొదివినం బెరిఁగిన దర్పంబునం బొదలి యతండు దృఢైకముష్టినిర్ముక్తమార్గణసప్తకంబున వారిం బిలుకుమార్చి యార్చిన నాసింహనాదంబు విని ధర్మతనయుం డది విజయాగ్రజుండు నిజవిజయం బెఱింగించుటగా నెఱింగి మనంబునం బొంగి ద్రోణుదెసకుఁ దఱిమి కయ్యంబు సేసె నట్లు పలువురుదమ్ములు వ్రాలినిన దుర్యోధనుండు దన మనంబున జూదంబునప్పుడు విదురుండు సెప్పినట్ల యగుచున్న దని విషాదంబు

1. జూచి తెగ్గి మోడుపడినసీసుతులఁ. 2. ధారాధరంబులునగంబునంబుధారలంగప్పుచందంబున.

నొంది యీసభ నమ్మెయిఁ బాంచవ్రులం బఱిచినపాపఫలం బనుభవించె ననవుడు
వై చిత్రవీర్యుండు. 225

క. గతవృత్తములకు వగవం, గత మేమి యతండు వెట్టి కార్యము నాదు
ర్మతిఁ దప్పి నోర్చి కొడుకుల,కత విని యెదఁ జెప్పు చెప్పఁగలయది యెల్లన్.

వ. అనిన నతనికి సంజయుం డిట్లను నట్లనిలజుం డార్చినం బేర్చి కర్ణుండతనిపయిం గవిసి
ఘోరసంగ్రామంబు సేయుచుండ నీసేన భీమసేనుఁ జుట్టుముట్టిన నతండు బెట్టి
దంబు లగుభల్లప్రముఖబాణంబులఁ గేతుచ్ఛత్రచామరంబులు సూతరథరథ్య
రథికావయవంబులుఁ దురంగమాతంగసుభటాంగంబులుఁ దునియ నైతొరఁగి
పెరుఁగు నెత్తురుటేఱులఁ బడిం బాఱం జేయుటయుఁ బతితశేషం బగునబ్బలం
బిరుగెలంకులం దొలంగి [1]తెరంపపెట్టునేల కవ్రుల నని చూచుచుండె నెండియు
రాధేయుండు రయంబున నతనిం దాఁకి పోరె నట్టియెడ నమ్మారుతనందనుండు.

క. ఆభీలతఁ గర్ణునికర్ణాభరణము చుక్క వడినట్లు వడఁగ సం
క్షోభితశరమున నేసి మహాభల్ల మురస్స్థలమ్ము నాటఁగ నేసెన్. 228

క. ఆలోనన యారధికుని, ఫాలస్థలి [2]నోలి నేనయుఁ బదినారసముల్
గీలించిన నవి యచ్చట, నీలోత్పలమాలవోలె నెఱయం బొలిచెన్. 229

తే. అలిగి బాణశతంబున నాతఁ డతని, నొంచె నవ్వీరుచాపంబు ద్రుంచె నతఁడ
వఱపి బలువింటఁ గర్ణుండు పటుశరములఁ, బట్టపగలింటిసూర్యునిప్రభలువోలె.

వ. ఇట్లయినాసూతనందనువిల్లు [3]నిదుర్చు దోఁపక గుడుసువడుటఁ జక్రాకృతిం బొ
లుచుననలశిఖలచెలువు దాల్చె నట్టిరయంబునకు భయంబు గొనక భీముండు
నిగిడించుహేమలిప్తనారాచధారలు గగనలక్ష్మికనకాభరణంబులచెన్ను చేకొ
నియె నప్పుడు కోపంబు రూపంబు గైకొన్నకైవడి నుదీర్ణుం డై యక్కర్ణుండు.

చ. పవనజుచాపముల్ పారులపగ్గములుం దునుమాడి కాఁడితో
నవి పెనఁగాడఁగా వెడఁద యమ్మునఁ గేతువుఁ గూల్చి సూతు మే
నవియఁగ నేసినం బఱచె నాతఁడు ఫల్గునుచక్రరక్షుతే
రివెనుక నుగ్రశక్తి యడరించెఁ జలింపక భీముఁ డత్తఱిన్. 232

క. అది సూతనందనుఁడు ద్రోణిముదిశరములఁ దునుముటయు సమీరసుతుఁడు బె
ట్టిదముగ వాలుఁ బలకయు, నదమునఁ గొన నతఁడు పలక నఱకెనఱకినన్.

మ. కరవాలంబున వైచి యారథికువిల్ ఖండింప నొండొక్కని
ష్ఠురచాపం బతఁ డెత్తునంతకు బహ్వాటోపంబుఁ గోపంబు మ
చ్చరముం దేటపడన్ వియచ్చరులు మెచ్చన్ భీముఁ డాసూతసూ
తిరథం బల్లలనాడ దానిపయికిం దెం పొప్ప లంఘించినన్. 234

వ. అతండు కేతనంబునకుం గుదురుగాఁ బెను పొనరం గావించినపీఠంబు[4]నడుగున

---

1. యరపపెట్టున-కొలంది-కవులం. 2. నోలినేయ. 3. నిడుపు-నిలువు. 4. నొదుఁగున-న్డొదుకున.

నొదింగినం దేరిపయి నతనిం గానక భీమసేనుండు నలుదిక్కులుం బరికించి యతని
పాటుటయు లేకున్న నయ్యరదంబు క్రిందం దూఱె నసుతలంపున నతనిం బట్టికొను
వాఁడై దగ్గ ముఱుకుటయుం దోఁచ తోఁచి రాధేయుండు రథచిత్రగతులు మె
ఱయరయంబారఁ బెక్కునారాచంబు లొక్కమొగిం దనువునం జొనుపుచు నేచిన
నయ్యనిలతనయుండు సాధనవైకల్యంబున వెఱంగుపడియును వెన్నిక మున్ను
విష్వచ్చుని చేతం జచ్చినసామజంబుల హయంబులఁ బుచ్చికొని డాచేత నొడ్డుకొనుచు
వలచేత వైచుచుఁ బెనంగె నవియును వివిధవిశిఖంబులఁ దునియలు సేయుచు
నెఱకులునోనేయుచుఁ గర్ణుండు గదిసి తఱుమఁ దదీయస్యందనంబునకు దుర్గమం
బగునని యతం డర్జునాస్త్రపతితంబులైన చతురంగంబులతిట్టలయొలంబు సొచ్చిన.

తే. మొనలతోడను దనతోడ మున్ను పెనఁగి
శ్రమము వొందియు నట్లరదమున కరిగి
వెండియును బోరి కడు డస్సి బెండువడిన
యన్నిరాయుధుఁ జూచి సూర్యాత్మజుండు. 236

క. మనమునఁ గుంతీవాక్యంబును నొలసిన నేయు టుడిగి పోయి కదిసి న
వ్వున మోమొప్ప నతని క్రిట్లను వింటం గదుపు లీల నల్లఁ బొడుచుచున్. 237

కర్ణుఁడు భీమసేను నవమానించి నీచోక్తులు పలుకుట.

ఆ. తిండిపోత నీకు భండనం బేటికిఁ, గడవఁ జేరి మనసు కాంతు దీఱ
నోపుకొలఁది మ్రింగి యూరక నీ వింటఁ, గడన యుండు మింక వడిచిపడక. 238

వ. అని మఱియును. 239

క. వనమున ఫలమూలంబులు, దిని మునివై యుండఁ గాక ధీరోద్ధతి మై
నని సేయ నీకు వచ్చునె, చను మచటికి [1]నుడిఁగి మడఁగి శాంతుఁడవై పోలెన్. 240

వ. అట్లు నీ యొడలుండ దేని. 241

క. చేయలఁతిం గని సమరము, సేయుము నను బోంటితోడఁ జెనయకు నరనా
రాయణులు వారె యచటికిఁ, బోయెదవేఁ బోయి బ్రదుకు పొంక ముడుగుమీ.

క. అని పలికి నట్టియెడఁ గృష్ణునిపనుపున నర్జునుండు సునిశితనారా
చనితాంతపాతములనా, తనిఁ బిఱుసనఁ జేసి భీము దైన్యము వాపెన్. 243

క. మండెడుబలునారసముల, వెండియు నర్జునులాని విష్వచ్చుండు
దండత నేసినయెడ నవి, ఖండించెను గురుసుతుండు గర్వం బలరన్. 244

వ. అప్పు డశ్వత్థామ యుఱువదినాల్గునారసంబుల నొప్పించిన నన్నరుండు నిలు నిలు
మని యదలించిన దొరలి యతండు కరులగమిఁ జొచ్చె నాలోనన యమ్మారుతి
సారథి యగువిశోకుండు తేరాయితంబు సేసి తెచ్చిన నెక్కి యాతండు విన్నని
మొగంబుతోడఁ గవ్వడికడకుఁ జనియె నప్పుడు సాత్యకియు నద్దిక్కునకు నగర్వ

1. నడఁగి మడఁగి.

గమనంబునం బోయె ననిన విని వైచిత్రవీర్యుండు సంజయునితో ని ట్లనియె. 245

క. బలియురతోఁ బగ గొనినం, గలుగునె మే లెల్ల భంగిఁ గౌంతేయులకుం
గలపాలిఁ దగుఁ దోడ్తోఁ, గలిమియుఁ గీర్తియును బొలియఁగా విన వశమే. 246

క. విను మడుగులపైఁ బడియై,నను జెంగలి గుడిచి యైన నరులకుఁ బగ లోఁ
గొని యరుల[1]కినుపడఁచి బ్రదు,క నవలయునిహమ్ముఁబరముఁ గలుగునె చెడినన్.

క. తా నెఱుఁగఁ డొరులు సెప్పిన, నైనను విన నేరఁ డట్టియతిబాలిశు నిం
కే నేమందుఁ గొడుకు దు,ర్మాని గనునె బ్రదుకుపోకరాకలు దెలియన్. 248

వ. అది య ట్లుండె. 249

ఆ. గురునిఁ గడచి నరుఁడు గురుసేన సొచ్చిన, యపుడ తెగియెఁ గార్యమదియెఁ గాక
కలసి రట్టిబల్లిదులు భీమసాత్యకు, లకట సైంధవుండు హతుఁడ కాఁడె. 250

వ. సమరవిశేషంబు తెఱం గెఱింగింపు మనిన నమ్మహీపతి కతం డి ట్లను నట్లు శైనేయుండు గౌంతేయులం గూడం బోవ నలంబుసుం డను రాజు బలంబు మెఱయ నతని మార్కొనిన నయ్యిరువురకుఁ బరస్పరబాణభంజనంబును వర్మవిదారణంబును మర్మభేదనంబును ధనుర్దళనంబును భూచరఖేచరవిస్మయకరంబును నగు సంగరం బయ్యె నొక్కంత సేపునకు నాశినిపుంగవుండు. 251

క. [2]తురగములఁ జంపి సారథి, శిరము దునిమి కుండలములఁ జెలు వారెడు న
న్నరపతితల యిలఁ బడ ను,ద్ధురభంగి వెసం దవాత్రిసూపు నేసెన్. 252

క. ఏసి యెలమి నరుగఁగ దు,శ్శాసనుఁడు మొగంబుగా వెసన్ నీకొడుకుల్
డాసిన నవ్వీరుఁ డనా,యాసంబున దుస్సేనుసహాయములఁ జంపెన్. 253

వ. చంపి యతనిరథంబునకుఁ గవియుడుఁ ద్రిగర్తు లనేకు లడ్డంబు సొచ్చిన నతండు సేయంగలవారిం బంచశతరథికులం[3](బంచత్వంబు నొందించి బలంబుల) బడలు వడం జేయఁ బెఱవారు విఱిగిన నాసత్యకసుతుండును మెఱసి చన శూరసేన సైనికులు దొడరుటయు దోర్విలాసంబు నెఱపి పఱపి కళింగులు గవిసినన్ గం డడంచి కడచి గాండీవిం గనుంగొని జలాశయంబు[4] వెలువడి సుస్థలంబు సేరిన ట్లాశ్వాసించుచున్న నచ్యుతుం డయ్యాధవరు నాలోకించి నరు నుద్దేశించి. 254

మ. కృతవర్మాదులఁ జెప్ప నేల గురునక్షీణప్రభావంబు ము
న్నితఁ డెబ్భంగి నడంచె నొక్కఁ డొకరుం డి ట్లొప్పుమై రాకకుం
గత మాధర్మజుపంపు నీదెస సమగ్రస్నేహముం జూపెఁ జూ
చితె నీశిష్యుని సాత్యకిం బటుభుజశ్రీగర్వనిర్వాహకున్. 255

1. పెను పడఁచి. 2. హయులఁ బడ నేసి సారథి. 3. ఇది పెక్కింట లేదు. 4. వెలువడి సింధురంబు సుస్థలంబు సేరిన ట్లాశ్వాసితుండు గా నచ్యుతుండు.

వ. మన కింత ప్రియం బగునే యనిన నతనికి నయ్యింద్రనందనుం డిట్లను నితని రాక
నా కప్రియంబై తోఁచె నెట్లంటేని ధర్మరాజరక్షణంబున కితనిం జాలించి వచ్చితి
మీరథికుం డచ్చట లేమి నతం డే మగునో యెఱుంగ మాచార్యపతియును భార
ద్వాజాచారి యున్నవాఁడు సైంధవుండును నేలకు వ్రాలంబు ప్రొద్దుసుం బెద్దయు
వ్రాలె నది యట్లుండె బలసారోదాప [1](లైనగురుకృతవర్మాదు) లగున నేకయోధ
వీరులతోడం బోరి రథ్యసారథిసహితంబుగా నిష్ఫలపార్థపరుండు డప్పిం బడి
తెప్పిఱం గాననియాలోనన కయ్యంబున డయ్యనివాఁడును సహాయసంపన్నుం
డును నగుభూరిశ్రవుం డదె తలపడఁగడంగెను నక్కురుసింహుండు శక్తిచాతుర్య
శౌర్యధైర్యాస్త్రవీర్యసమగ్రుండునుం గావున నిది సాత్యకికిఁ జాల డెప్పరం బైన
తెఱంగు వాటిల్లెఁ బాండవాగ్రజుం డీయన నిక్కడ కేల పుత్తెంచె గురుసామి
షంబునకు వేయుడేగచందంబునఁ దనకు వేచుట దలంపవలవదే యనుచున్నసమ
యంబున నాసోమదత్తసూనుండు శైనేయున కడ్డంబు వచ్చి నిలు నిలు మని
యదల్చి వెండియు. 256

భూరిశ్రవుఁడు సాత్యకితో యుద్ధంబు చేసి మడియుట.

సీ. తేఁకువ లేక పుత్తెంచిన [2]యప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపు గాఁగ
వచ్చుచో మార్కొని ॥ చచ్చినవారల, బంధులోకమునకుఁ ॥ బ్రమద మొసఁగ
నంతంతఁ జనుదేర ॥ నాదట గనుఁగొను, శౌరికిఁ బ్రాణంబు ॥ జల్లనంగఁ
బెనఁగించి గెలిపింతు ॥ నని యాన సేయు కి, రీటికి నాలావు ॥ దేటపడఁగ
తే. నాయుధంబులఁ దునిమి రథ్యములఁ గూల్చి
సూతుఁ దెగటార్చి తనువునశ్శోణితంబు
వఱపి వఱపుదు నిలిచిన ॥ నుఱుక పట్టి
వ్రచ్చి పడవైతు నెందు వో ॥ వచ్చు నీకు. 257
క. అనిన విని నవ్వి నాతో, నని సేఁతకుఁ దెంపు సేసి ॥ యడరెడురథికుం
గనుట యది నాకుఁ బండువు, వినవే మీ కెల్ల వేడ్కవిత్తని నన్నున్. 258
వ. అని పలికి సాత్యకి మఱియును. 259
ఆ. ఎదుర నుండ వెఱచి ॥ మద మఱి దప్పాగా, వచ్చి యొదిఁగి తేల ॥ పెచ్చువెఱిగి
ప్రేలెదిపుడు పట్టి ॥ నాలుక గోసెద, మాను మాను రిత్తమాట లేల. 260
వ. అనియి ట్లయ్యిరువురు నొండొరులఁ బరుసంబులు వలుకుచుఁ దలపడి పలు
తెఱంగుల మెఱుంగుటమ్ము లొండొరులపై నిగిడించుచు నొకళ్ళొకళ్ళచూర్ణం
బులు మగిడించుచు వర్మంబులు వ్రయ్యనేయుచుఁ దనువులు నెత్తుట జొత్తిల్లం
జేయుచుఁ దమ్ము సేన లేనికపోరు సూచునట్లు సూడం బోరిపోరి పరస్పరతురంగ
దారణంబును మిథస్సూతమారణంబును నన్యోన్యధ్వజపాతనంబును నితరేతర

1. ఇది పెక్కిట లేదు. 2. పాండవాగ్రజునకుఁగడుఁ_యప్పాండవాగ్రజునకు_దల_వంపు_ప్రాపు_గాఁగ

ధనుశ్చాలనంబులును జేసి యాసునం గరవాలంబులుఁ బలకలుం గొని పాదచా
రులై చేరి వివిధచిత్రగతులం బెనంగి పాసి యించుక సేపు డప్పి దీర్చుకొని క్రమ్మఱం
గదిసి పలకలు పఱియలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబు
లను వ్రేటుపోటుల సవదరింప కుండం గాచికొనునోజ మెఱయు చుండి
విన్నాణంబుతగులున మేనులు బెరసిన మల్లయుద్ధప్రకారం బగుపెనంకువకుఁ
జొచ్చి రప్పు డాభూరిశ్రవుండు [1]మేలుచే యయి పోరుట గనుంగొని కృష్ణుండు
జిష్ణున కి ట్లనియె. 261

చ. పెనుమొనతోడ ముట్ట పెనఁగి పెద్దయు డయ్యుటఁ జేసి సోమద
త్తునిసుతుచేతఁ జిక్కి కడు దుర్దశఁ బొందె శినిప్రవీరుఁ డా
తనిఁ దగుఁ గావ నీకయి కదా యిట రాక మృగేంద్రుబారిఁ జొ
చ్చినకరివోలె నయ్యె వెనఁ జేకొని కావుము పాండవోత్తమా. 262

క. అనునెడ భూరిశ్రవసుం, డనూనబల మొప్ప దానవాంతకుననుజ
న్మునిఁ బట్టి పుడమిపై వైచినఁ గ్రిందై యోపినంత సేయుచు నుండెన్.

వ. అమ్మురహరుండు మఱియుం దఱిమి ధనంజయుతో నీకుం దోడ్పడ వచ్చి నీ
శిష్యుం డొరులచేత దురవస్థం బొంద నూర కునికి యుచితం బగునే యనిన నతం
డతని కి ట్లనియె. 264

తే. ఒండుదెసఁజిక్కఁజూడ రాకుండునట్లు,గాఁగ రథములు పయిపయిఁగ్రమ్మవార
లెక్కలెక్కటి పోరెద రిపుడు నాకు, నేయఁగా దగ దీరెండు నిట్టు లుండ.

వ. నెచ్చెలిచావునుం జూడంజాల నీరథికులను వారించెద నయోధ్యాధవరునిం గాచెద
ననియె నప్పుడు సాత్యకి చాల డస్సిన సౌమదత్తి యతిక్రమించి యెగసి (పడ
వైచి) వానివలచేయి నురంబును నిరుగాలం ద్రొక్కి యెక్కుడుమదంబున మణి
కంకణకిరణస్ఫురణసుందరం బగుకరంబు మెఱయుం గృపాణం బెత్తి గళంబు
దునియ వ్రేయువాఁడై పూఁచిన నాభుజం బింద్రధ్వజంబునుంబోలెఁ బొలిచి
నీసైనికులచూడ్కులకు వేడ్కలు సేయ వాసుదేవుండు వేగిరపడి యేయుమేయు
మని పలికినఁ బార్థుం డక్కార్యవోత్తముం జిత్తంబున నగ్గించుచు వెడందవాతి
యమ్ముగ్రక్కునం దొడిగి గాఢాకర్షణంబును దీవ్రతేజంబును [2]రయంబునుం
బరఁగం జేసి యేసినం దునిసి పడి యబ్బాహువు మహాభుజంగంబుచందంబున
శోభిల్లె నిచ్చటిసేన లెల్ల దురపిల్లె నాభూరిశ్రవుండు దన్ను నఫలితప్రయత్నుం
జేసినవాఁడు గాండీవి యగు టెఱింగి యాఱనికోపంబున గ్రాంచుమనంబుతో
నతనిదిక్కు సూచి తగునెలుంగున ని ట్లనియె. 266

ఉ. నీదెసఁ జూడ నొండొకరున్ననిం దగ మూర్కొని పోరుచుండఁ బెం
పేది వినీచకర్మమున కియ్యకొనం దగునే భవాదృశుం

1. మేలుకొయి సైకొని కదియుఁ ౙ రట. 2. రయంబునంజేసి యేసినం.

డీదురుపాయ మగ్గురుఁడొ యింద్రుఁడొ రుద్రుఁడొ నీకుఁ జెప్పె దా
మోదరుఁ డింతపాపమున కోర్వఁగఁ జేయునె విన్న నర్జునా. 267

వ. అనిన విని యతం డబ్బాహ్లికపౌత్త్రు నాలోకించి. 268

చ. నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధువులుఁ దోడుపాటు నీ
చపుఁబనియే నినుం బగఱు సంపఁగఁ గావఁగ లేనిమీాబలా
ధిపతుల దూఱు సాత్యకి యతిశ్రమ మొందినచోటఁ దాఁకి క
ష్టపఱిచి చంపె దీ వతఁడు నచ్చునె యాఱడి యేచు గల్గఁగాన్. 269

వ. మీారండఱు నట్ల కాదే యధర్మపరు లయి యభిమన్యు ననుచితంపుఁజావు చంపితి రని నిరుత్తరుం జేసి యప్పుడు దన్ను నీకొడుకులుం గొందఱు రాజులును నిందించిన నత్తెఱంగునన పలికి వారలపలుకుల నుడిగి గ్లానసౌమదత్తి నుపలక్షించి శోకించి యతనికుందు మాన్పం దలంచి. 270

తే. క్షత్త్రధర్మంబుకీడునఁ గటకటా మ,హాత్మ నీయట్టివాని కిట్లధికపీడ
సేయవలసెనా ప్రతినచర్చింపుమిల్ల, పనులకును మూలమాసుయోధనుఁడ చూవె.

వ. అన్నరపతి నరకంబునం బడం గలవాఁడు నీవు సద్గతిం బొందు మనవుడు నతండు శైనేయు విడిచి యపసవ్యకరంబున శరంబులు వఱుచుకొని ప్రాయోపవేశనమతి నుండి ప్రాణాయామపరాయణుండై యోగయుక్తుం డయ్యె నంత నొడలి కుత్సాహంబు వచ్చి లేచి సాత్యకి కరవాలం బమర్చికొని మాధవధనంజయభీమాశ్వత్థామకృపకర్ణులు వలదు వల దని యెలుంగెత్తి వారింపఁ గ్రోధోన్మాదంబున శిరశ్ఛేదనంబు సేసిన భూరిశ్రవుండు సిద్ధచారణగణాభినందితుం డగుచుఁ బుణ్యలోకంబున కరిగె నాశినివరుండు దన్ను వారించినవారల నుద్దేశించి యభిమన్యువధప్రకారం బుపన్యసించె నప్పుడు మనసైనికు లిట్టుదగునే యనువారును గోపం బేమి సేయింప దనువారును నతనిచేతఁ బడినవాఁ డుడుగునే యనువారును నిది విధివశంబు పొమ్మనువారును నై రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

క. గురుకృతవర్మాదిరథిక,వరులకు నవిజయ్యుఁడై నశవాఁడు శినివరుం
డరయఁగ మహాద్భుతం బ,క్కురువరుచే నాతఁ డిట్లగుట సూతసుతా. 278

— సంజయుఁడు ధృతరాష్ట్రునకు సాత్యకిపరాభవకారణంబు చెప్పుట. —

వ. అనవుడు నతఁ డమ్మహీపతి కిట్లను దీనికిం గారణంబు గల దాకర్ణింపుము సోమవంశవరుం డగు యయాతినందనుం డయినయదునికులంబున జనియించిన దేవమీాఢునకుఁ బుట్టినశూరునికొడుకు వసుదేవుండు రూపగుణంబులం బ్రసిద్ధుండై పెరుఁగుచుండ దేవకుం డనుభూవల్లభుండు దనపుత్త్రికి దేవకికి స్వయంవరమహోత్సవం బాచరించిన నవ్వసుదేవునకై యయ్యాదవాన్వయజాతుండగు శిని యవ్వనితఁ బరాక్రమంబునఁ దేరం గూడినరాజలోకంబుతోడఁ బిరిపోరంజాలక నిల్చిన

సోమదత్తుం డొక్కరుండునుం బోక పెనంగె నయ్యిరువురు నొండొరులచేత విరథులై కృపాణంబులు గొని ధరణికి లంఘించి పోరునెడ నయ్యదువీరుం డాక్రమించి బాహ్లికతనయుం గొప్పు వట్టి యొఱగం దిగిచి యనుకంపపెంపునం జంప నొల్లక తన్ను విడిచినం బోయి సిగ్గునం దల యెత్తి తిరుగ నేరక వనంబున కరిగి హరు నుద్దేశించి పెద్దకాలంబు దపంబుసేసిన పరమేశ్వరుండు ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనినం దత్కాలంబునకు శినియును దదీయసుతుండును గడచనుటం జేసి శినిమనుమని ననిం బడ వైచి తన్నుం జాలుతనయు నీ వలయు నని యడిగిన నద్దేవుం డట్ల యగుంగాక యని యానతిచ్చి యంతర్హితుం డయ్యెఁ దద్వరప్రభావంబున భూరిశ్రవుండు సాత్యకి నిట్లు సేసె నని చెప్పిన నాంబికేయుండు గయ్యం బటుమీఁద నెట్లు సెల్లె ననుటయు సంజయుం డతని కిట్లనియె.

ఆ. సౌమదత్తి యిట్లు నచ్చినఁ దదనంత, రంబ రథము సింధురాజుదెసకు
నరుఁడు నడపఁ బంచె నారాయణు నపుడు, గురుసుతాదిరథికవరులున్నపుడు.

వ. బరవసంబు సేసి యడ్డపడి రట్టియెడఁ గర్ణసాత్యకులకుఁ గయ్యం బయ్యె నత్తెఱంగు వివరించెద వినుము కృష్ణుండు త్రికాలవేది యగుటఁ దనతమ్మునికి భూరిశ్రవుసివలనం బుట్టునెడరు తెఱం గెఱింగి తొలునాఁటిరాత్రి నిజసారథి యగు దారుకునితోడఁ బార్థుని ప్రతిన నెఱపం బూని పలుకునెపంబున మనయరదం బాయితంబు సేసికొని యెల్లి గయ్యంబునకుం గొని రమ్మని చెప్పె నప్పుడెట్టియడి యాలంబులతోఁ బాంచజన్యంబు పూరింపంగలవాఁ డై పలికె నా చందంబున నంతకు మున్న యాసూతునకు నేతేరవలయుతడవు గనుంగొని శంఖంబు పూరించిన వాఁడును శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనువాహనంబుల వేగంబు నెఱయ మెఱయం బొలుచుగరుడకేతనంబు గ్రాలఁ దేరు తత్కాలంబున కొదవం దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు నాశైనేయున కిచ్చినం జూచి కౌంతేయుం డచ్చెరు వందిన నతనికి నవ్విధంబు గొంత సూచించె నిట్లు సాత్యకి సన్నద్ధుండై.

తే. ఏచి నరునకు సాహాయ్య మాచరించు, కౌతుకంబున నేతేరఁ గర్ణుఁ డతని
నధికసంరంభమునఁ దాఁకె నక్కిరీటి, కని జనార్దనుతోడ ని ట్లనియె నగుచు.

క. భూరిశ్రవుండు సచ్చుట, సైరింపక సూతసుతుఁడు సాత్యకితోడం
బోరం దొడంగె మనము వి, చారింపక యెయ్యవలయు సరిగొనకుండన్. 278

ఆ. అనుడు నతఁడు సాలు నతనికి నాచక్ర, రక్షకులు గడంగి రయము మెఱయఁ
గదిసి తోడుపడిరి కావున నక్కడి, చింత వలవ దని ముస్వరాంతకుండు. 279

వ. తేరు సైంధవుని దెసకుం దఱిమె నప్పుడు శైనేయరాధేయులపో రెల్లవారును వెఱంగుపడి చూచుచుండి రత్తెఱంగునసంగరంబు సురాసురగంధర్వులయందునుం గలుగదు విను మట్లు పోరిపోరి యన్నారాయణానుజుండు, 280

—కర్ణుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడి పోవుట.—

చ. నిరుపమశక్తిఁ గర్ణుమెయి ♦ నెత్తురు వఱ్ఱుగఁ జేసి సూతునిం
దురగములన్ సిడంబు వెసఁ ♦ ద్రుంచి రథంబును నాతపత్త్రముం
దర మిడి నుగ్గుసేసె వసుధావర తమ్ములు రాజుఁ జూడ న
ప్పురుషత నూఁచి చేయఁ గలశార్భవు లాతనిఁ జుట్టు ముట్టినన్. 281

క. శరవేగము రథగమనస్ఫురణవిచిత్రతయు మెఱయఁ ♦ బోరి యతం డ
య్యరదములఁ గములు సుడివడఁ, దెరల మరలఁ బఱవఁ జేసి ♦ దీపించె నృపా. 282

క. అనుటయు ధృతరాష్ట్రుఁడు గృష్ణునిరథమును రథ్యములును సూతుఁడు నగుటన్
శినివరునకు నుత్సాహం, బనూన మగుచు చూపె యంత్యధికుం డయ్యెన్.

వ. అనిన విని సంజయుం డతని కిట్లను నట్టియెడ మున్ను దారుకుండు దేరు దెచ్చు సంరంభంబు సూచి యది కృష్ణునిపను వని యెఱుంగనివాఁ డగుటఁ గయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వానిపిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగుతురంగంబులం బూన్చికొని వివిధాయుధంబు లమర్చికొని కేతనోద్ద్యోతితంబు సేసి యారథంబు వచ్చినజాడ నేతెంచి సన్నిహితుం డగుటయు సాత్యకి సముచితంబుగా నయ్యరదం బెక్కి విక్రమాటోపంబు సూపుచుండ రథాంగధరునిసారథి రథసహితంబుగా నతనికడకుం జనియె నీకొడుకులు కర్ణుం గల్పితరథోదీర్ణుం గావించి రనవుడు నాంబికేయుం డట్లు కిరీటిం గలసి భీముం డేమి సేసె నని యడిగిన.

తే. ఆతనికి సంజయుం డిట్టులనియెఁ గర్ణు,చేత నవమానితుం డయి ♦ చిన్నఁబోయి
పార్థుపాలికి నరిగియుఁ ♦ బలుకకుండెఁ, గినుక నెరియుమనంబుతో ♦ మనుజనాథ.

వ. పదంపడి తన్నాసూతపుత్త్రుండు పలికినపలుకు లాఫల్గునునితో నుగ్గడించి వానిం దొడరి యే నెల్లభంగులం బరిమార్తు ననిన నాతం డవి నా చెవి సోఁక నాడుట నన్నుఁ బలుకుట గాక నీకుం బని యేమి నీ వటుండు మని రాధేయురథంబున కభిముఖుం డై. 286

ఉ. ఏమిర కర్ణ భీము నటు ♦ లేటికిఁ దిట్టితి తండు దోలసి
గ్గేమియు లేక పాఱునెడ ♦ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్చి సం
గ్రామములోనఁ దప్పిదము ♦ గల్గినయంతన యింతగర్వమే
లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే. 287

క. గెలుపును నోటమియును ననిఁ, గలుగవె మొదపెట్టి యెట్టిఘనులకు నిమ్మైఁ
బలుకుదురే తగువారిం, దులువా నీకులము గుణముఁ ♦ దోఁచెం బ్రజకున్.

వ. ఇంతవట్టును వెలారింతు నీమాటలు మఱవకుండు మిదియునుం గాక నాయసన్నిధి నధర్మంబున నభిమన్యువిల్లు దునిమితివి దానికి నీవు గనుంగొనుచుండ ధర్మప్రకారంబున వృషసేనుతల దునుముదు మఱియు నీతోడం గూడ నప్పు డప్పాపం బాచరించినవారిని నిన్నును నెట్లు సేసెదనో యటు సూడు మని పలికి తఱిమిన

మున సైన్యంబు లతిముఱి నతనిపైఁ గవిసినఁ దత్సమరవిహారంబు దారుణప్రకారం బయ్యె మిహిరుండును మందరశ్రీ యగుచువచ్చె నాసమయంబున సుయోధనుండు రాధేయున కిట్లనియె. 289

సీ. శైనేయుఁడును భీమసేనుఁడు నిరుదెస, నర్జునుఁడు సింధురాజుదెసకు
నేఁడ్తెఁ దఱిమెదు । నింక నొక్కించుక, ప్రొద్దాఁగి పెనఁగినఁ । బ్రొద్దు దాను
నస్తమించెడును నీయట్టిజోదునకు శ,ల్యుండును గురునందనుండుఁ గృపుఁడు
దుశ్శాసనుఁడు నేనుఁ । దోడ్పడ నతనికిఁ, జేయార్పవచ్చునె । చేటుకాల

ఆ. మైనఁ బ్రతిన వట్టె । నంతియ తనతోడి,వార సోదరులును । వీరు ననిన
నేల యెల్ల మనము । నేలుద మిత్తఱి, నలవుఁ జలముఁ జూవ । వలయు నీవు.

వ. అనిన విని సూతనందనుం డమ్మానవపతి నాలోకించి. 291

చ. అనిలతనూజుబాణముల । నంగము లెల్లను జాల నొచ్చె నై
నను నను మీఱి వచ్చునె రణంబునఁ గ్రీడికి మేదినీశుమ
న్ననఁ గలమేటిబంటు ప్రథనంబున [1]వింతలు సేయ కున్న నొ
వ్వునె యునిఁ జేర్చువాఁ[2]డ నట । భూవర దైవము సేర్చు నావుడున్. 292

వ. అతఁడు ప్రీతుం డయ్యె నయ్యవసరంబున భీమసాత్యకిసహాయుం డగునాసవ్యసాచి గాడ్పుతోడు గలయగ్ని దేవుండునుంబోలెం దేజరిల్లి భల్లాదిబాణంబులు నీబలంబులపై నిగిడింపఁ జతురంగంబులయవయవంబులుఁ జామరచ్ఛత్త్రకేతుశకలంబులుఁ గోదం [3](డగదాదం) డాదిహేతిఖండంబులుఁ [4]బెరసిపాఱునెత్తురు లేఱులఁ దెట్టువలు గట్టె నట్టియెడ దుర్యోధనకర్ణవృషసేనశల్యకృపాశ్వత్థాములు గడంగి తమతోడన తఱుముజయద్రథుం బిఱిందికిఁ ద్రోచుకొని ప్రొద్దులావునం జేవ యెక్క యక్కిరీటిం దాఁకి తీవ్రశరంబులు వరంగించిన నవి యతండొక్కొక్కటిం బెక్కుతునియలు సేయం దఱిమి యందఱు నొక్కుమ్మడి నొక్కొక్కరుండు పెక్కమ్ము లమ్మధుసూదనధనంజయులతనువులం బఱపిన నన్నరుం డుఱక యొక్కొక్కరునిం బెక్కునారాచంబుల స్రుక్కించి. 293

### —•• కర్ణార్జునులద్వంద్వయుద్ధము. ••—

క. సింధుపతిదెసకు మదవ,త్సింధురగతిఁ గవియఁ జూచి । ధీరోద్ధతిఁ గో
పాంధమతి నడ్డపడియె వ,సుంధర గ్రక్కదల సూతసూనుం డధిపా. 294

వ. అప్పుడు. 295

ఆ. పదియు నేను నిశితబాణంబు లర్జునుఁ, డనిలనందనుండు । శినివరుండు
మూఁడుమూఁడు మెఱుఁగుఱవాఁడితూపులు మేను,గాఁడ నేయ నొచ్చి । కర్ణుఁడలిగి.

క. అఱువదియఱువదియమ్ముల, నెఱఁకులు నొనాడ నేసి । నిలిపి తనరయం
బెఱిఁగించె మువ్వురకు న,త్తెఱఁ గద్భుతరసము వెల్లిఁ । దేల్చె జనములన్.

---

1. వింతలు. 2. దనుట. 3. ఇది వ్రాఁతప్రతుల లేదు. 4. గెడసి-గీడ్చఱచి-గీడ్చెరసి.

ఆ. నరుఁడు నూఱుతీవ్రశరముల నయ్యోధ,వరుసితనువు రక్తవారిఁ దోఁప
నాతఁ డట్టినూఱు నై దడరించె న,వ్వేగమునకు రోషవివశుఁ డగుచు. 298

క. ఆవిజయుఁడు గర్ణునివిలు, వావిరిఁ దునుమాడి విపులపక్షము నవబా
ణావిద్ధము సేసి యతని,జీవము గొనునట్టిఘనవిశిఖ మేసె వడిన్. 299

వ. అది యర్ధచంద్రసాయకంబున నశ్వత్థామ తుంచె నంతం గాంచనభాసితం బగు శరాసనంబు గొని రాధేయుండు రయంబునఁ దీవ్రశరంబులు వరంగింప నర్జునుండు నిలు నిలు కర్ణ యర్జును నెఱుంగవే యనుచు ననేకచండకాండంబులం గప్పినఁ గర్ణుండు నిలునిలు మర్జున కర్ణు నెఱుంగవే యనుచు నతని బహుపటుప్రదరంబులం బొదివె నట్లయ్యిరువురు నొండొరుల కదృశ్యమూర్తులై సురలగ్గింపం బోరుచుండం గౌరవపతి తనవారి నెలుంగెత్తి కర్ణునకుఁ దోడ్పడుం డని పనిచె నక్కాలందికిం గిరీటి గోపాటోపంబున. 300

మ. తురగవ్రాతముఁ గూల్చి సూతుతనువుం దున్మాడి విద్వేషిభీ
కరనారాచపరంపరానిహతి సంగం బార్తి నొందింప నా
తురుఁడై కర్ణుఁడు దర్పహీనుఁ డగుడున్ ద్రోణాత్మజుం డెద్ది యా
త్మరథస్థుండుగఁ జేసి యేసె విజయున్ మద్రేశుఁడుం దోడ్పడన్. 301

తే. కృపుఁడు వృషసేనుడును వారికెడన కూఁడి,పార్థతనువునఁదూపులుపఱపిరట్లు
పొదువునలువురపిఱుఁదనుబొంచిసింధు,వరుఁడు నిగిడించెనమ్ములునరునిమీఁద.

క. గురుతనయప్రముఖరథిక,వరులభుజావిక్రమంబు వారించుచు ని
ర్భరరోషమునం బార్థుఁడు, శరంబు లఱిముఱి నిగిడ్చె సైంధవుమీఁదన్. 303

వ. ఆసమయంబున సుయోధనుండు సేనలకుం జేయి వీచిన నొక్కుమ్మడిం గవ్వడిఁ గదిసి వివిధహేతివ్రాతంబులు మేన నించినఁ గలంక లేక కడంగి. 304

శా. గాండీవంబుగుణంబుఘోరరవ మాకాశంబునం బర్వవే
దండస్యందనఘోటకంబులు మహాస్త్రక్రూరపాతంబుల
న్ఖండీభూతములున్ విదారితములు న్భగ్నంబులుం గా సము
ద్దండుం డై యడరం గలంగి పఱచెం దత్సైన్యసంతానముల్. 305

వ. ఇట్లు ప్రచండమూర్తియై మధ్యందినమార్తాండుండునుంబోలె వెలింగి వివ్వచ్చుండు వియచ్చరుల కచ్చెరు వందించె నిండియుం దొర లందఱు నొక్కుటఁ దఱుమ నతం డదల్చి యమ్ములవెల్లిం దేల్చి తెరల్చి దీప్తబాణపాతపూర్వకంబుగా జయద్రథునకుం గవిసిన నమ్మహారథుండు. 306

క. పోవక హయకేతనగాం,డీవములం బార్థుమైఁ గసడించివడిన్ సై
న్యావళియు దేవతలు నా,నావిధములఁ బొగడ నాటెనారాచంబుల్. 307

క. విజయుం డలనివరాహ,ధ్వజమును సారథిశిరంబు ధర నొక్కట న

క్క జముగాఁ బడ నేసిన నీ ప్రజ దామరపాకనీతిభంగిం దలఁకెన్. 308

క. ప్రాణములు గలుగునంతకుఁ, ద్రాణపరాయణత నీదురథికోత్తము ల
క్షీణజవమునఁ బ్రసారిత, బాణు లగుచు నతని కడ్డపడిరి నరేంద్రా. 309

వ. ఇవ్విధంబునం గృపాశ్వత్థామశల్యవృషసేనులు దొవుసేసి సైంధవున కడ్డంబైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁజూడ నెడ గానక యవ్వుడు గలఁచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డిట్లనియె. 310

ఆ. చక్కఁ [1]జలము పెనఁగఁ జన దింక నినుఁడు పశ్చిమధరాధరంబు సేరఁబోయె
దీని కొకయుపాయ మేను గల్పించెద, దానఁ జేసి కాని దాయ వడఁడు. 311

వ. అది యెయ్యది యంటేని. 312

క. ఇనమండలంబు మఱుపడ, నొనరించెదఁ దమము పాండవోత్తమ యది గ్రుం
కినచంద మైన సైంధవుఁ, డును గౌరవయోధులుం గపుం బ్రమదమునన్. 313

వ. ప్రతిజ్ఞాభంగం బయ్యె నని కయ్యంబుకడంక దక్కి విచ్చలవిడి నొండొరుల మెచ్చుచుఁ బొంగి చెలంగుదు రప్పుడు నీవు నిక్కి దీర్చుకొమ్మని పలికినం బరాక్రమంబు సవ్యాజం బయ్యె నని మనోవ్యథం జెందుసవ్యసాచిం గనుంగొనుచు నమ్మాధవుండు మాయాతిమిరంబునఁ దిమిరవైరిం గప్పిన. 314

క. అది రవి గ్రుంకుటగాఁ గొని, మద మెసకం బెసఁగ నార్చి మనసైన్యంబుల్
పొదలెఁ దలయెత్తి పార్ష్వాస్పదమతి సింధుపతి యపుడు పడమర సూచెన్.

వ. తదవసరంబున. 316

ఆ. ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమర, ద్రిప్పి చూచుచున్నయిద్దురాత్ము
మస్తకంబు దునుము మనలక యని యర్జు, నునకుఁ జూపె సైంధవుని మురారి.

— అర్జునుఁడు సైంధవునితల దునుముట. —

క. అతఁడు గని గంధమాల్యార్చిత మై దొన మెఱయుచున్నశితశర ముగ్రో
ద్ధతి నేయ డేగ పులుఁగును, గతిఁ గొను క్రియ నది హరించె గ్రక్కున శిరమున్.

వ. అప్పుడు సత్వరుం డై. 319

ఆ. శౌరి పార్థ పార్థ సైంధవుతల యిలఁ, బడిన నొప్పు దది నభంబునంద
నిలువఁజేయుము మేను నీ కెఱింగించెద, నత్తెఱంగు దెలియ ననిన నతఁడు.

క. పటుశరముల మీఁదికి డాపటికిం వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె [2]సము, త్కటరయమున శిరముఁ గందుకక్రీడగతిన్. 321

వ. అట్టియెడ. 322

క. మాయపుఁజీఁకటి విరియుడు, దోయజమిత్త్రుండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో
పాయత్తు లై [3]బలంబులఁ, జేయుం గలవారు గడఁగి [4]శితబాణములన్. 323

క. నరుఁ బొదివి రతఁడు వారల, యురవడి వివిధాస్త్రతతుల నుడుపుచు నింగిం

1. బాగి పెనఁగ. 2. ననుత్కటరయమున. 3. చలంబున. 4. చేపారి_చెడి పాఱి_వసన్.

దిరుగ మును నడపుచుండెను, శిరమును నేమఱక యుండెఁ జిత్రస్ఫురణన్.

వ. ఇట్లత్యాశ్చర్యకరణపరిణతబాహువీర్యుం డై విక్రమవిహారంబు సలుపుచుండి.

ఆ. దనుజవైరి యొత్తఁడ విరక నిఱువంగ, వలయు సింధురాజుతల నభమున
నెచట వైచువాఁడ నేమిటి కివ్విధ, మాచరింపవలసె ననిన నతఁడు. 326

వ. వినుము వృద్ధక్షత్త్రుం డను సింధుదేశాధీశుండు సంతానకరణతపోవిశేషంబున నీ
జయద్రథుం బడసె నితండు కుమారుం డై వర్తిల్లునయుంబున నొక్కనాఁ
డశరీరవాణి వీఁడు సంగ్రామంబున నేమఱి తల దునుమంబడు నని యాదేశించిన
నతం డెల్లవారును విన వీనిమస్తకంబు మహిం బడ నెవ్వఁ డేసె వానిశిరంబు
శకలశతం బయ్యెడు మని తనతపంబుబలిమిం బలికి యతనిఁ బట్టంబు గట్టి
వనంబునకు నియతుం డై యరిగె నట్లు గావున. 327

క. ఈతల పుడమిం బడనీ, కాతనితొడమీఁద వైచునది యూపని వి
ఖ్యాతం బగుపాశుపతము, చేతన యగుఁగాక యొంటఁ జెల్లునె మనకున్. 328

వ. ఆవృద్ధక్షత్త్రుండు శమంతపంచకసమీపంబున నుండు నీ వమ్మహనీయాస్త్రంబు
నాశ్రయింపు మనవుడు నర్జునుం డట్ల కాక యని భక్తియుక్తంబుగా నియత
మతిం దత్ప్రయోగం బాచరించిన నద్దివ్యసాధనంబు సాయకపరంపరాకారం
బయి యాశిరం బట గొని చని తదాశ్రమద్వారంబు సొచ్చునప్పు డజ్జనపతి
జపయుక్తుం డై యుండ నమ్మహాస్త్రంబుమాహాత్మ్యంబున నమ్మస్తకం బతని
తొడమీఁద బడిన నతండు దదీయస్పర్శనంబున నెఱింగి దిగ్గన లేచుచుం ద్రోచిన
నది భూతలపతితం బగుటయు. 329

తే. పగిలి యాతనితలనూఱు[1]పఱియ లయ్యె, శౌరి విజయుని నగ్గించె సకలభూత
ములుమహాద్భుతరసమునఁ గొనపుడు, సంహరించె నయ్యస్త్రమ్మ సవ్యసాచి.

క. ఇవ్విధమున సైంధవుతలఁ, గవ్వడి యట నడపుశక్తి గనుఁగొని సేనల్
నివ్వెఱఁ గందె మనంబుల, క్రొవ్వడఁగెను దొరల కెల్లఁ గురువంశనిధీ. 331

సీ. సైంధవుఘోరకబంధంబు దల యిల, బడునంతకును దేరిపైన నిలిచి
మఱికూలుటయును విస్మయముగావించెఁ జూ, పఱ కట్లు పార్థుండు ప్రతిన నెఱపె
నీతనూభవులు గర్సన్నిళ్లులు దొరఁగ న,త్యంతశోకముఁ బొంది రచ్యుతుండు
నన్నరుండును బరమానందకందళి, తాత్ములై రత్తఱి ననిఁ సుతుఁడు

ఆ. నలిఁ జెలంగి సింహనాదంబు సేసిన, విని యుధిష్ఠిరుండు విజయువృత్త
నెఱయ నెఱిఁగి హర్షనిర్భరాకృతి యయ్యె, నుల్లసిల్లి రతనిసయోధు లెల్ల.

వ. అచ్చట నార్పులుఁ దూర్యనినదంబులుఁ జెలంగెఁ దద్బలంబులుఁ బరమప్రమో
దంబునం బొందె నని సంజయుండు సైంధవవధప్రకారంబు ధృతరాష్ట్రుని కెఱిం

1. వ్రయ్య లయ్యె.

గించె నని చెప్పినఁ జిత్తంబు గౌతు కాయత్తం బగుచుండ నటమీఁదివృత్తాంతం [1]జెప్పఁగింపు మనుటయు. 333

ఉ. బిందుచిదాత్మనాదమయ[2]శీతచతుష్కలసద్విహార ని
ష్యందిసుధాకృతీ పరమసౌఖ్య[3]విధాయక చిత్స్వరూప ని
ష్పందనిరంజనాఖిలితశాశ్వతనిర్మలవైభవా మహా
నందరసైక[4]తాత్మలయసన్క్రమ నిష్కల బోధపుష్కలా. 334

క. ఆస్తిక చేతస్సహితా, కౌస్తుభరత్నస్థిమాలికాశబలితవ
క్షస్తల సుమహితనిగమ, ప్రస్తవనీయప్రకార పరమోదారా. 335

మాలిని. శ్రుతిఫలరసభావస్తుత్యమూర్తీ నతార్తి
ప్రతిహనన నితాంతప్రౌఢ హేలావినోదా
యితభువనవితానాహీన[5]నిర్వాహమోహ
వ్యతికరతిమిరప్రధ్వంసనాదీపరూపా. 336

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమదాంధ్రమహాభారతంబున ద్రోణపర్వం బునందుఁ జతుర్థాశ్వాసము. 337



1. బు వివరింపు. 2. సీత. 3. విధాయితస్వరూప. 4. తాంతలయ. 5. నిర్వాణమోహ.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము - పంచమాశ్వాసము.



ధామలసదపాంగ
వ్యాధూతప్రణతదురితవర్గ[1] నిరోహ
ద్బోధాత్మక దేహా జగ
దాధారవిహారనిపుణ హరిహరనాథా. 1

కృష్ణార్జునులు సల్లాపము లొనరించుచు ధర్మరాజుకడ కరుగుచుండుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లద్భుతోదారం బగునరనారాయణులవిక్రమవిహారంబు విని వెఱఁగంది యాంబికేయుండు సంజయుదిక్కు మొగంబై. 2

క. ఇవ్విధమున సైంధవుఁ డా,కవ్వడిచేఁ బడినపిదపఁ గౌరవు లెట్లై
రవ్వార్త సెప్పు మనవుడు, నవ్విభునకు నాతఁ డిట్టు లనియె నరేంద్రా. 3

వ. అట్లు పాండవబలంబులు పొంగి కడంగి కుంభసంభవుమీఁదం గవిసి కయ్యంబు సేసె నాసమయంబున నిక్కడ. 4

చ. కృపుఁడును ద్రౌణియుం గడఁగి క్రీడిపయిన్ శరవర్షముల్ మహో
గ్రపురభసంబునం గురియఁగా నవి మాన్చి యతండు వారలం
గుపితుఁడు గాకయున్ విశిఖకోటుల నల్లన కప్పె పెల్లునం
గృపునిశరీర మొయ్య నొఱఁగెన్ రుధిరచ్యుతి మూర్ఛ వచ్చినన్. 5

వ. ఇట్లు కృపాచార్యుండు రథంబుమీఁదం బడినఁ దత్సారథి దేరు దొలంగం దోలుకొనిపోయె నశ్వత్థామయు నోహటించి తొలంగెఁ దక్కటిరథికులు పైఁ బెట్టం జాలక యంతంత నిలిచి రంత శారద్వతుండు దనయమ్ముల మూర్ఛిల్లుట సూచి సవ్యసాచి వగచె నప్పు డన్నరునిఁ గౌఁగిలించుకొని నారాయణుం డిట్లనియె. 6

1. నిరీహాద్బోధాత్మక-నిరాసోద్బోధాత్మక-నిరోధాబోధాత్మక.

క. కురుబలముఁ బోడరి గెలువఁగ, సురగణముల కైన నరిది । శూరోత్తమ నీ
వురవడి గెలిచితి భాగ్యస్ఫురణంబును బాహుబలముఁ । బొగడం దగదే. 7
క. ఆవృద్ధక్షత్రుతపము, వావిరి నోర్వంగ నీకు । వచ్చినటుల వీ
రావహమునఁ గర్ణు నోర్వం, గా వచ్చినఁ గాదె నాకుఁ । గనుఁ బ్రీతి యగున్. 8
చ. అప్పుడు నాతఁ డిట్లను మహాత్మ భవత్కరుణం బ్రతిజ్ఞ యే
ను నెఱపఁగంటిఁ బాండవమహారథసిద్ధి భవద్దయాసమృ
ద్ధి నగుట వింతయే భవదధీనులకుం విజయంబు ప్రాఁతె నీ
వను పొనరించువార మట । భారము నీమది గాదె [1]యెప్పుడున్. 9
తే. అనుచు సద్గతమందస్మితాస్యుఁ డగుచు, దనుజమర్దనుఁ డతనితో । [2]ధర్మతనయుఁ
గానఁ బోవంగవలయు భాస్కరుఁడు గ్రుంకు, చున్నవాఁ డని పలికిన । నన్నరుండు.
వ. అట్లు గాక యనుటయుఁ గదలి భీమసేనుండును సాత్యకియును యుధామన్యుం
డును నుత్తమౌజుండును సముచితసల్లాపంబులు [3]సేయుచుం దో నేతేర సాంద్ర
శోణితపూరసేకంబున ఘోరం బైనసంగ్రామతలంబునం జని చని శౌరి సవ్య
సాచి నాలోకించి. 11
చ. కరులు రథంబు లశ్వములు । గాలుబలంబు చమూపతుల్ మహీ
శ్వరు లఖిలాస్త్రశస్త్రములు । చామరముల్ గొడుగుల్ సిడంబు లా
భరణము లిత్తెఱంగున । బార్థ కడుం జెలు వొందెఁ జూడ సం
గరమహిఁ జిత్రవస్త్రమునఁ । గప్పినచందముఁ దోఁపఁ జేయుచున్. 12
వ. భవదీయబాహావిహారంబునుదారత్వం బిట్లుండునే యని యగ్గించుచు నరిగి సము
యోచితం బగుటను బ్రతియోధులు ఱెచ్చ్వడి యునికిం జేసియు సమరంబు సా
లించి తమరాక కెదురుచూచుచుం గూడికొని యున్నయుధిష్ఠిరాదులసమీపం
బగుటయుం బాంచజన్యంబు పూరించినం బాండవాగ్రజుండు. 13

—•• సైంధవుని సంహరించి కృష్ణార్జునులు వచ్చి ధర్మజునకు నమస్కరించుట. ••—

తే. రథము డిగ్గి హర్షాస్రులు । గ్రమ్మ దేర, నెదురుకొనుటయు సంభ్రమ । మెసక మెసఁగ
బార్థుఁడును గేశవుండును । బాదచారు, లై రయంబునఁ జని మ్రొక్కి । రవ్విభునకు.
వ. ఇట్లు ప్రణమిల్లిన. 15
క. నరపతి యానందాస్రులు, గరసరసిరుహముల నొత్తి । కను దనియఁగ న
య్యిరువురఁ జూచుచు మేనులు, గరువాఱఁగ గ్రుచ్చి యొక్క । కౌఁగిటఁ జేర్చెన్.
వ. ఇవ్విధంబున నాలింగనంబు సేసి యర్జునుతో నతం డిట్లనియె. 17
క. చేసెత్తురు గాకుండం, గా నా సైంధవునిఁ జంపి । క్రమ్మఱ మీరల్
రా నోఁచితి నాభాగ్యం, బేన పొగడునట్టి దయ్యె । నీతని [4]కరుణన్. 18

1. యెయ్యెడన్. 2. మనము ధర్మ, తనయుఁ గానఁ బో వలవదే యినుఁడు గ్రుంకు.
3. సేయ సాంద్ర... పూరసిక్తం బైనసంగ్రామ. 4. కతనన్.

క. అని వాసుదేవుఁ జూపిన, విని యాతఁడు నీమకోపప్రవేగంబున దు
ర్జనుఁ డాజయద్రథుఁడు వొలిసిన నెవ్వరి కెట్లు సేయఁ జెల్లదె యనినన్. 19

వ. అమ్మహీపతి యమ్మహాత్ము నుద్దేశించి. 20

క. దేవాసురసంఘంబులు, నీ వలిగిన రూపమంగు నీకూరిమి సౌ
ఖ్యావహ మఖిలజగములకు, దేవ భవద్భక్తు లరులఁ దీర్పుట యగుదే. 21

వ. అని మఱియు ననేక ప్రకారంబులం బ్రస్తుతించి భీష్మాదు లతనికతన మడియుట యుగ్గడించి నీవు కోపించినట్లు వర్తించుటఁ గౌరవులు సెడిరకాఁ దలంచెద ననుటయు నచ్యుతుం డాభూపాలు నాలోకించి ధర్మోత్కృష్టుండ వగునీకు నరిష్టం బాచరించినవారికిఁ జెడకుండ వచ్చునే యనునెడ ననిలసుతుండును సాత్యకియును దనువులఁ గ్రొత్తగంట్లు గొమరార నద్ధరణీపతిచరణంబులకుఁ బ్రణతు లైన నతం డెత్తి కౌఁగిలించికొని వారలు కుంభసంభవకృతవర్మాదులసంరంభంబు మర్దించుట పేర్కొని యభినందించె యుధామన్యుండును నుత్తమౌజుండును దగిన తెఱంగునం గాంచిన వారి నుచితవచనంబుల సంభావించెఁ దదీయసైన్యం బెల్లను బ్రమోదభరితంబై కర్తవ్యంబునకుం గాలుద్రవ్వుచుండె నాసమయంబున శోకవిస్మయవివశుం డగుచు దుర్యోధనుం డంతర్గతంబున. 22

ఉ. ద్రోణుఁడు గర్ణుఁడుం గృపుఁడు ద్రోణసుతుండును నేల వాని గీ
ర్వాణు లైననుం జెనయ వచ్చునె యెవ్వరు నాజిఁ గౌరవ
త్రాణపరాయణత్వమున దర్పము సూపఁగ లేమి దెల్లము
క్షీణపరాక్రముం డయినకిరీటికి నిక్కపుటల్క వచ్చినన్. 23

వ. అనుచు నుత్సాహరహితం బైనచిత్తం బుత్తలపడఁ గుంభసంభవు పాలికిం బోయి పరులజయంబును దమవారు సమయుటయు నుగ్గడించి మఱియును. 24

సీ. బల్లిదుఁ డగుభీష్ముఁ బడవైచి సోదరవర్గంబుఁ దాను నపవర్గమునకుఁ
గ్రాలెడు నేచి శిఖండి యింతకు మున్న, పొలిసె నేడక్షౌహిణులు గిరీటి
చేత సైంధవుపాటు సెప్పఁ[1] జిట్టలు నాకుఁ, బూని యేతెంచి కాంభోజవిభుఁడు
జలసంధుఁడును సుదక్షిణుఁడును లోనుగాఁ, గలుగుభూపతులు పెక్కండ్రు నేఁడు

తే. గలనఁ గూలిరి వీరిలోఁ గంబ మైన, నొండెఁ బాంచాలబలమును బాండవులను
దండి నైఁ దెగఁ జూచిన నొండెఁ గాక, యెట్లు వాయు నా కిందఱ ఋణము సెపుమ

క. సరుఁ డనుఁగుబంటు గావునఁ, బోరిగొనఁ జోర నీవు సూతపుత్త్రుఁ డొకఁడ యూ
ర్జితమార్గాన నెఱిమెడు నతనికి, వెరవును [2]గఱతలును లేవు పేరీకుం డగుటన్.

వ. అతఁడునుం బోరి పోరి చేష్పడి సైంధవుం గోలుపోయె ననవుడుఁ గటకటంబడి యాచార్యుం డతని కిట్లనియె. 27

చ. నను మది దూఁటుపోవు వచనంబుల నేటికి నిట్లు నొంప న

1. జెట్టలు. 2. 'గరదలను' అనియే ప్రతుల నెల్లఁ జూపట్టెడి.

ర్జునుని జయింప రాదు పలుచోటులఁ జెప్పని దేవకోటి కై
నను సవిజయ్యు భీష్ముఁ బ్రథనంబున నాతఁడు నంపఁ గౌరవుల్
మన రని తోఁచె నాకు నభిమానముఁ గాచుట కై పెనంగెదన్. 29

ఆ. శకునిచేతియడ్డసాళ్లులు నేఁడు గాం,డీవముక్తబహుప్రతిష్ఠబాణ
మూర్తిఁ గవిసి నీకు నార్తి యొనర్పంగ, [1]నాఁక గొనఁగ నెట్టు లగుఁగుమార

క. భూరమణ విదురుఁ డమ్మెయి, వారింపఁగ నతులపుణ్యవతిఁ గృష్ణను మీ
వారెల్లఁ జూడఁ బఱచిన, క్రూరపుఁబాపపుఫలంబు గుడువక యున్నే. 30

క. ఆసభ నీవును మీరాదు, శ్శాసనుఁడును గర్ణుఁడును బ్రశస్తచరిత్రో
ద్భాసితు లగు పాండవులకుఁ, జేసినకీడెల్లఁ భంగిఁ జెఱుపదె మిమ్మున్. 31

ఉ. అన్నివిధంబులం బఱచి యైనను నక్కటికంబు లేక వా
రి న్నెఱి మాలి కానలఁ జరింపఁగఁ బంచినఁ బోయి వచ్చి యా
య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యెసగం బిల వేఁడి కాన కి
ట్లున్నను వారి మాఱ్కొనుట కోర్చితి నే నొకబ్రాహ్మణుండ నే. 32

క. నీవును నచ్చటఁ బన్నిన, నీవారును సైంధవుని నరిని బడ కుండం
గావఁగఁ జాలర యేనును, నీవాఁడన కాని యేల నిందింపంగన్. 33

వ. అని వీకనాఁడి పెండియు. 34

క. పాంచాలురుఁ బాండవులు ను,దంచితగర్వమున నలికిఁ దఱిమి రొండలు మం
డించుచు నుండఁగ నిట్లుసి,కించెద వొకవలన నీవుఁ గీడుపలుకులన్. 35

ద్రోణుఁడు పాంచాలురఁ జంపక కవచంబు విడువ నని ప్రతిజ్ఞ సేయుట.

వ. అని పగతురయుత్సాహం బుపన్యసించి. 36

క. పలుకులఁ బని లే దీరే, తలపెట్టక పోరువా రుగ్రత నేనుం
జలము మెఱయఁ బాంచాలురఁ, బొలియింపక కత్తళంబు పుచ్చ నరేంద్రా.

క. కావున మనసైన్యంబులు, సేవ సెడక సంగరంబు సేయునటులుగా
నీ వుత్సహించి నిజబాహావిభవము సూపు శక్తి కనురూపముగాన్. 38

వ. అని తెంపు సేసి. 39

క. భూసురభక్తియు వృద్ధో,పాసనముం గలిగి ధర్మపథవర్తనని
త్యాసక్తుఁడ వగు మనఘా, నాసుతు బోధింపు వగపునకుఁ జొర కుండన్. 40

వ. నాచేతఁ దెగనిపాంచాలురు గలిగి రేనియు వారిం బోనీక పొదివి తెగఁజూచు
నది యని చెప్పుము. 41

క. అనిపలికి గాఢనిశ్చయ,మున వదనం బెలమిఁ బొందఁ నును [2]కలఁగిననీ
మొన లెల్ల నొక్క మొగముగ, నొనరించి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్.

1. నాఁక గొలుప, మాన్ప నెట్టు లగుఁ గుమార నాకు. 2. కలఁగి కలం,గని. మొనలొక్క మొగంబున.

